# పాల్కురికి సోమనాధుని బసవ పురాణంలోని ముగ్ధభక్తుల కథలు - సమగ్ర పరిశీలన



డా॥ జి.వి. దుర్గాప్రసాద్

# పాల్కురికి సోమనాథుని బసవ పురాణంలోని
# ముగ్ధభక్తుల కథలు - సమగ్ర పరిశీలన



డా॥ జి.వి. దుర్గాప్రసాద్

తిరుపతి

# పాల్కురికి సోమనాథుని బసవ పురాణంలోని ముగ్ధభక్తుల కథలు - సమగ్ర పరిశీలన

డా॥ జి.వి. దుర్గాప్రసాద్

ప్రథమ ముద్రణ

వేయి ప్రతులు

ఏప్రిల్ - ।౨౨౨



వెల రూ. 100/-

ఈ గ్రంథము తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో ప్రచురితం

ముద్రణ :

కీర్తి ఆఫ్‌సెట్

**103,** ప్రకాశం రోడ్

తిరుపతి.

# అంకితం



ఆ కలియుగ
వేంకటనాధుని
పాదపద్మములకు
భక్తితో ...........

- దుర్గాప్రసాద్

# కృతజ్ఞతాంజలి

నాకు పరిశోధన చేసుకొనే అవకాశాన్ని కల్పించిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని తెలుగు అధ్యయన శాఖ వారికి తొలుత కృతజ్ఞతలు సమర్పించు కొంటున్నాను.

నా పరిశోధనకు పర్యవేక్షక బాధ్యతను స్వీకరించి ప్రతిచిన్న విషయంలోను తన అమూల్య సలహాలనందించి, నన్ను ప్రోత్సహించి, నా పరిశోధనను పూర్తి చేయించిన గురువర్యులు డాక్టర్ జి. దామోదర నాయుడు గారికివే నా నమోవాకాలు.

నా పరిశోధనకు సహకరించిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగు శాఖలోని ఇతర అధ్యాపకులందరికీ నా ప్రత్యేక కృతజ్ఞతలు.

పరిశోధన కవసరమైన పుస్తక ప్రతులను అందించిన S.V.U. గ్రంథాలయ సిబ్బందికి నా కృతజ్ఞతలు.

అడిగినదే తడవుగా అభిమానంతో అందంగా పుస్తక ప్రచురణ గావించి యిచ్చిన కీర్తి ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు.

—డా॥ జి.వి. దుర్గాప్రసాద్

# ముందుమాట

తెలుగు సాహిత్య చరిత్ర అనే నదిని ఒక మలుపు తిప్పిన కీర్తి పాల్కురికి సోమనాధునికుంది. శివకవుల్లో అత్యంత ప్రాధాన్యతను పొందినవాడు సోమనాధుడు. ఇతని సాహిత్యం ఎక్కువగా మతపరం కావడంవల్ల కవిగా ఇతనికి రావలసినంత కీర్తిరాలేదన్నది నిర్వివాదాంశం. మత విషయాల్ని వదలి ఇతని కృతుల్ని పరిశీలిస్తే ఇతనిచేతిలో తెలుగుభాష ఎన్ని రూపులు దిద్దుకున్నదో అవగతమవుతుంది. అటువంటి పాల్కురికి సోమనాధుని కవితా వైదుష్యాన్ని గూర్చి, అతని కృతుల్ని గూర్చి ఎందరో పరిశోధకులు ఎన్నో విధాలుగా కృషిచేసి యున్నారు.

ప్రత్యేకించి బసవపురాణాన్ని, అందులోనూ గుండెలకు హత్తుకునే విషయమైన ముగ్ధభక్తుల కథల్ని పరిశోధనాంశంగా స్వీకరించి ఈ కృతికర్త చక్కని పరిశీలన గావించాడు. పరిశోధనాంశాన్ని విషయ విశ్లేషణ కొరకు వింగడించుకోవడంలో పరిశోధకుని నేర్పు స్పష్టమవుతూ వుంది. పన్నెండు విభాగాలుగా విభజించి సూక్ష్మపరిశీలన గావించడం పరిశోధకుని నిశిత పరిశీలనకు ఉదాహరణ.

పాల్కురికి సోమనాధుని వీరశైవతత్త్వం గురించి, అందులో శైవసిద్ధాంతం దాని పరిణామ సంప్రదాయాల్ని గురించి చర్చించడం, అందులోనూ వీరశైవసిద్ధాంతాన్ని గురించి వివరించడం పరిశోధకుని సాహితీ పటిమకు ఉదాహరణ.

భక్తి విశేషాల్ని, భక్తి వర్గీకరణ-నిర్వచనాల్ని ఈ మొదలైన అంశాల్ని వివరణాత్మకంగా తెలియ జెప్పడం చూస్తే పరిశోధకుని బహుగ్రంథ పఠనం విదిత మవుతుంది. ముగ్ధ భక్తులు, వీరవైష్ణవులలో ముగ్ధభక్తులు అని విభాగం చేసుకొని అందులో ఆళ్వారుల ప్రసక్తి తీసుకొచ్చి ఆ ఆళ్వారులతో బసవ పురాణంలోని ముగ్ధభక్తుల్ని పోల్చి చూడడం తెలుగు సాహిత్య పరిశోధనలోనే ఒక వినూత్నాంశం.

డాక్టర్ జి.వి. దుర్గాప్రసాద్ 1986-88 మధ్య కాలంలో శ్రీ వేంకటేశ్వరా విశ్వవిద్యాలయ స్నాతకోత్తర కేంద్రం, కర్నూలులో ఎం.ఏ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. క్లాసులకు సక్రమంగా రావడం, గురువుల యెడ ప్రీతి పూర్వకమైన భయభక్తులు కలిగి వుండడం, అక్షరాల్ని ముత్యాలవలె చక్కగా రాయడం - ఈ కారణాలు దుర్గాప్రసాద్ మీద నాకభిమానాన్ని కలిగించాయి.

1989లో నేను తిరుపతి ఎస్.వి.యూనివర్సిటీకి మారినపుడు దుర్గాప్రసాద్ కూడా తిరుపతికి రావడం జరిగింది. 1992-1996 మధ్య నా పర్యవేక్షణలో "పాల్కురికి సోమనాథుని బసవపురాణం - ముగ్ధభక్తులు" అనే అంశం మీద పరిశోధన చేసి డాక్టరేట్ పట్టాను పుచ్చుకున్నాడు. మృదువుగా మాట్లాడడం, వినయవిధేయతలతో మెలగడం దుర్గాప్రసాద్ సహజ గుణాలు.

చిరంజీవి దుర్గాప్రసాద్ ఇటువంటి పరిశోధనా గ్రంథాల్ని మరిన్నింటిని వెలయించాలని అందుకు ఈ చిరంజీవికి తిరుమల నివాసుడు ఆయురారోగ్యాల్ని ప్రసాదించాలని కోరుకొంటున్నాను.

**డాక్టర్ జి. దామోదరనాయుడు**
తెలుగు అధ్యయనశాఖ
ఎస్.వి.యూనివర్సిటి
తిరుపతి.

# ప్రస్తావన

'పాల్కురికి సోమనాథుని బసవపురాణంలోని ముగ్ధ భక్తుల కథలు - సమగ్ర పరిశీలన' అన్న అంశంపై చేసిన ఈ పరిశోధనా వ్యాసంగాన్ని 12 విభాగాలుగా విభజించడం జరిగింది. తొలి విభాగంలో సోమన జీవిత నేపథ్యంతో పాటు సోమన కాలం, నివాస స్థానం, కులగోత్రాలు ఇత్యాది అంశాలు కూలంకషంగా చర్చించడం జరిగింది. రెండవ విభాగంలో సోమన రచనల్ని పరిచయం చేయడం సంభవించింది. ఆ రచనల్ని తెలుగు కృతులు, లఘుకృతులు, సంస్కృత కృతులు, కన్నడ లఘుకృతుల రూపంలో విభజించి వివరించడం జరిగింది.

తర్వాతి విభాగంలో పాల్కురికి సోమనాథుని వీర శైవతత్వం గురించి సంపూర్ణంగా విశ్లేషించడం జరిగింది. అందులో శైవ సిద్ధాంతం, దాని పరిణామం, దాని సంప్రదాయం, వీరశైవం-దాని స్వరూపం, వీరశైవ సిద్ధాంతం, వీరశైవ మత లక్ష్యాల్ని వివరించడం జరిగింది. మలి విభాగంలో బసవ పురాణ గ్రంథ రచనా విశిష్టత, వివరణల గురించి; తర్వాతి విభాగాల్లో పురాణ లక్షణాలు, బసవపురాణ రచనా కాలం నాటి మత, రాజకీయ, సాంఘిక పరిస్థితులు, బసవపురాణంలోని ముగ్ధభక్తులు, భక్తికి నిర్వచనాలు, భక్తుల వర్గీకరణ, ముగ్ధభక్తి తత్వం, వీరవైష్ణవులలో ముగ్ధభక్తులు-వీరశైవులలో ముగ్ధభక్తులు, తెలుగు వాఙ్మయంలో బసవపురాణ స్థానం, ముగ్ధభక్తుల వల్ల బసవపురాణానికి లభించిన ఖ్యాతి మొదలైన అంశాలు విపులంగా చర్చకు వచ్చాయి.

ద్విపద సాహిత్యంలో పాల్కురికి సోమనాథుడు గ్రంథరచన చేసి తన తర్వాతి తరం వారికి మార్గదర్శకుడిగా నిలిచాడనుట స్పష్టం. సోమన తాను చెప్పే ప్రతి కథలోను శివుని మహత్మ్యం, ఆనాటి శైవభక్తుల కాలంనాటి ఆచార సంప్రదాయాలు, వారి జీవన విధానం వంటి విశేషాల్ని చక్కగా వర్ణించాడు. కేవలం కొన్ని గ్రంథాల్లో వీరశైవ సిద్ధాంతాలు మాత్రమే

ప్రతిపాదితాలు కాగా సోమన ఆగమ శైవ, ఇతర శైవ సిద్ధాంతాల్ని కూడా తన గ్రంథాల్లో ఆవిష్కరింపజేశాడు. సోమన తన బసవపురాణం, పండితారాధ్య చరిత్రల ద్వారా శైవభక్తుల విశిష్ట భక్తిని, వారి ముగ్ధ భక్తి స్వరూపాన్ని చక్కగా విశ్లేషించాడు. ఈ ముగ్ధ భక్తుల భక్తి స్వరూపాన్ని చదువరులకు సాక్షాత్కరింపజేయడమే ప్రధాన ఉద్దేశ్యంగా ఈ పరిశోధన అంశాన్ని గ్రహించడం జరిగింది. సోమన కృతులలో విశ్లేషింపబడ్డ శైవనిరతి, తెలుగు సాహిత్యంపై వీరశైవ మత ప్రభావాల్ని సోదాహరణంగా విశ్లేషించడం ఈ నా పరిశోధన వ్యాసం యొక్క ప్రధాన ఉద్దేశ్యం. నా ప్రణాళికా పరిధిలో గ్రహించాల్సిన విషయాలకు ఈ పరిశోధక వ్యాసం ఒక తార్కాణంగా కొంతవరకైనా నిలుస్తుందని చెప్పవచ్చు.

# విషయసూచిక

# పాల్కురికి సోమనాథుని జీవిత నేపథ్యం

పాల్కురికి సోమనాథుడు శివకవుల్లో ప్రాధాన్యతను సంతరించుకొన్న కవి. శైవమత వ్యాప్తికై తన సర్వస్వాన్ని ఫణంగా పెట్టిన మహా శివభక్తుడు. సోమనాథుడు తన రచనల్ని కావ్యత్వ శోభితాలుగా విలసిల్లజేశాడు. ఇతడు తెలుగు కవుల్లో అగ్రశ్రేణికి చెందినవాడు. అయితే తన రచనంతా కేవలం మతపరమేనని అనిపించుకొనడంవల్ల ఇతనికి శైవేతర వర్గాల్లో రాదగ్గ ఖ్యాతి లభించలేదు.

## కాల నిర్ణయం

పాల్కురికి సోమనాథుని కాల నిర్ణయ విషయంలో పండిత విమర్శకుల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి.

కన్నడభాషలో ప్రముఖ కవి అయిన సోమరాజు తన ఉద్భట కావ్యంలోని పూర్వ కవిస్తుతి ప్రకరణంలో సోమన స్తుతి గావించినట్లు తెలుస్తుంది.[1]

ఈ గ్రంథకర్త హరిదేవాచార్యుని, సోమనను తన పూర్వ కవిస్తుతి ప్రకరణంలో స్తుతించినట్లు తెలుస్తుంది. లాక్షణికులు సోమనకు 'వృషభస్తవామర మహీజారాముఁడు' అనే విశేషణమున్నట్లు తెలియపరిచారు.

అయితే, కన్నడభాషలో గాని, తెలుగు భాషలోగాని వృషభస్తవం చేసిన ఏకైక కవి సోమనాథుడేననీ, అందువల్ల ఈస్తుతి సోమనను ఉద్దేశించినదేనని, విమర్శకులు అభిప్రాయపడుతున్నారు.

బసవపురాణ రచనకు తనను ఆశీర్వదించి ప్రోత్సహించిన ప్రముఖులలో కరస్థలి సోమనాథాయ్య ముఖ్యుడని సోమనాథుడు చెప్పినట్లు క్రింది పద్యం ద్వారా తెలుస్తుంది.[2]

సోమనాథుని బసవపురాణ రచనకు ప్రోత్సహించిన కరస్థలి సోమనాథయ్య గురువైన మల్లిఖార్జున పండితుడు క్రీ.శ. 1170 ప్రాంతంలో పరమ పదించినట్లు లాక్షణికులు అభిప్రాయం. ఈ పండితుని శిష్యులైన కరస్థలి సోమనాథయ్యకు సోమన సమకాలికుడై వుండవచ్చుని లాక్షణికుల వాదన. అయితే, క్రీ.శ. 1170కి పూర్వం బసవపురాణ రచన జరగలేదని, క్రీ.శ. 1170 - 1222ల మధ్యకాలంలో ఈ గ్రంథరచన సాగిందని విమర్శకుల అభిప్రాయం. బసవపురాణంలో బిజ్జలుని రాజ్య విచ్ఛిన్నం ఉదహరింపబడినట్లు క్రింది పద్యం ద్వారా తెలియుచున్నది.[3]

సోమనాథుడు కాకతిరుద్రునకు సమకాలికుడని రాచకవిలెల లోను, కథలలోను వుంది. కాకతీయ రాజులలో మొదటి ప్రతాపరుద్రడే కాకతిరుద్రుడు కావడం, ఇతని రాజ్యకాలం 1135-1199 కావడం వంటివి చారిత్రకాధారాల వల్ల స్పష్టమవడం వల్ల బసవపురాణ రచన 1183వ సంవత్సరం తర్వాత - 12వ శతాబ్దం ముగింపుకు ముందు జరిగి వుండవచ్చని వేటూరి ప్రభాకరశాస్త్రి గారి అభిప్రాయం.

సోమన రెండవ ప్రతాపరుద్రుని కాలంనాటి వాడని, తిక్కనకు తర్వాతి యుగం నాటివాడని, దాదాపుగా ఎఱ్రా ప్రెగ్గడకు సమాకాలికుడని కొందరు వాదిస్తున్నారు. ఈ వాదన అసమంజసమని పలువురు ఖండించారు.

తిక్కన తన నిర్వచనోత్తర రామాయణ అవతారికలో సోమనాథుని పరోక్షంగా అధిక్షేపించిన సందర్భాలు కనిపిస్తున్నాయని కొందరి అభిప్రాయం. తెలుగు వాక్యంలో సంస్కృతాన్ని చొప్పించి, సంయుత్తాక్షరంలో ఏక దేశానికే ప్రాసకూర్చి ప్రాసభంగం చేసి పాతబడిన మాటలు వాడడం వంటి వాటిని తిక్కన నిరసించినట్లు ఈ సందర్భాలలో కనిపిస్తున్నాయి. తిక్కన తన 'భారతావతారిక'లో రచించిన ఒక పద్యంలో సోమనను ఆక్షేపించినట్లు కొందరు తెలియబరుస్తున్నారు.[4]

ఈ నిదర్శనాల వల్ల సోమనాథుడు తిక్కనకు పూర్వుడని చెప్పవచ్చునని కొందరు విమర్శకుల అభిప్రాయం.

సోమనాథుడు పుట్టుకచే కర్ణాటకుడని, తెలుగును తర్వాత నేర్చుకున్నాడని కొందరి ప్రతిపాదన. సోమనాథుని రచనల్ని పరిశీలిస్తే వాటిలో ఎక్కువగా జాను తెనుగు మిళితమైన పదాలు, పదబంధాలు, వాక్యాలు, తెలుగుదేశాన కనిపించే సర్వవస్తు నిర్దేశకాలైన నామాలు, విశేషణాలు, ప్రజల నోళ్ళలో నానినవి వుండడం వల్ల సోమనాథుని మాతృభాష తెలుగని, నేర్చిన భాష కన్నడభాషని ఎక్కువమంది విమర్శకుల అభిప్రాయం.

సోమనాథుడు తమ సమకాలికులని నుడివిన ఇతరులు చరిత్ర ప్రసిద్ధి చెందినవారు కారని విమర్శకుల అభిప్రాయం. తమ కాలంలో వీరు వీరశైవ దీక్షాబద్ధులుగా ఖ్యాతి గడించిన వారేమోకాని వారిని గురించిన శాసనాధారాలేవీ ఇంతవరకు లభ్యం కాలేదని లాక్షణికుల వాదన వల్ల తెలుస్తుంది. కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకాలోని త్రిపురాంతకంలోనే సోమన బసవపురాణ రచన గావించినట్లు అక్కడి శాసనాల ద్వారా తెలుస్తున్నదని విమర్శకుల అభిప్రాయం.[5]

పాల్కురికి సోమనాథుడు తన 'పండితారాధ్య చరిత్ర' గ్రంథ పీఠికలో 'శ్రీపతి పండితుడు' అనే కవి గురించి 'తొల్లి' అనే విశేషణం ఉపయోగించాడు. ఈ 'తొల్లి' అనే పదంవల్ల సోమనాథుడికంటే శ్రీపతి పండితుడు పూర్వుడని తెలుస్తుంది.[6]

## నివాసస్థానం

సోమనాథుని నివాసస్థానం గురించి పలువురు పండితులు, విమర్శకులు భిన్నాభిప్రాయాల్ని వ్యక్తం చేస్తున్నారు. కీ.శే.ఆర్. నరసింహాచార్యులు తన గ్రంథం 'కర్ణాటక కవిచరితె'లో సోమనాథుడు గోదావరి జిల్లా పాల్కురికి గ్రామంలో పుట్టాడని పేర్కొన్నారు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి తను వ్రాసిన బసవపురాణ పీఠికలో సోమన పేరును 'సోమనాథ లింగ' అని సంబోధించి సీసశతక కర్త శైవుడే సోమన అని, అతడు పాల్కురికి గ్రామ నివాసి అని తెలిపాడు.

శ్రీ బండారు తమ్మయ్య సోమనాథుని నివాసస్థానం కాకతీయుల రాజధానిగా చెప్పబడిన ఏకశిలా నగరానికి చేరువలో నున్న పాలకురికి గ్రామం అని తెలిపాడు.[7]

పాల్కురికిని గురించిన ప్రశంస కన్నడ భాషలో నీలకంఠుడు రచించిన 'వీర మహేశ్వర సంగ్రహం', గుబ్బి మల్లణాచార్యుని రచనయైన 'భావ చింతారత్న', భీమన కృతమైన 'బసవపురాణం'లలో వున్నప్పటికీ, ఈ విషయాన్ని బట్టి సోమన నివాసస్థల నిర్దేశనం చేయడానికి వీలులేదని లాక్షణికుల అభిప్రాయం. శ్రీశైల యాత్రా వర్ణన సందర్భంలో సోమనాథుడు కన్నడ పరుస, అరెపరుసల నడకల్ని వర్ణిస్తూ ఆ భాషల్లో కొన్ని ద్విపదల్ని వెలయించినప్పటికీ తమిళ వాఙ్మయంలో సోమనాథుని ప్రసక్తి ఎక్కడా కన్పించనందువల్ల సోమన తమిళదేశం వాడు కాడని విమర్శకుల అభిప్రాయం.

సోమనాథుడు తెలుగులో ఎంత గొప్ప కవిగా కీర్తించ బడ్డాడో అంతగానూ కర్ణాటదేశంలో కూడా కీర్తించబడ్డాడని చెప్పవచ్చు. ఇందుకు కన్నడ భాషలో సోమన రచించిన కొన్ని గ్రంధాలే ఆధారాలని విమర్శకుల భావన. పిడుపర్తి సోమన సోమనాథుడు ప్రతాపరుద్రుని కాలంనాటి వాడని తెలియజేశాడు.[8]

అలాగే సోమనాథుడు తాను బసవ పురాణాన్ని ఏ సందర్భంలో రచించాడో క్రింది పద్యం ద్వారా తెలియజేశాడు.

"సకల తీర్థములకు జనయిత్రియగుచుఁబ్రకటింపనొప్పు శ్రీ పర్వతేంద్రంబు, ఉర్వీఁదత్పర్వత సార్వభౌమునకుఁ బూర్వ వక్త్రాం కవిస్ఫురణ దుల్కాడ, నొలసి కుమార శైలోత్తం సలీలఁదిలకించి పెంపారుఁద్రిపురాంతకంబు"

(బసవపురాణం - 2వ పేజీ)

అంతేకాకుండా సోమనాథుడు తన పండితారాధ్య చరిత్ర రచనా సందర్భాన్ని కూడా ఈ క్రింది పద్యం ద్వారా తెలియజేశాడు.

"కరమొప్పు దక్షిణ కైలాస మనఁగఁ జనుసర్వపర్వత సార్వభౌమధ్యతను బేర్చు శ్రీ గిరీంద్రంబు దానదియు; ...... .ఆ శ్రీశైల శిఖర కలిత త్రిలోక విఖ్యాతయశః ప్రపూర్తియౌ శ్రీ స్వయంభూలింగ చక్రవర్తి .......శ్రీ మల్లిఖార్జున లింగమూర్తి యొప్పారు సమున్నత మహిమ .......వీనులారంగ గురు మల్లిఖార్జున పండితారాధ్యుల చరిత్ర మర్థి వర్ణింపు".

(పండితారాధ్యుని చరిత్ర తొలిపలుకులు)

ఈ ఆధారాల్ని పరిశీలించి చూస్తే సోమనాథుడు తన బసవపురాణం, పండితారాధ్య చరిత్రలు రెండింటినీ శ్రీశైల ప్రాంతంలో వున్నపుడే రచించాడనే విమర్శకుల భావన సమంజసమని చెప్పవచ్చు.

ఇంకా ఈ ఆధారాల వల్ల మైసూరు రాష్ట్రంలోని తుమ్మూరు జిల్లాలోని పాలకురికి గ్రామమే సోమనాథుని నివాసస్థానం గాను, చిన్నతనంలోనే శ్రీశైల ప్రాంతం చేరాడని, పాల్కురికిలో జన్మించడం చేత ఆ గ్రామం పేరే అతని ఇంటి పేరుగా చరిత్రకారులు నిర్ణయించారు.

ఇంతవరకు పలువురు పండిత, విమర్శకులు, లాక్షణికులు, చరిత్రకారులు పరిశీలించిన ఆధారాల్నిబట్టి చూస్తే పాల్కురికి సోమనాథుడు తిక్కనకు పూర్వుడిగా పేర్కొనవచ్చు.

## కులగోత్రాలు

పాల్కురికి సోమనాథుని ఆరాధ్య బ్రాహ్మణుడుగా కొందరు, జంగముగా కొందరు భావిస్తున్నారు. వేదవేదాంగ విద్యలను అభ్యసించి, అనేక శాస్త్రాల్ని చదివి, హరితస గోత్రం కలిగిన పాల్కురికి సూరనకు మరిది సోమన అని కొందరి వాదన. భృంగిరిటి గోత్రం కలిగినవాడు సోమన, అతడు జంగమని

మరికొందరి వాదన. జంగములకు కూడా వేద విద్యాధికారం వుందని వీరి అభిప్రాయం.

సోమనాథుని కాలంలో ఆరాధ్య బ్రాహ్మణశాఖ గాని, జంగమ జాతిగాని వున్నాయనడానికి ఆధారాలు అలభ్యం కావడంచేత, వ్యక్తుల పేర్లకు 'ఆరాధ్య' అనే ఉపపదాన్ని చేర్చినంత మాత్రాన ఆరాధ్య బ్రాహ్మణశాఖ అప్పట్లో వుండేదని చెప్పలేరని విమర్శకులు అభిప్రాయపడుతున్నారు.

బసవపురాణ, పండితారాధ్య చరిత్ర రెండింటిలో అనేకచోట్ల శైవభక్తుల ప్రశంసవుంది. శైవభక్తులు ఈ రెండు గ్రంథాల్లో భూదేవ, భూసురాదినామాలతో సంభోదింపబడినారు. అప్పటిశాసనాల్లో కూడా శివద్విజులు, శివబ్రాహ్మణులనే సంభోదనలు కన్పించేవి. అలాగే శివయోగుల ప్రస్తావన కూడా కనిపించేది ఈ శివయోగులతో పాటు దేవరడియర్, తపస్వులు, అపూర్వులు, శైవాచార్యులు, కడిగై మధ్యస్థులు, కారణత్తార్, వైఖానసులు మొదలైన వారి పేర్లుకూడా శాసనాలలో కన్పించేవి. కానీ ఏ ఒక్క శాసనంలోనూ ఆరాధ్య బ్రాహ్మణులు, జంగములు అనే పేర్లు అగుపించేవి కావు. అయితే 'ఆరాధ్య' అనే పదం శైవులకే కాక ఇతరులకు కూడా వర్తిస్తుందనడానికి 'ఆరాధ్య తీర్థాచార్య' అనే మధ్వాచార్యుని పేరును ప్రమాణంగా చెప్పవచ్చు.

ఈ విషయాలన్నీ పరిశీలించి చూస్తే సోమనాథుని కాలంలోనే కాక అంతకుపూర్వం, తర్వాత కూడా శైవులు చాతుర్వర్ణ్యం పాటించేవారని, జంగములనే వారు గృహస్థాశ్రమాన్ని త్యజించి, సన్యాసులవలె శైవధర్మ ప్రచారంకోసం దేశసంచారం చేస్తుండేవారని, వారిలో వర్ణభేదం పాటించబడేది కాదని, జంగములలో అన్ని వర్ణాలవారు వచ్చి చేరేవారని, జంగములుకాని శైవ గృహస్థులు తమ తమ వర్ణాచారాల్ని యథావిధిగా పాటిస్తూ వుండేవారని, వారిలో శైవబ్రాహ్మణులు సాధారణ బ్రాహ్మణులవలెనే వేద వేదాంగాది విద్యల్లో పరిణతి చెంది వాటికి శైవపరంగా అర్థాల్ని చెప్పుకునే వారని తెలుస్తుంది.

సోమనాథుడు బ్రాహ్మణుడు కాడని, హరితస గోత్రజుడైన సూరనామాత్యునితో బావమరది బంధుత్వం అసత్యమని కొందరి భావన. పాల్కురికి సోమనాథునికి అదే ఇంటిపేరును కలిగివున్న సూరనామాత్యునితో బంధుత్వమెలా పొసగిందని వారి సందేహం. అయితే నారాయణరావు గారి వివరణ ఇలావుంది. పాల్కురికి అనేది ఒకగ్రామం పేరు, ఇదే గృహనామ రూపంలో ఇద్దరికి కుదురుకొన్నట్లు, ఒకే గ్రామానికి చెందినవారు భిన్నగోత్రస్థులు

కావడం అసమంజసం కాదని అభిప్రాయపడ్డారు. ఈ సందర్భంగా వారొక ఉదాహరణని తెలియజేస్తున్నారు. స్వయంగా తన విషయాన్నే ఉదాహరణగా తీసుకొన్నారు. నారాయణరావు గారిది ఆత్రేయస గోత్రమని చెప్పుకొన్నారు. చిలుకురి వీరభద్రరావు గారిది వాధూలస గోత్రంగా చెప్పారు. నారాయణరావుగారు తను మాధ్వుడనని, వీరభద్రరావు గారు నియోగి అని చెప్పారు. ఒకే ఇంటి పేరుగల నారాయణరావుగారు, వీరభద్రరావుగారు భిన్న గోత్రస్థులు కావడం, వారిశాఖలు భిన్నంగా వుండడం ద్వారా సోమన, సూరనల బంధుత్వాల విషయంలో కొంతమంది విమర్శకులు లేవనెత్తిన సందేహాలకు వీరు జవాబు చెప్పారు. అయితే సాధారణ బ్రాహ్మణులలో భృంగిరిటి గోత్రజులు లేరు. వీరశైవులలో మాత్రం వున్నారు. సూరనా మాత్యునిది హరితస గోత్రమైనందు వల్ల ఈ గోత్రం సాధారణ బ్రాహ్మణుల్లో వుందే కానీ వీరశైవులలో కన్పించదు. కనుక పాల్కురికి సోమనాధుడు తాను భృంగిరిటి గోత్రజుడని చెప్పుకొన్నట్లు నిర్ణయించడం కష్టమని విమర్శకుల మతం.

అలాగే సోమనాధుడు తన పూర్వాశ్రమంలో వున్నప్పటి గోత్ర ప్రస్తావన ఎక్కడా తీసుకురాలేదు. అప్పటి ఆ ప్రస్తావన తీసుకురావడం సమంజసం కాదని సోమన అభిప్రాయపడి వుండవచ్చు లేదా అందుకు తగ్గ సందర్భం వచ్చివుండక పోవచ్చు. అందువల్ల సోమనాధుడు పూర్వాశ్రమంలో ఏ గోత్రజుడో పాఠకులకు వివరించాల్సిన అవసరం లేదని కొందరి వాదన. ఇందువల్ల అతని శివబ్రాహ్మణత్వానికి వచ్చిన నష్టమేమీలేదని వారు అభిప్రాయపడుతున్నారు. శివ బ్రాహ్మణులలో హరితస గోత్రజులున్నారని, వారందరూ భవులు కారని, ఒకవేళ భవులే అయితే భవులంటే పడని సోమనాధుడు సూరనను ముద్దుమరది అని సంభోదించి, పండితారాధ్య చరిత్ర కథాశ్రోతగా చేయడమే జరిగివుండదని చెప్పవచ్చు.

# సోమన సాహిత్యనేపథ్యం

బసవపురాణం, పండితారాధ్య చరిత్ర, అనుభవసారం, చతుర్వేదసారం, సోమనాధభాష్యం, రుద్రభాష్యం, బసవ రగడ, గంగ్పోత్తి రగడ, సద్గురు రగడ, చెన్నమల్లు సీసాలు, నమస్కార గద్య, వృషాధిప శతకం, అక్షరాంక గద్యపద్యాలు, పంచ ప్రకారగద్య, అష్టకం, పంచకం, రెండు ఉదాహరణలు మొదలైన కృతుల్ని సోమనాధుడు వెలయించాడని పిడుపర్తి సోమన తన బసవపురాణం (పద్య)లో తెలియజేశాడు.[1] వీటిలో కొన్ని సంస్కృతం, కొన్ని కన్నడ భాషల్లో వున్నాయి. అయితే బసవపురాణం, పండితారాధ్య చరిత్ర, అనుభవసారం, చతుర్వేద సారం, చెన్నమల్లు సీసాలు, వృషాధిప శతకం, ఒక బసవోదాహరణం తెలుగు గ్రంథాలు.

పిడుపర్తి సోమన 'ఆదియగుకృతుల్' అనడం వల్ల ఇందులో చెప్పిన 21 రచనలు కాక మరికొన్నిటిని కూడా సోమన రచించినట్లు తెలుస్తుంది.

## సోమన తెలుగు కృతులు

పద్యకృతులు : అనుభవసారం, వృషాధిపశతకం, చతుర్వేదసారం, చెన్నమల్లు సీసములు సోమన పద్యకృతులు.

## అనుభవసారం

సోమన రచించిన అనుభవసారం వృత్త రచనా వైవిధ్యం కల ఒక లఘుకావ్యం. రచనాశైలిని బట్టి, విషయాన్ని బట్టి ఇది సోమన తొలిరచన అని విమర్శకుల అభిప్రాయం. ఇందులో 243 పద్యాలున్నాయి. ఇందలి పద్యాల్లో 163 కంద పద్యాలు. ఈ గ్రంథం 'శ్రీ'తో ప్రారంభమై 'మంగళమహాశ్రీ'తో ముగుస్తుంది. మహాస్రగ్ధర, త్రిభంగి, క్రౌంచపదం, మాలిని, వనమయూరం అనే విశేష వృత్తాలుకూడా ఒక్కొక్కటి వున్నాయి. గ్రంథాంతంలో రెండు తరువోజలు కూడా వున్నాయి. చతుర్విధ కందమనే పేరిట సోమనాధుడు ఇందులో చిత్ర కవిత్వాన్ని పొందుపరిచాడు.

అనుభవసారంలో కథా రూపమైన ఇతివృత్తమేదీ లేదు. ఇందులో గురుభక్తి మహిమ, భక్తి స్వరూపం, భక్తి లక్షణం, శివపూజా పద్ధతి, ఇష్టలింగార్చనావిధి, జంగమసేవ, షట్స్థల వివరణం, మొదలైన వీరశైవ ధర్మాలు ప్రతిపాదింపబడ్డాయి. తన సహాధ్యాయుడైన గోడగి త్రిపురారిని

కధాశ్రోతగా వుంచి 'మనసిజహరు శుద్ధ భక్తిమార్గం వేదొక్త నిరూఢిఁ బురాణ రహస్య నియుక్తి'ని సోమనాధుడు విస్తరించాడు.

అనుభవసారంలో సోమన మల్లికార్జున పండితారాధ్యుని 'శివతత్త్వసారం' నుంచి గ్రహించిన శివానుభవాన్ని, కరస్థలి విశ్వనాధుని వద్ద సంపాదించిన కవితా శక్తిని విశేషంగా ప్రదర్శించాడని విమర్శకుల భావన. సోమన తనకన్ని విధాలుగా స్ఫూర్తినిచ్చిన పండితారాధ్యుని 'శివుని మహిమ దెల్పినట్టి మల్లికార్జున పండితయ్యగారిదలతు ననుదినంబు' అనే మకుటంతో స్తుతించాడు. ఈ గ్రంథంలోని శైలి దాదాపు నన్నయ శైలిలాగా, సంస్కృత పద మిశ్రమంగా ఉన్నదని విమర్శకులు అభిప్రాయపడుతున్నారు.

## వృషాధిప శతకం

నేడు లభ్యమవుతున్న శతకాలలో శతకమనే పేరును మొదట సార్థకం చేసినది వృషాధిప శతకమేనని విమర్శకుల అభిప్రాయం. పండితారాధ్యుని శతకం 'శివతత్త్వసారం' కాక 'శ్రీగిరి మల్లికార్జునా' అనే మకుటంగల శతకం వున్నప్పటికీ అది అలభ్యమని విమర్శకుల భావన. అందువల్ల వృషాధిప శతకమే శతకాలలో మొదటిదని లాక్షణికులు నిర్ణయించారు.

ఈ శతకం ఆంధ్రదేశంలో వున్న భక్తి శతకాలలో ఒకటని విమర్శకుల అభిప్రాయం. దీనికి సరితూగునది కంచర్ల గోపన్న రచించిన శతకమేనని వారి అభిప్రాయం. పాల్కురికి సోమనాధుడు ద్విపదల్ని ఎంత ధారాళంగా నడుపగలడో వృత్తాల్నికూడా అంతే ధారాళంగా నడుపగలడని ఈ శతకం రుజువు చేస్తుంది. ఈ శతకం 'బసవా! బసవా! వృషాధిపా!' అనే మకుటాన్ని కలిగివుంది. ఈ శతకంలో చంపకోత్పల మాలలు సంఘటితమై వున్నాయి. ఈ శతకమంతా ఒకే వృత్తంలో గాక రెండు వృత్తాలలో తన నడకను సాగించింది. ఈ శతకంలో సోమనాధుడు సమాసాంత్యప్రాసలు, ముక్త పదగ్రస్తాలు మొదలైన శబ్దాలంకారాలను ప్రయోగించి పద్యానికి అర్థ గౌరవాన్నే కాకుండా, శబ్దగాంభీర్యాన్ని ప్రసాదించినట్లు క్రింది పద్యం ద్వారా తెలుస్తుంది.

తజ్ఞ! జిత ప్రతిజ్ఞ! యుచిత ప్రమధాను గతజ్ఞ! నమ్రదై
వజ్ఞ! కళావిధిజ్ఞ! బలవచ్ఛివభక్తి మనోజ్ఞ! దూతశా
స్త్రజ్ఞ! సువాద పూరిత రసజ్ఞ! తృణీకృత పంచయజ్ఞ! స
ర్వజ్ఞ! శరణ్యమయ్య బసవా! బసవా! బసవా! వృషాధిపా!
సురవరమల్ల! మల్లవితసూత్ర సుధాంబుధిఖేల ఖేలసం

గరకల కంఠ! కంఠమణి నాయక భీమభుజంగ! జంగమ స్థిరతరనాథ!
నాధక నిధీకృపరూప! విరూప సమ్మతావర! కరుణాబ్ధి! ప్రోవు బసవా!
బసవా! వృషాధిపా!

ఈ శతకంలో దాదాపుగా సగభాగం బసవేశ్వరుని సంభోదనలతో నిండివున్నది. ఈ సంభోదనల్లో అర్థ పునరుక్తిగాని, శబ్ద పునరుక్తిగాని లేవు. మరికొన్ని చోట్ల బసవేశ్వరుని మహిమలు, జొన్నలు ముత్యములు చేయుట, చల్లలమ్ము గొల్లపడుచు కాలుజారి పడిపోతూ 'బసవా!' అని ఎలుగెత్తి పిలిస్తే ఆ పిల్లకు దూరంనుంచే చేయూతనిచ్చి నిలబెట్టడం మొదలైనవి, మరికొందరు భక్తుల అద్భుత చర్యలు సంగ్రహంగా ప్రశంసించబడ్డాయి. సోమనాధుడు ఈ తెలుగు శతకంలో సంస్కృత వాక్యమయమైన పద్యమొకటి, ద్రావిడ వాక్యమయమైన పద్యమొకటి, కన్నడ వాక్యమయమైన పద్యమొకటి, మణి ప్రవాళ వాక్యమయమైన పద్యమొకటి, ఆరెమరాటి వాక్య (మహారాష్ట్ర భాషశాఖ) మయమైన పద్యమొకటి, సర్వభాషా మయమైన పద్య మింకొకటి రచించి తన బహు భాషా పాండిత్యాన్ని చాటాడని విమర్శకులు అభిప్రాయపడ్డారు. ఈ సందర్భంలోనే సోమన అచ్చతెనుగు పద్యమొకటి రచించి దానిని జాను తెనుగని క్రింది పద్యంలో చెప్పినట్లు విమర్శకులు తెలిపారు.

"బలుపొడ తోలు సీరయును బాపసరుల్ గిలుపారుకన్నువె
న్నెల తలసేదు కుత్తుకయు నిండిన వేలుపుటేఱు వల్లుపూ
సలుగల ఱేని లెంకవని జానుదెనుంగున సన్నుతించెదన్
వలపు మదిం దలిర్ప బసవా! బసవా! బసవా! వృషాధిపా!"

## చతుర్వేదసారం

పాల్కురికి సోమనాధుడు ఈ 'చతుర్వేదసారం' గురించి పండితారాధ్య చరిత్ర అవతారికలో 'వరవీర భక్తిస వైదికంబుగను, విరచించితివి చతుర్వేద సారమున, బసవన్న మహిమ శుంభద్భక్తి బ్రసరించితివి' అని తెలియజేశాడు, ఇది 'బసవలింగ' అనే మకుటంతో, 357 సీసపద్యాలతో చెప్పిన శతకమని చెప్పవచ్చు. దీనికి బసవలింగ శతకమని కూడా మరో పేరు వుంది. ఇది పాల్కురికి సోమన సంస్కృతంలో రచించిన సోమనాధ భాష్యానికి తెలుగుసేత వీరశైవం శ్రుతి స్మృతి సమ్మతి అని నిరూపించడానికి, తన చతుర్వేద పారంగత్వాన్ని చాటడానికి సోమనాధుడు దీనిని రచించాడు. దీనిలో బసవ శబ్ద విచారం, బసవ నామోచ్చరణ మహిమ, శివాధిక్యం విభూతి రుద్రాక్ష

లింగధారణ మహత్యం, మొదలైన శైవ సంబంధిత విషయాలు వివరింపబడ్డాయి. నన్నయ భారతాన్ని గురించి 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని ఆధ్యాత్మ విదులు వేదాంత మనియు' అని రచించిన పద్యాన్ననుకరించి సోమనాథుడు క్రింది పద్యాన్ని వ్రాశాడు.

వైదికులది శుద్ధవైదికంబని యెన్న శాస్త్రజ్ఞులది ధర్మశాస్త్రమనఁగ
తార్కికులది మహత్కరంబనంగఁ బౌరాణికులదియె పురాణమనఁగ
ఆగమ విదులు దివ్యాగమం బిదియనఁ దంత్రజ్ఞులది వీరతంత్ర మనఁగ
భక్త వారంబిది భక్తి మార్గంబన ముక్త్యర్థులిది మహాముక్తి యనఁగ
కవులు భువిని నిదియె కావ్యంబనంగ, సజ్జనులకెల్ల మిగుల సంతసమున
నిర్వికల్పరితి చతుర్వేద సారమున్, పద్యముల్ రచింతు బసవలింగ"

(చతుర్వేదసారం - 22వ పద్యం)

సోమనాథుని పద్యశైలికి, తత్వ ప్రదర్శనానికి ఈ పద్యాన్ని మరో చక్కటి నిదర్శనంగా చెప్పవచ్చు.

శివ శివా, కర్ణుండు గవచమిచ్చియుఁజెడె, వస్త్రమిచ్చిన
దాసి వరము వడసె
అక్కట ఖచరేందుఁడంగ మిచ్చియుఁజెడె, ప్రేలిచ్చి
మంచయ్య విజయుఁడయ్యె
కటకట, శిబి దనకండలిచ్చియుఁజెడె మృగమాంస
మర్పించి మెరసె నెఱుక
చెల్లెచో, బలిభువినెల్ల నిచ్చియుఁబోడె చోళుఁడో
కూలిచ్చి సుగతిఁబొందె
నిట్లలింగ విముఖమగు దానధర్మ పరోపకార విక్రమోద్ధతముల
నిష్ఫలంబుగాక నెట్టన శరణుల భక్తియుక్తి కెనయు బసవలింగ'

(చతుర్వేదసారం - 67వ పద్యం)

## చెన్నమల్లుసీసములు

ఇది 'చెన్నమల్లు' అనే మకుటంతో వీరశైవ విహితాలైన 'భక్తి, మాహేశ్వర, ప్రసాద, ప్రాణలింగ, శరణ, ఐక్య' అనే షట్స్థల విజ్ఞానాన్ని గురించి రచించిన 32 సీసపద్యాల రచన. కాని ఇందులో రెండు కంద పద్యాలుకూడా వున్నాయని బండారు తమ్మయ్యగారి అభిప్రాయం. సోమనాథుడు శివైక్య

సమయంలో జీవసమాధి అవుతూ, సమాధిలోనికి ప్రవేశించడానికి 32 సోపానాల్ని నిర్మించుకొని వాటిని దిగేటపుడు ఒక్కొక్క సోపానానికి ఒక్కో పద్యం చెప్పినట్లు ఐతిహ్యంలో వుంది. అయితే ఇది నిరాధారమని బండారు తమ్మయ్యగారి విశ్వాసం. సోమనాధుడు చరమ దశలో శివైక్యం పొందింది మైసూరు రాష్ట్రం బెంగుళూరు జిల్లాలోని కల్యక్షేత్రమని విమర్శకుల భావన. సోమన ఇష్టదైవం శ్రీశైలంలోని చెన్న మల్లికార్జునుడుగా చెపుతారు. 'తెల్లంబుగా నస్మదీయేశు చెన్న మల్లికార్జున దేవు మహిత రూపంబు ..... తానయొ బసవన దండనాయకుని జానొంద మత్కృతి స్వామిగావించి మసలక మా చెన్నమల్లిముని బసవనామంబిది భక్తి పెక్కవను బసవలింగంబని ప్రణుతించువాడ' అనే పద్యం ఇందుకు ఆధారమని విమర్శకుల అభిప్రాయం. అందువల్లనే సోమన చెన్నమల్లుసీసములను మల్లికార్జునస్వామి పేరుమీదుగనే రచించాడని బండారు తమ్మయ్యగారు నిరూపించియున్నారు.

## సోమన లఘుకృతులు

సోమనాధుడు స్తుతిపరమైన కొన్ని లఘుకృతుల్ని రచించాడు. వాటిలో గద్యలు 5, రగడ1, ఉదాహరణలు 2, అక్షరాంక పద్యం 1, పంచకం 1, అష్టకాలు 2, స్తవాలు 2 లభ్యమని విమర్శకులు నిరూపించియున్నారు.

## గద్యలు

పంచ ప్రకారగద్య, నమస్కారగద్య, అక్షరాంక గద్య, అష్టోత్తర శతనామ గద్య, శరణు బసవగద్య అనేవి సోమన రచించిన గద్యస్తోత్రాలు. ఇవన్నీ ప్రాచీనాంధ్ర కర్ణాటాంధ్ర గీర్వాణ స్వచ్ఛంద సంప్రదాయాల ననుసరించి రచింపబడ్డ విలక్షణాంధ్ర కృతులని విమర్శకులు నిర్ణయించారు.

## పంచ ప్రకారగద్య

బసవని గురించి రచించిన అయిదు విధాలైన నడకలు గల గద్యస్తోత్రం. ఇందులో మొదట ఒక శ్లోకం, తర్వాత అయిదు రగడ భేదాలున్నాయి. రెండవ రగడలో ముక్తపద గ్రస్తాలంకారం వుంది. మూడవ రగడలో జయ, జయ శబ్దాలతో ఏ పాదానికి ఆ పాదం విడివడి అంత్యానుప్రాస కలిగివుంటుంది. 4, 5 రగడలు కూడా ఈ విధంగానే వుంటాయి. గద్యం చివరలో 'శ్రీ బసవ దండనాథ నమస్తే, నమస్తే నమః' అని వుంది.

## నమస్కార గద్య

ఇందులోని ప్రతి పాదం సంస్కృత చతుర్థీ విభక్తి ప్రత్యయాలతో కూర్చబడి వుంటుంది. ఇది కేవలం సంస్కృత కృతిలాగా కనిపించే గద్యకృతి. దీనిలో ద్విపద రగడల రీతిలో ద్విపద ప్రాసనియతి పాటించబడివుంది. ప్రాసయతి కూడా పాటింపబడివుంది. నమోవాకాలతో అంతమైంది.

## అక్షరాంక గద్య

ఇది 'అ' నుంచి 'క్ష' వరకు వున్న ఒక్కొక్క పాదం ప్రథమాక్షరంగా వుంచి రచించిన స్తోత్రం. ప్రారంభంలోను, అంతంలోను శ్లోకాలున్నాయి. ఇది మొత్తం 52 పాదాలు గల గద్యస్తోత్రం. మాత్రా గణబద్ధమైంది. దీనిలో అనుప్రాసనియతి పాటింపబడింది.

## అష్టోత్తర శతనామగద్య

ఇది బసవస్తుతి ప్రతిపాదితమై నమోవాకాలతో అంతమయ్యే 108 పాదాల స్తోత్ర రచన.

## శరణు బసవగద్య

ఇందులో ఆద్యంతాలు కన్నడ భాషలో వుండడం చేత దీనిని కన్నడ గద్య అని పరిశోధకులు భావించారు. కాని తెలుగులోని తురగ వల్గన రగడ అని మరికొందరి అభిప్రాయం. యతి పాటింపబడింది. బసవస్తుతి ప్రతిపాదితమైన గద్యస్తోత్రం.

## రగడలు

పిడుపర్తి సోమన తన పద్య బసవ పురాణావతారికలో సోమనాథుడు బసవరగడ, బసవాఢ్య రగడ, గంగోత్పత్తి రగడ, సద్గురు రగడలను రచించాడని తెలియజేశాడు. కాని బసవ రగడ ఒకటి మాత్రమే లభించిందని విమర్శకుల అభిప్రాయం.

## బసవ రగడ

రగడ ఒక సాహితీ ప్రక్రియ. ఉప లబ్ధమైన రగడలలో పాల్కురికి సోమన బసవ రగడ మొదటిదని విమర్శకుల అభిప్రాయం. కన్నడంలో మందానిలము, లలితము, ఉత్సవము అనే మూడు రగడలున్నాయి. అవి మాత్రాగణ బద్ధమైనవి. తెలుగులోని రగడలు పలువిధాలుగా వున్నాయి.

తెలుగు లాక్షణికులు తొమ్మిది రగడలను గురించే చెప్పారు. కొన్నిటికి మాత్రాగణాలు, మరి కొన్నిటికి ఆయా మాత్రలకు సరిపడే విధంగా ఇంద్ర, సూర్య గణాల నేర్పరచారు. ద్విపదలో లాగా రగడలో కూడా ద్విపాద నియమం పాటింపబడి వుంది. రగడకు ఆదిప్రాసతో పాటు అంత్యప్రాస కూడా విశేషంగా వుంది.

మొత్తం 108 పాదాలుగల ఈ బసవ రగడలో మొదటి 78 పాదాలలోనే ద్విపాదాంత్య ప్రాసనియమం పాటింపబడింది. తర్వాత 14 పాదాలలో ద్విపద పంక్తులలో లాగా అక్కడక్కడా ప్రాసయతికూడా అంగీకరింపబడింది. తర్వాత 8 పాదాలలో కూడా ఈ నియమమే పాటించినట్లు చెప్పవచ్చు. ఈ రగడ ప్రారంభంలో ఉత్సాహవృత్తం, ప్రతి పాదం చివరలో 'శరణు బసవ' అనే మకుటంతో నిండి వుంటుంది. ఇదే 'బసవోత్తర శతనామములు' అనే పేరుతో వున్నట్లు ఈ రగడ చివరలో నున్న కంద పద్య మూలం వల్ల తెలుస్తున్నది. ఆది, అంతాలలో రెండు కన్నడ పద్యాలుండడంవల కర్ణాట కవి చరిత్రకారుడు దీనిని కన్నడ కృతిగా భావించినప్పటికీ కన్నడ భాషకు విలక్షణమైన యతి నియమమిందులో పాటింపబడినందు వల్ల దీనిని బసవస్తుతి పూర్వకమైన లఘు రచనగా చెప్పవచ్చు.

## ఉదాహరణలు

ఇతర భాషాల సాహిత్యాల నుండి అరువు తెచ్చుకొనబడని సాహిత్య ప్రక్రియ ఉదాహరణ ప్రక్రియ. తెలుగులో మొదట వెలసిన ఈ ప్రక్రియ సంస్కృత సాహిత్యంలోకి కొనిపోబడింది. ఉదాహరణం అనిబద్ధ కావ్య వర్గంలో కావ్య వర్గంలో చేర్చబడింది. మధుర కవితాశాఖకు చెందింది. అక్షరగణ బద్ధమైన వృత్తరచన, మాత్రాగణ బద్ధమైన పదరచన వుండి మార్గదేశి కవితా సమ్మేళన మొనర్చుకొన్న సాహిత్య ప్రక్రియ ఈ ఉదాహరణ ప్రక్రియ. 8 విభక్తులు, 8 వృత్తాలు, 8 కళికలు, 8 ఉత్కళికలు, చివర సార్వ విభక్తిక పద్యంతో మిళితమైన స్తోత్రరూపమే ఈ ఉదాహరణం.

సోమన మొదట తెలుగు భాషలో, తర్వాత సంస్కృతంలో బసవోదాహరణాన్ని రచించాడు. సోమన సంస్కృత, తెలుగు బసవోదాహరణలు రెండూ ఆయా భాషలలో ప్రాథమిక రచనలు. కనుకనే ఉదాహరణ రచనకు సోమన మార్గదర్శకుడుగా నిలిచాడు. సంస్కృత బసవోదాహరణ ఆరంభంలో మాలినీ వృత్తశ్లోకముంది. తెలుగు బసవోదాహరణ ప్రారంభంలో ప్రత్యేకశ్లోకం గాని, పద్యం గాని రచింపబడలేదు. సార్వవిభక్తిక పద్యం తర్వాత సంస్కృత

బసవోదాహరణంలో కవికృత నామాంకిత పద్యం వుంది. తెలుగు బసవోదాహరణంలో ఈ అంకిత పద్యం కన్పించదు. దీనిని బట్టి ఉదాహరణ కావ్యంలో 25 లేదా 26 పద్యాలుంటాయని, కవికృత నామాంకిత పద్యం కన్పించడం కేవలం యాదృచ్ఛికమేనని చెప్పవచ్చు. ఉదాహరణంలో ప్రతి విభక్తికి ఒకే వృత్తం, ఒకే కళిక, ఒకే ఉత్కళిక, నియతాలు. వృత్తాలలో చంపకోత్పల మాలలు, మత్తేభ శార్దూల వృత్తాలు మాత్రమే ప్రయుక్తాలు. కళిక మాత్రా ఛందస్సుకు చెందిన రగడ భేదం. దీనిలో 8 పాదాలు మాత్రమే వుంటాయి. ఉత్కళిక కళికలో సగం. దీనిలో కూడా 8 పాదాలుంటాయి. కళికలో ప్రతి పాదాంతంలో ఆయా విభక్తి ప్రత్యయాలు భాసించాలి. ఉత్కళికలో ఈ ప్రత్యయాలు చివరి రెండు పాదాలలో మాత్రం వుండాలి. వీటిలోని అన్ని పాదాలు సంభోదనాంతాలు గానే వుండాలి. కళికలో ప్రతిపాదం స్వతంత్ర వాక్యమై వుంటే, ఉత్కళికలో ఏక సమానంగా పాదాలుంటాయి.

ఉదాహరణం కేవలం స్తుతి రూపకం. దీనిలోని పద్యాలు రాగ ప్రధానాలు. కళికోత్కళికలు తాళ ప్రధానాలు. వీటిని త్రిపుట, జంపె, రూపక తాళాలతో గానం చేయాలి. ఆ తాళాల కనుకూలమైన త్ర్యశ్య, చతురశ్ర, మిశ్ర జాతులందు ప్రకటితమై వుండాలి.

బసవోదాహరణంలో బసవేశ్వరుని మహిమ వర్ణితమైంది. విద్యానాథుడు ప్రతాప రుద్రీయంలో వివరించిన ఉదాహరణ లక్షణానికి సోమన సంస్కృత బసవోదాహరణమే నిదర్శనమని విమర్శకుల అభిప్రాయం. తెలుగు ఉదాహరణం వల్ల ప్రాచీనాంధ్ర భాషా విశేషాలు, ఛందో విభక్తి సంప్రదాయాలు తెలుసుకొనవచ్చు. దైవభక్తిలేక మతాభిమానాన్ని ఉదాహరణ రచనకు హేతువుగా తెలియజేశారు. అధునిక కాలంలో మానవ పరమైన ఉదాహరణలు కూడా వెలువడుతున్నాయి. వీటిలో వున్న స్తోత్ర రూపాలు రాజస్తుతి, దైవస్తుతి, మహాపురుష ప్రశంసా పరంగా వుంటాయి.

### అక్షరాంక పద్యం

'అ'కారం మొదలు 'క్ష'కారం వరకు వర్ణ సమూహంలోని 50 అక్షరాలతో వరుసగా పద్య పాద ప్రథమాక్షరాలు కూర్చి రచించిన లఘుకృతి ఇది.

### పంచకం

ఐదు మాలినీ వృత్తాలలో రచించిన బసవస్తోత్రం పంచకం.

## స్తవాలు

పాల్కురికి సోమనాధుడు సోమనాధస్తవ, భక్తస్తవాలను భక్త పఠనార్థం సులభ శైలిలో లఘు ద్విపద కృతులుగా ప్రారంభంలో అనుభవసారం తర్వాత రచించి వుంటాడని బండారు తమ్మయ్యగారు అభిప్రాయపడ్డారు. సోమనాధస్తవం, భక్తస్తవం - ఈ రెండూ ముదిగొండ శంకరాధ్యులచే పరిష్కృతమైన 'మోక్షోపాయ' మనే గ్రంథంలో ముద్రితాలైనాయి. ఏలూరు వాస్తవ్యులు కొండగుంటూరు నాగభూషణంగారు ప్రకటించిన ఒక మిశ్రమ గ్రంథంలోని 'సోమనాధస్తవం' చివర 'ఇది పాల్కురికి సోమేశ్వర విరచితము' అని కూడా ముద్రింపబడిందని బండారు తమ్మయ్యగారు తెలియజేసియున్నారు.

## అష్టకాలు

8 పద్యాల స్తోత్రాన్ని అష్టకమంటారు. పాల్కురికి సోమన సంస్కృతంలో ఎనిమిది వృత్తాలలో వృషభాష్టకాన్ని, తెలుగుభాషలో ఎనిమిది మాలినీ వృత్త పద్యాలతో బసవాష్టకాన్ని రచించాడు.

## సోమన సంస్కృతకృతులు

సోమనాధ భాష్యం, రుద్రభాష్యం, త్రివిధ లింగాష్టకం అనేవి సోమన సంస్కృతంలో రచించిన ముఖ్య లఘుకృతులుగా చెప్పవచ్చు.

## సోమనాధ భాష్యం

ఈ సోమనాధ భాష్యం శ్రుతి, స్మృతి ప్రమాణాలతో శివపారమ్యాన్ని నిరూపించే 25 ప్రకరణాల సంస్కృత గ్రంథం. దీనికి వీర మాహేశ్వర సారోద్ధారమని కూడా పేరు. మనోహరుడనే ఒక శైవాగమ వేత్త దీనికి వ్యవహారికాంధ్ర టీకాను రచించాడు. సోమనాధ భాష్యంలో కేవలం పది ప్రకరణాలు మాత్రమే అభ్యమవుతున్నాయని విమర్శకుల అభిప్రాయం.

## రుద్రభాష్యం

ఈ రుద్రభాష్యం యజుర్వేదంలోని రుద్రాధ్యాయానికి సోమన వ్రాసిన భాష్యమని చెపుతారు. అయితే ఇది అలభ్యమని విమర్శకులు అభిప్రాయపడుతున్నారు.

## త్రివిధలింగాష్టకం

ఈ అష్టకంలో 'ఇష్టలింగం, ప్రాణలింగం, భావలింగం'లను గురించి ఒక్కొక్కదానికి ఎనిమిది శ్లోకాలు చెప్పబడ్డాయి.

## సోమన కన్నడ లఘుకృతులు

సద్గురు రగడ, చెన్న బసవరగడ, అక్షరాంక పద్యాలు, శరణు బసవరగడ, బసవలింగ నామావళి, శీల సంపాదనం, శివగణ సహస్రమాల అనేవి సోమన కన్నడ భాషలో వెలయించిన లఘుకృతులు. సోమన వీటిని వెలయించడం వల్ల కర్ణాట కవి చరిత్రకారులు ఇతనిని కన్నడ కవిగా పరిగణించారని చెప్పవచ్చు.

ఈ విధంగా సోమన బసవని భక్తిలో తాదాత్మ్యంచెంది అతనిని వివిధ ప్రక్రియల రూపంలో స్తుతించి చరితార్థుడైనాడని చెప్పవచ్చు

సంస్కృతభూయిష్టాలైన అక్షరాంక గద్య, బసవాష్టక, బసవరగడ మొదలైన లఘుకృతుల నెన్నింటినో సోమన రచించాడు. కాని అవి సామాన్య భక్తజనానికి అంతగా అందుబాటులో లేకపోవడాన్ని గమనించి సర్వజన సులభమైన ద్విపదలో మహిమాన్వితులైన బసవేశ్వరుని చరిత్రను బసవపురాణంలోను, పండితారాధ్యుల చరిత్రను పండితారాధ్య చరిత్రలోను రచించి. ఆ రెండింటిని అతిపెద్ద ద్విపద గ్రంథాలుగా వెలయించాడని చెప్పవచ్చు.

# కన్నడ బసవపురాణం

12వ శతాబ్ది మధ్య ప్రాంతంలో కళ్యాణ కటక నగర రాజధానిగా బిజ్జలుడు రాజ్యాన్నేలుతున్నపుడు, బసవదండనాథుడి ఆధ్వర్యంలో చెన్నబసవని సమక్షంలో వీరశైవం కన్నడ దేశంలో వేళ్ళూ నిందని చెప్పవచ్చు. శైవంలోవున్న వివిధ సంప్రదాయాల్ని, ఆచారాల్ని నిశితంగా పరిశీలిస్తే అనేక సంప్రదాయాలు ఒకే చట్రంలో ఇరుసులా ఇమడలేక అన్నీ కలిసి ఒకే సంప్రదాయంగా పరిణామం చెందాయని చెప్పవచ్చు. అలాంటి పరిణామ క్రమంలోదే వీరశైవం. అప్పటి సమాజ స్థితిగతుల కనుగుణంగానే వీరశైవం ఒక నూతన ప్రక్రియగా ఉద్భవించిందని చెప్పవచ్చు. ఈ వీరశైవం కర్నాటక దేశంలో విస్తరించిన పరిధి చాలా తక్కువైనప్పటికీ, ఇది ఒక కులమత రహిత వ్యవస్థ స్థాపనకై యత్నించిందని చెప్పవచ్చు.

ఆంధ్రదేశంలో కూడా వీరశైవ ఆవిర్భావం అప్పటి సమకాలీన పరిస్థితుల కనుగుణంగానే కర్నాటక దేశంలో మాదిరిగానే జరిగిందని చెప్పవచ్చు. కాలాముఖశాఖకు చెందిన మేధావులు. ఆ మతాన్ననుసరించేవారు వర్ణాశ్రమ ధర్మాల్నెంతగానో గౌరవించి, వాటిని కఠోర నియమ నిష్టలతో పాటించేవారని చెప్పవచ్చు. పండితారాధ్యుని ఆధ్వర్యంలో కూడా ఆంధ్రదేశంలో వర్ణాశ్రమ ధర్మపాలన జరిగేదని చెప్పవచ్చు. బసవేశ్వరుడు పండితారాధ్యుని వీరశైవం నిర్వహణా బాధ్యతలను స్వీకరించమని, లింగధారణ చేయమని ఆహ్వానిస్తే పండితారాధ్యుడు అందుకు తిరస్కరించినట్లు తెలుస్తోంది. దీనికి నిదర్శనంగా పండితారాధ్యుని ఈ వాక్యాల్ని పేర్కొనవచ్చు.

"భక్తిమీది వలపు బ్రాహ్మ్యంబుతో పొత్తు పాయలేను నేను బసవలింగా!"

ఆ కాలానికే సంబంధించిన గొప్ప మేధావులు శ్రీపతి పండితుడు, శివలెంక మంచనలు కూడా పై అభిప్రాయాన్నే వెలిబుచ్చారు. శ్రీపతి పండితుడు బ్రహ్మసూత్రాల ప్రతిపాదనకై శ్రీకార భాష్యాన్ని రచించాడు. శివలెంక మంచన పండితుడు ఆంధ్రదేశంలో వీరశైవ విశృంఖలత్వాన్ని వ్యతిరేకించిన వారిలో ముఖ్యుడని చెప్పవచ్చు.

ఈ సందర్భంలోనే ఆంధ్రదేశంలో మేధావి, గొప్ప ఉపన్యాసకుడు, గొప్ప మత ప్రచారకర్త, వీరశైవ మత వ్యాప్తికై కంకణ ధారియైన పాల్కురికి సోమనాథుడు దానినే తన జీవిత లక్ష్యంగా భావించి జన్మించాడని విమర్శకుల అభిప్రాయం.

కర్నాటక దేశంలో వీరశైవం ఎలా ఖ్యాతి చెందిందో ఆంధ్రదేశంలో కూడా కేవలం పాల్కురికి సోమనాథుని వాక్పటిమ, ఉపన్యాస విశిష్టత వల్ల వీరశైవం ఖ్యాతి బడసిందని చెప్పవచ్చు. వీరశైవ మత వ్యవస్థాపకుడైన బసవేశ్వరుని జీవిత కథనే కథావస్తువుగా స్వీకరించి, సోమనాథుడు బసవపురాణాన్ని మొదట తెలుగులో రచించాడని, ఈ గ్రంథమే తర్వాత కన్నడ భాషలోకి అనువదించబడిందని విమర్శకుల అభిప్రాయం. అదేవిధంగా మల్లికార్జున పండితుని జీవిత కథనే కథా వస్తువుగా స్వీకరించి సోమన తెలుగులో పండితారాధ్య చరిత్ర రచించాడని, తర్వాత అది కన్నడభాషలోకి అనువదించబడిందని విమర్శకుల అభిప్రాయం. ఈ పండితారాధ్యుడు, సోమనాథుడుల వల్లనే వీరశైవ మత సముద్ధరణ జరిగిందని చెప్పవచ్చు.

పాల్కురికి సోమనాథుడు గొప్ప శివభక్తుడు. సోమన తన బాల్యదశనుంచే వీరశైవ మత సంప్రదాయాల్ని అనుసరించి, వీరశైవ మత ప్రధాన లక్ష్యమైన లింగధారణాన్ని కొనసాగించాడని చెప్పవచ్చు. అయితే సోమన తన భక్తి భావాన్ని కేవలం శివపరంగానే కాక, పార్వతి పట్ల, కుమారస్వామి, గణపతిల పరంగా కూడా విస్తరించడం ఒక విశేషాంశంగా చెప్పవచ్చు. అయితే వీరశైవాన్ని పాటించే శివభక్తుడు లింగరూపంలో గాని, జంగమరూపంలోగాని శివారాధన మాత్రమే చేయాలి అనే అభిప్రాయాన్ని సోమన తప్పని నిరూపించడానికే పార్వతి, గణపతి, కుమారస్వాములను ఆరాధన చేసినట్లు చేర్చి బసవపురాణంలో వివరించాడని చెప్పవచ్చు. ఇందుకు ఉదాహరణగా, బసవపురాణంలోని ఒక ఘట్టంలో భృంగి శివుని ఆరాధించి, ఆయనను సమీపించి శివునికి నమస్కరించి, ప్రక్కనున్న పార్వతికి నమస్కరించక పోవడాన్ని చెప్పవచ్చు.

సామాజిక పునరుద్ధరణతో పాటు వీరశైవం కులమత రహిత వ్యవస్థ స్థాపనకై విశేష కృషి చేసిందని చెప్పవచ్చు. కాలాముఖ, పాశుపతశాఖలు శైవంలో ఆంధ్రదేశంలో విస్తరించిన విధానాన్ని సోమన తన బసవపురాణంలో కూలంకషంగా చర్చించినప్పటికీ తర్వాతికాలంలో నన్నెచోడుని కుమార సంభవం ద్వారా, పండితారాధ్యుని శివతత్వసారం ద్వారా విశేషంగా ఖ్యాతిని చెందాయని చెప్పవచ్చు.

ఈ విధంగా సోమన తన బసవపురాణం ద్వారా శైవుల పరిణామ చరిత్ర, వీరశైవుల విశిష్ట భక్తిని అటు తెలుగు భాషలోను, అనువదింపబడిన తన కన్నడ బసవపురాణంలోను అద్భుతమైన రీతిలో చిత్రీకరించాడని చెప్పవచ్చు.

# ద్విపద

రెండు పాదాల ప్రత్యేక ఛందం తెలుగు సాహిత్యంలో ద్విపదగా పరిగణించబడుతోంది. పద్యాలకు నాలుగు పాదాలు. పదంలేక పాదం అంటే పద్యంలోని నాల్గవ వంతు. అంటే ఒక పద్యపాదం. నాలుగు పాదాలున్నది పద్యమైతే, రెండు పాదాలు కలది ద్విపద అయింది. తెలుగు భాషలో వున్న ద్విపదకు ప్రతి పాదంలోను మూడు ఇంద్రగణాలు, ఒక సూర్యగణం వుంటాయి. మూడవ గణాద్యక్షరం యతిస్థానంగా వుండి ప్రాసనియమం వుండాలని లాక్షణికులు నిర్ణయించారు.

ఈ ద్విపద ఛందస్సు యొక్క చరిత్ర ప్రాచీనతల్ని పరిశీలిస్తే కొందరి అభిప్రాయం ప్రకారం తెలుగు భాషలో వున్న పదజాలం మాదిరి, సాహిత్యంలోని ఇతర సంప్రదాయాలు, ఛందోరీతులవలె ఈ ద్విపదకూడా సంస్కృత ప్రాకృతాల నుండి వచ్చింది. అంతేకాక ద్విపద శబ్దం వేదాలలోను, ప్రాకృతి నిఘంటువులోను కన్పిస్తున్నదని, అదే మన వాఙ్మయానికి వచ్చి చేరిందని చెప్పి తమ వాదనకు బలం చేకూర్చుకోడానికి కొందరు ప్రయత్నించారు.

తెలుగుభాషలో వుండే ద్విపద పాదంలో కనీసం 15 మాత్రలుంటాయి. ఒకటి, రెండుపాదాలకు ఒకే లక్షణం, అది లఘ్వంతం.

ద్విపద ఛందస్సును కావ్యానికి ఉపయుక్తమైన వస్తువుగా తీర్చిదిద్దినవాడు పాల్కురికి సోమనాధుడు. ఈ ద్విపద ఛందస్సులో ఉద్గ్రంథాల్ని రచించి కేవల గేయరూపంలో వున్న ద్విపద ఛందస్సుకు సాహితీ గౌరవాన్ని కల్పించిన యశస్సు సోమనకే చెందుతుంది. భాష, వస్తువు, ఛందస్సు ఈ మూడింటిలోనూ తనకు ముందున్న సంప్రదాయాల్ని త్రోసి రాజని వాటిలో విప్లవాన్ని తెచ్చినవాడిగా సోమనను చెపుతారు. సోమన రచించిన ద్విపద కావ్యాలు బసవపురాణం, పండితారాధ్య చరిత్రలు. వీటిని సోమన జన బాహుళ్యానికి ఉపయోగపడే విధంగా శైవమత ప్రచారోద్దేశంతో వెలయించాడు. ఈ ద్విపద మాత్రాగణ బద్ధమైనందువల్ల కూర్పు సులభం. ఇది గేయభావాన్ని కలిగి వున్నందువల్ల కావ్యమంతా ఒకే ఛందంలో వుండడం వల్ల వృత్తకావ్యాలలో మాదిరిగా ఎప్పటికప్పుడు నడక మారదు. అందువల్ల సామాన్య ప్రజలు పాడుకోవడానికి వీలుగా వుంటుంది.

అయితే, పాల్కురికి సోమన కాలంనాటికి ద్విపదపట్ల ప్రజలకంతగా గౌరవభావం వున్నట్లు కనిపించదు.[4]

కనుకనే సోమన తాను చేయుచున్న ద్విపదను గూర్చి సమర్థించుకోవలసి వచ్చింది.

"తెలుగు మాటలనంగ వలదు వేదముల
కొలదియ కాజాడుడిల నెట్టులనిన
బాటి తూమునకును బాటి యౌనేని
బాటింప సోలయు బాటియకాదె" అని
నిర్ధారణ చేసుకొని సోమన ద్విపద కావ్యాన్ని రచించాడు.

ద్విపద కేవలం వైదిక ఛందమైనందుననే తత్స్వరూపమైన తెలుగు ద్విపదను సోమనాథుడు 'వేదముల కొలదియకా జూడుడని'ని హెచ్చరించాడు. వేదాలు ఋషులు గానం చేశారు. ద్విపదలుకూడా గానయోగ్యాలే.

సోమన ద్విపద రచనా పద్ధతిలో అప్పటి సంప్రదాయాలకు భిన్నంగా ప్రాసయతిని ప్రయోగింపవచ్చుననే నియమాన్ని ప్రవేశపెట్టాడు.[2]

సోమన ద్విపదలలో అనేకచోట్ల సంస్కృత శబ్దాలు దొర్లాయి. అనేక ద్విపదలు ఒకే దీర్ఘ సమాసంగా సంఘటితమైపోయాయి. తన పండితారాధ్య చరిత్రలో చాలాచోట్ల వేదవాక్యాలను యథాతథంగా ఉద్ధరించి, ద్విపదలలో చొప్పించాడు.

అనంతుడనే లాక్షణికుడు ఛందోదర్పణములో మంజరీ ద్విపద లక్షణాన్ని చెపుతూ ప్రాసయతిని గూర్చి వివరించాడు.[3]

తాళ్ళపాక చిన్నన్న ప్రాసయతి, ప్రాసద్వయ సమ్మేళనాల్ని నిషేధిస్తూ లక్షణాల్ని తెలియజేశాడు.

ద్విపద ఛందస్సు కూర్పు సులభమై మాత్రాగణ బద్ధమైనందువల్ల గాన యోగ్యాలై తెలుగు భాషకు, పదాలకు సరిపడే ఛందం సరళమైన భాషలో రచింపబడినందువల్ల సర్వులకు గ్రాహ్యం అనే అభిప్రాయం కలిగి మత ప్రచారమే ముఖ్య ఉద్దేశ్యంగా భావించిన ప్రథమ దశలో ద్విపద కావ్యాల రచన సాగించినప్పటికీ, సోమనాథుడీ నియమాల కపవాదంగా నిల్చాడని చెప్పవచ్చు. తర్వాత కాలంలో బయలుదేరిన ద్విపద కావ్య కర్తలు తమ రచనల్లో దీర్ఘ సమాస రచన చేశారు. సంస్కృత పద బాహుళ్యాన్ని ప్రవేశపెట్టారు. అంతేకాక ప్రబంధ లక్షణాల్ని కూడా ప్రవేశపెట్టారు. కాలక్రమంలో ద్విపద కావ్యాలు ఒక ఛందస్సులో తప్ప తక్కిన విషయాలన్నిటిలోను పద్య కావ్యాలను

పోలినవిగా అయ్యాయి. కొంతకాలం తర్వాత ద్విపదలోనున్న ప్రాసను విడిచిపెట్టి వ్రాయడానికి ఉపక్రమించినట్లుగా కన్పిస్తుంది. ప్రాసరహితమైన ఈ ద్విపదే మంజరీ ద్విపద. అందువల్ల ప్రాసయుత ద్విపదే ప్రథమ దశలో వున్నప్పటికీ, ఆ ఛందో రచనను మరింత సులభతరం చేయడానికి ప్రాసరహిత ప్రయోగమేర్పడిందని చెప్పవచ్చు.

ప్రాస సహిత, ప్రాసరహిత (మంజరీ) ద్విపదల కూర్పులో మంజరీ ద్విపదకూర్పే సులభతరమైనప్పటికీ ప్రాససహిత ద్విపద రెండింటిలోను అధిక శ్రవణమై, గానయోగ్యమై అలరారుతుందనడంలో ఎంతమాత్రం సందేహం లేదని చెప్పవచ్చు.

## సోమన ద్విపద కావ్యాలు

ద్విపద రచనా స్థాపకుడైన పాల్కురికి సోమన ద్విపదలో వ్రాసిన అతి పెద్ద గ్రంథాలు రెండు. అవి బసవపురాణం, పండి తారాధ్య చరిత్రలు. ఇవి అనువాదాలు కావు. స్వతంత్ర రచనలు. సోమనాధుని మరోద్విపద గ్రంథంగా చెప్పబడుతున్న మల్లమదేవి పురాణం ఇంతవరకు బయటపడలేదని విమర్శకులు తెలియజేశారు.

సోమనాధుని కృతుల్లో బసవపురాణం, పండితారాధ్య చరిత్రలు పేరెన్నికగన్నవి.

## బసవ పురాణం

పండితారాధ్య చరిత్రలో, వృషాధిప శతకంలో బసవపురాణ ప్రశంస వుంది.[5] అందువల్ల బసవపురాణం మిగిలిన రెండు గ్రంథాలకన్నా పూర్వ రచన అని విమర్శకుల అభిప్రాయం.

వృషాధిప శతకంలో కూడా బసవపురాణ ప్రశంస వుంది.[6]

బసవపురాణంలోని ప్రధాన ఇతివృత్తం వీరశైవ మత స్థాపకుడైన బసవేశ్వరుని జీవిత మహత్యం. బసవేశ్వరుని కంటే ముందే శైవ మతస్థులలో వీరమహేశ్వర వ్రతమున్నట్లు, అందువల్ల బసవేశ్వరుడు వీరశైవ మత నిర్మాత కాదని కొందరు శైవ మతస్థుల వాదనగా చెపుతారు. ఇదే సరైనట్లయితే బసవేశ్వరుడు వీరశైవమతాన్ని పునః ప్రతిష్టించిన వ్యక్తిగాని లేక సంస్కర్తగాని అయివుండాలని విమర్శకుల అభిప్రాయం.

బసవేశ్వరుని చరిత్ర మహనీయమైనది, విశేషాంశాలతో కూడినదైనందువల్ల సోమన ఈ గ్రంథాన్ని చారిత్రక సత్య బద్ధంగా కాకుండా, పౌరాణిక వాసనలతో మిళితమైనదిగా సంతరించాడని విమర్శకులు తెలిపారు. పురాణాలలో చారిత్రకాంశాలు తక్కువ, అలౌకికాద్భుతాలు ఎక్కువని చెపుతారు. సోమన ఈ బసవపురాణం గ్రంథంలో ఇంచుమించు తనకు సమకాలికుడుగాను, చారిత్రక పురుషుడైన బసవేశ్వరుని పురాణ పురుషుల్లో ఒకనిగా పరిగణించి అతనికి సహజంగా వున్న ఘనతకు తోడుగా మరెన్నో అతిశయోక్తుల్ని జోడించి బసవేశ్వరుని అవతార పురుషునిగా తీర్చిదిద్దాడు.

బసవేశ్వరుడు మండిగ మాదిరాజు, మాదాంబ అనే బ్రాహ్మణ దంపతులకు నందికేశ్వరాంశములో జన్మించాడని విమర్శకులు తెలియజేశారు. చిన్న వయస్సులోనే వర్ణ వ్యవస్థను ధిక్కరించి ఉపనయనాల వంటి బ్రాహ్మణ ఆచారాలను విడనాడి తల్లిదండ్రుల్ని, ఇంటిని విడిచి కళ్యాణ కటక నగరంలో బిజ్జలుడనే రాజుకొలువులో మంత్రిగా వున్న తన మేనమామ ఇంట చేరాడని చెపుతారు. ఇతని తల్లిదండ్రులు, మేనమామ శైవులు. వీరశైవులు కాదు. ఇతని మేనమామ తన కుమార్తె గంగాంబతో బసవేశ్వరుని వివాహం జరిపించి, అల్లునికి రాజు కొలువులో ఉద్యోగాన్నిప్పించినాడని విమర్శకులు తెలిపారు. తన మామ తర్వాత బసవేశ్వరుడు మంత్రి పదవి చేపట్టి వీరశైవ మత ప్రచారానికి తన సర్వస్వాన్నేగాక రాజభాండాగారాన్ని వినియోగించాడు. బసవేశ్వరుడు ప్రతిపాదించిన నూతన సంస్కరణలతో శైవశాఖల మధ్య ఐక్యత కుదిరి వీరశైవమనే నూతన ధర్మం ప్రతిష్ఠించబడిందని చెపుతారు.

బసవేశ్వరుడు సహజంగా సంగీత, సాహిత్యాభిలాషి. ఇతడు స్వయంగా రచించి, గానం చేసిన పాటలు జన బాహుళ్యాన్నంతా భక్తి పారవశ్యతలో ఓలలాడించాయి. ఈ పాటలే వీరశైవ మత ప్రచారానికి చక్కటి తోడ్పాటునందించాయి. వీరశైవమనే నూతనధర్మం అప్పట్లో ప్రజల హృదయాల్లో చెరగని ముద్రవేసి నేటికీ ఆ విశ్వాసాలు చెక్కు చెదరక నిలిచివున్నాయని విమర్శకుల భావన. స్వమత రక్షణకై శూరత్వాన్ని, భక్తి ప్రదర్శనలో వీరత్వాన్ని చూపడంవల్ల వీరు వీరశైవులైనారని చెప్పవచ్చు.

బసవేశ్వరుడు బిజ్జలుని మంత్రిగావున్న కాలంలో జొన్నలను ముత్యాలుగా మార్చడం, వంగకాయల్ని లింగకాయలుగా మార్చడం, విషాన్ని అమృత ప్రాయంగా సేవించడం వంటి అనేక మహిమల్ని ప్రదర్శించాడు. అయితే బసవేశ్వరుని ఆశ్రయాన్ని అర్థించిన కొందరు శివభక్తులు కళ్యాణ కటకం చేరి రాజాజ్ఞను ధిక్కరించడంతో చివరకు బసవేశ్వరుడు కళ్యాణ కటక

నగరాన్ని వీడి కూడలి సంగములో లింగైక్యం చెందినట్లుగా చెపుతారు. దీనికి ప్రతీకారంగా బసవేశ్వరుని అనుచరులలో ఇద్దరు బిజ్జలుని చంపినట్లుగా కూడా తెలుస్తుంది.

బసవేశ్వరుడు రచించిన భక్తిగీతాలు నాలుగు లక్షలకు పైగా వున్నట్లు తెలుస్తుంది. వీటికి వచనాలని పేరు. తర్వాతి కాలంలో వీటిననుసరించే తాళ్ళపాక అన్నమయ్య 'వేంకటేశ్వర వచనములు', కృష్ణమాచార్యుడు 'సింహాద్రి నారసింహ వచనములు' వెలయించినట్లుగా చెపుతారు. తాళ్ళపాక వారి వచనాలకు 'వేంకటేశ్వరా' అనే సంభోదనా మకుటం, కృష్ణమాచార్యుని వచనాలకు 'నారసింహా' అనే సంభోదనా మకుటం, బసవేశ్వరుని వచనాలకు కూడలి సంగమ దేవరా' అనే సంభోదనా మకుటాలున్నాయి.

సోమనాథుడు ప్రస్తుతా ప్రస్తుతాలైన పురాతన శివభక్తుల కథల్ని కొన్నిటిని సందర్భానుసారంగా చొప్పించి పురాణ శబ్దాన్ని సార్థకం చేశాడని విమర్శకుల అభిప్రాయం. దీనినే జైన సంప్రదాయంగా విమర్శకులు తెలియజేశారు. జైన పురాణంలో ఒక తీర్థంకరుని చరిత్ర ప్రధాన వస్తువు. ఆ మతాన్నవలంబించి సిద్ధి పొందిన ఇతరుల కథలు ఉపాఖ్యానాలుగా చెప్పడం జైనుల ఆచారంగా కనిపిస్తుంది. పాల్కురికి సోమనాథుడు ఈ సంప్రదాయాన్నే అనుసరించి బసవని చరిత్రను పురాణంగా రచించాడు. ఇందులోని ఉపాఖ్యాన కథానాయకులైన భక్తులలో కొందరు ద్రావిడులు, కొందరు కర్ణాటకులు, కొందరు ఆంధ్రులు, కొందరు ఔత్తరాహులు వున్నారు. వీరి కథల్నేగాక బసవని సమకాలికుడైన అల్లమయ్యవంటి శివభక్తుల కథలు కూడా ఇందులో చేర్చబడ్డాయి.

వీటిలో ముఖ్యమైనవిగా గొడగూచి, బెజ్జమహాదేవి, కన్నప్ప, సిరియాళుల కథల్ని చెపుతారు.

గొడగూచి కథలో అమాయకురాలైన బాలికను శివుడు సులభంగా ప్రసన్నుడై తనలో లీనం చేసుకొన్న విధం వర్ణింపబడింది. బెజ్జ మహాదేవి కథలో భక్తురాలు శివుని తన బిడ్డగా భావించి తల్లి పసిపాపకు చేసే ఉపచారాలన్నీ చేసి, తన మాతృ వాత్సల్యాన్ని చూపించడంతో భగవంతుడు ఆ ప్రేమకు ప్రీతిపాత్రుడై చూపిన భక్తవాత్సల్యం వర్ణింపబడింది. కన్నప్ప కథలో ఆటవికుడైన కిరాతబాలుడు ఆచార రహితమైన భక్తిచే జ్ఞానులకు కూడా సాధ్యపడని ముక్తిని పొందిన విధానం చెప్పబడింది. సిరియాళుని కథలో ఒక భక్తుని ధృఢ వ్రతాన్ని, శివుడు మాయా తపసి వేషం ధరించి

పరీక్షించడం, ఆ భక్తుని కుమారుని చంపి, ఆ బాలుని మాంసాన్ని ఆరగించడం, చివరకు భక్తుని ధృఢ చిత్తానికి మెచ్చి ఆ పసివాని బ్రతికించడం మొదలైన అంశాలు వర్ణింపబడ్డాయి. అయితే ఆ పసివానిని ఖండించి, అవయవ విచ్ఛేదం చేసి, వంట చేయడమనే ఘోరకృత్యం వీరశైవతత్వాన్ని ఆకళింపు చేసుకొన్న కవి తప్ప మరొకరు వర్ణించలేరని చెప్పవచ్చు. ఈ కథను వినగానే భయంతో కంపించిపోయే సున్నిత మనస్కులకు చదివి ఆనందించడం సాధ్యం కాదని చెప్పవచ్చు. అయితే సోమన కథ చివరలో, తల్లి పిల్లవానిని చేతులు చాచి, 'నావడుగా రారా! నా కన్నయ్యా రారా! నా సిరియాళ రారా!' అని పిలిచేటపుడు కరుణ రస వర్ణన చేసి కొంత ఉపశమనం కలుగజేశాడని చెప్పవచ్చు. ఆ పిలుపునందుకొని బాలుడు శివానుగ్రహంచే సజీవుడై వచ్చే ఘట్టం పాఠకులకు ఆనందాన్ని కలిగిస్తుందని చెప్పవచ్చు. ఈ పురాణంలో బసవని జీవిత చరిత్రలు, అతని మహిమలు, కొందరు భక్తుల గాధలు, కన్పిస్తాయే తప్ప బసవేశ్వరుడు ప్రతిపాదించిన వీరశైవ మతస్వరూపం అంతగా కన్పించదని చెప్పవచ్చు. అందువల్ల వీరశైవ మత సంప్రదాయాన్ని గూర్చి ఆసక్తి చూపేవారికి ఈ గ్రంథం అంతగా ఉపయుక్తం కాదని కొందరు విమర్శకుల అభిప్రాయం.

# పండితారాధ్య చరిత్ర

పండితారాధ్య చరిత్రను పాల్కురికి సోమనాధుని రెండవ కృతిగా చెపుతారు. బసవపురాణం తర్వాత దాదాపు పది సంవత్సరాలకు ఇది రచింపబడినట్లు విమర్శకుల అభిప్రాయం. బసవపురాణంలో కంటే ఈ పండితారాధ్య చరిత్రలోనే ద్విపద రచన ధారాళంగా నడిచిందని చెప్పవచ్చు. బసవపురాణంలో చెప్పబడిన కొన్ని ఉపాఖ్యానాలు ఇందులో పునరుక్తులైనాయి. బసవపురాణంలో క్లుప్తంగా వున్న కళియంబనైనారు కథ ఇందులో పెరిగినది. ఈ కథ బసవపురాణంలో పన్నెండు పంక్తులలో (ఆరు ద్విపదలలో) వుంది. పండితారాధ్య చరిత్రలో ఇది 160 పంక్తులకు పెరిగింది.

పండితారాధ్య చరిత్రకు అధికారిక ఇతివృత్తం శివతత్వ సారకర్తయైన మల్లికార్జున పండితారాధ్యుని జీవిత చరిత్ర. ఈ పండితుడు బసవేశ్వరునికి సమకాలికుడు. ఇతని వలనే శైవమత ప్రచారానికి సర్వం ధారపోసిన శివభక్తుడు. కన్నడ దేశాన బసవేశ్వరుడు, ఆంధ్రదేశాన మల్లికార్జున పండితుడు ఏక కాలంలో ఇతర మతాలపైన వ్యతిరేక భావం చూపి శైవమత సామ్రాజ్య స్థాపకులుగా ఖ్యాతి గడించారని చెప్పవచ్చు.

మల్లికార్జున పండితుడు ద్రాక్షారామ భీమేశ్వరాలయ పూజారి కుమారుడు. సమీప గ్రామమైన కోటిపల్లెలో వుండే ఒక ఆరాధ్య దేవరవల్ల శాంభవదీక్ష పొంది, బాల్యంలోనే కులాచారానికి విరుద్ధంగా, శివభక్తుల పాదోదక ప్రసాదాల, విభూతి రుద్రాక్షమాలల మహిమల్ని చాటుచూ, పురాణేతి హాసాత్మకమైన గ్రంథ జాలాన్నంతా క్షుణ్ణంగా చదివి అందలి పరమార్థసారాన్ని శివపరంగా అన్వయింపసాగాడు. ఈ పాండిత్య బలాన్నే వెంటగైకొని, సామ్రాజ్య పతనం తర్వాత బలహీనులై, అక్కడక్కడ ప్రభావహీనమైన రాచరికం చేస్తున్న సామంతరాజుల లాగా నిలిచిన బౌద్ధమత కేంద్రాలపై దాడి జరిపాడని చెపుతారు. అప్పటి చోళరాజు బౌద్ధమతావలంబి. అతని ఆస్థానంలో ఒక బౌద్ధ పండితుడు గురుపీఠాన్ని అధిష్టించి వుండడం గమనించి, ఆ బౌద్ధ పండితున్ని ఓడించదలచి నిండుసభలో సమావేశం కాగానే ఆ బౌద్ధాచార్యుడినే గాక, ఇతర మత గురువుల్ని ఎదిరించి, వారి మత సిద్ధాంతాల్ని ఖండించి, శివపారమ్యాన్ని సైద్ధాం తీకరించాడని చెప్పవచ్చు. కాని బౌద్ధాచార్యుడు తన ఓటమిని జీర్ణించుకోలేక పండితుని చులకన చేయడం గమనించిన పండితుని శిష్యులిద్దరు ఆ బౌద్ధుని చంపివేశారు. రాజు ఈ విషయంపై కోపోద్రిక్తుడై పండితుని సభకు పిలిపించి అడుగగా, పండితుడు తనే చంపినట్లు

నిందను తనపై వేసుకొనడంతో రాజు పండితుని కళ్ళు పొడిపించాడు. వెంటనే పండితుడు బసవేశ్వరుని సందర్శనార్థమై ప్రయాణమై వెడలాడు. అయితే బసవేశ్వరుడు కూడలి సంగమంలో లింగైక్యం చెందాడని తెలుసుకొని పండితుడు విలపించి చివరకు శ్రీశైలానికి సమీపంలోని గ్రామం చేరాడు. అప్పటికే వయసు పై బడడంతో పర్వత మెక్కలేక తన భక్తిని మల్లికార్జున స్వామికి నివేదింపమని ఒక భక్తుని కొండపైకి పంపాడు. తర్వాత ఆ గ్రామంలోనే కొంతకాలం నివసించి శివసాయుజ్యం పొందాడని చెపుతారు.

శివతత్వసార గ్రంథంలో పండితారాధ్యుడు రచించిన పద్యాలలో కొన్నిటిని సోమనాధుడు తన పండితారాధ్య చరిత్ర గ్రంథంలోని ద్విపదలలో ఇమిడ్చాడు. యథాతథంగా అనువదించిన పద్యాలనే గాక, మిగిలిన వాటిని సోమన తాత్పర్య ప్రధానంగా వివరించాడు. శివతత్వసారంలోని కొన్ని పద్యాలు సోమన తన పండితారాధ్య చరిత్రలో ఇమిడ్చిన విధానికి నిదర్శనాలుగా క్రింది పద్యాలను చెప్పవచ్చు.

కం|| కలదన నోపకలేదని
పలుకఁగనే రకయు మూకబధిరుల క్రియని
మ్ములు నద్వైతులు తమలో
పల వగతురు భువన భిన్నభావమున శివా

(శివతత్వసారం)

ద్వి|| కలదనంగా నోపకయుఁలేదనియు
బలుకనేరక మూక బధిరులక్రియను
బరఁగు భువన భిన్న భావంబుఁజూచి
యరయంగ నద్వైత మనగలావేది

(పండితారాధ్య చరిత్ర-వాద ప్రకరణం)

కం|| ఒండేమి మల్లికార్జున
పండితుఁడన నుండుకంటెఁ బ్రమధులలోనె
న్నొండొకొనీ యాజ్ఞోన్నతి
నుండఁగఁ గాంతునని కోరుచుండుదు రుద్రా

(శివతత్వసారం)

కం॥ జ్ఞాన జ్ఞేయ జ్ఞాతృని
దానత్రయమున నబాధిత ప్రత్యయమై
నానాగతి నవగతమగు
గాన జగద్భేద మెన్నగా సిద్ధమజా!

(శివతత్త్వసారం)

ద్వి॥ ఎఱుఁగంగఁబడు వస్తు వెఱిఁగెడి తాను
నెఱుకయు ననుమూఁడు తెఱఁగులు భువిని
బరఁగియ బాధిత ప్రత్యయమగుచు
నరయ నానాగతి నవగతంబగుట
హస్తామలక మెట్టులట్లను సుప్రశస్త జగద్భేద సరణి సిద్ధముగఁ
దమకించి మఱి యభేదము పల్కఁజనునె

(పండితారాధ్య చరిత్ర - వాదప్రకరణం)

భవికవుల ఆంధ్ర గ్రంథాల్లో మహా భారతానికెటువంటి స్థానముందో శివకవుల గ్రంథాల్లో సోమన రచించిన పండితారాధ్య చరిత్రకు అంతే స్థానముందని వేటూరి ప్రభాకరశాస్త్రి గారి అభిప్రాయం.

కం॥ దేవా సంసారాంబుధి
లో వెలువడఁజేసి ప్రమథలోకం బెఱుగన్
నావాఁడు వీఁడు సుండీ
నావే నన్నుంపవే గణంబుల నడుమన్

(శివతత్త్వసారం)

ద్వి॥ ఊర్జిత ప్రమథాత్మ యొండేమి మల్లి
కార్జున పండితుఁడనఁగ నిచ్చోట
నుండుట కంటె నెన్నండొకో ప్రమథ
మండలిలో భవన్మహ దాజ్ఞఁజేసి
యుండంగఁ గాంతు నాకోయనికోరు
చుండుదు నన్నట్టును చఁగదయ్య
దేవర! యీ సంసార తీవ్ర దుఃఖాన్ని
లోవెలిఁ బ్రమథాదిలోకం బెలర్ప
నావాఁడు వీఁడు సుండి వేఱుగాఁడు
నావె నన్నంపు గణంబుల నడుమ

(పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణం)

ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని వేదాంతవిదులు వేదాంతమనియు,
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని, కవివృషభులు మహా కావ్యమనియు,
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని, యైతిహాసికు లితిహాస మనియుఁ,
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని మహిఁ
గొనియాడుచుండ,
వివిధ వేదతత్త్వ వేది వేద వ్యాసుఁడాదిముని పరశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండఁజేసె భారతంబు
(మహాభారతం - ఆదిపర్వం 1-32).

ఈ పద్యంలో వేద వ్యాసునికి బదులు పాల్కురికి సోమనాథుని పేరు, భారతానికి బదులు పండితారాధ్య చరిత్రను, విష్ణు సన్నిభుడనే మాటకు బదులు హరసన్నిభుడని మార్చి చదివితే పండితారాధ్య చరిత్ర సమగ్ర స్వరూపం తెలుస్తుందని వేటూరి వారి అభిప్రాయం.

పాల్కురికి సోమనాథుడు తన దృష్టిలో హరునతిశయించిన మల్లికార్జున పండితారాధ్యుని తన కావ్యానికి నాయకునిగా జేసి, హరునిపట్ల తనకున్న అసమాన గౌరవాన్ని, భక్తి ప్రపత్తులను చాటాడని చెప్పవచ్చు. లక్షణ గ్రంథాల్లో చెప్పబడిన శృంగారం కంటే పండితారాధ్య చరిత్రలోని శృంగారం కొంత విలక్షణంగా వుందని చెప్పవచ్చు. ఈ కావ్య నాయకుడు సాధారణ కావ్యాల్లోని నాయకుని వంటివాడు కాదు. సోమనాథుడు ఈ కావ్యంలో భక్తి శృంగారమనే కొత్తరీతి శృంగారాన్ని కల్పించాడు. కాని కావ్యరస నిరూపణ విషయంలో పండితారాధ్యుడు నాయకుడు కాడు. శివుడే నాయకుడు. వీరి సంబంధాన్ని సోమన భక్తి శృంగారాత్మకంగా నిరూపించాడు.

పనుగొన గురుమూర్తి పతి కూటమునకు
మనసు నపుంసకంబన నెట్లవచ్చుఁ
బున్నపుంసక గుణంబులు గల్గెనేని నెన్నంగ
నతి కామియే యట్లుగాక-
మగలకు మగడగు మత్పతిఁగవయ మగవాండ్రు
నాండ్రుగా మరుగుదురనిన
మనసు గూడుట సోద్యమా పతిననుట మనసు
నకటమున్న తన విభుఁగదిసి
మనికుఁడై తనుదాన మఱచియున్నట్టి యనువు
దానిది యొకో యట్లునుగాక!

సొగయంగ నొక్కటఁ జూచుట రెంట, వగమూఁట
        నూర్పులు నిగుడ, నాల్గింటఁ
దాపమైదింటను, దయ్యెడాఱింట, నేపారఁగుడువమి
        యేడింట మరులు
నొక్కండుఁ బలకమి యొగినెన్మిదింట, నిక్కమార్పులు
        లేమినెఱిఁ దొమ్మిదింటఁ
జావు పదింటఁ గ్రుచ్చుఱ విరహులకు భావింపనివియ
        దశావస్థలంద్రు
దా విభ్రుఁబాయక చావక చచ్చు నీ విషయావస్థ
        లితరుల కగునే?

సాధారణంగా మహాకావ్యంలో అష్టాదశ వర్ణనలుండాలని లాక్షణికుల అభిప్రాయం. కాని సోమన ఈ గ్రంథంలో అష్టాదశ వర్ణనలేగాక అనేక వర్ణనల్ని చేశాడు. కావ్యంలో వర్ణనలు బహుళంగా వుండాలని సోమన ఇన్ని వర్ణనలు చేసినట్లు తెలుస్తుంది. సత్కృతిలో 36 అలంకారాలుండాలని సోమనాధుడు చెప్పడం అతని కాలంనాటి సంప్రదాయమై వుండవచ్చు. అందువల్ల సోమన అలంకారాలు 36 అని నిర్ణయించబడ్డ ఆలంకారిక సంప్రదాయకాలంనాటి వాడై వుండొచ్చని నిర్ణయించవచ్చు. అలంకారాల తర్వాత కావ్యానికి అర్థబావాలు ప్రధానమైనవని సోమన అభిప్రాయం. స్థాయీభావాలు, విభావాలు, అనుభావాలు, సాత్త్వీక భావాలు, సంచారి భావాలు అనేవి అర్థభావాలై వుండవచ్చునేది సోమన అభిప్రాయంగా చెపుతారు.

ఈ విధంగా సోమనాధుడు తన పండితారాధ్య చరిత్రలో తన కాలంలో వుండిన ఆలంకారిక సిద్ధాంతాన్ని పేర్కొని కావ్యత్వసిద్ధి పట్ల తన అభిప్రాయాన్ని స్పష్టంగా తెలియజేశాడని చెప్పవచ్చు.

## బసవేశ్వరుడు

బసవేశ్వరుడు బాల్యంలోనే జ్ఞాని అన్పించుకొని, వర్ణ వ్యవస్థను తిరస్కరించిన గొప్ప శివభక్తుడు ఉపనయనం లాంటి బ్రాహ్మణ కర్మల్ని వర్జించాడు. శివభక్తిసారాన్ని ఉద్బోధిస్తూ తల్లిదండ్రుల్ని ఇంటిని వదలి కళ్యాణకటకంలో బిజ్జలుని మంత్రిగా వున్న తన మేనమామ ఇంటచేరి శివతత్వసారాన్ని కొనసాగించాడని చెప్పవచ్చు. ఇతని తల్లిదండ్రులు, మేనమామ శైవులైనప్పటికీ, బ్రాహ్మణకర్మల్ని విసర్జించలేదు. బసవేశ్వరుడు ఈ కర్మల్ని విసర్జించి వీరశైవునిగా వినుతి కెక్కాడు.

బసవేశ్వరుడు వీరశైవ మత ప్రవర్తకుడై తన సర్వస్వాన్ని అర్పించడమేకాక, రాజభాండారాన్ని కూడా వినియోగించిన మహా శివభక్తుడు బసవేశ్వరుని కాలంనాటికి శైవ మతంలో వున్న వివిధ శాఖల్లో ఏకత్వం లేకపోవడమే కాకుండా, విష్ణు ప్రాశస్త్యాన్ని చాటి చెప్పే వైష్ణవమతం వ్రేళ్ళూని విస్తరిస్తుండడంవల్ల, బసవేశ్వరుడు శైవమత సముద్ధరణకై నడుంబిగించి, శైవశాఖలకు స్థిరత్వాన్ని కలుగజేసిన, శివ సామ్రాజ్యాన్ని స్థాపించిన వీరుడుగా చెప్పవచ్చు.

బసవేశ్వరుడు సహజంగా సంగీత, సాహిత్యాభిలాషి. అతడు తాను స్వీయరచన చేసిన గీతాల్ని తానే గానం చేస్తుంటే, భక్తులంత పారవశ్యంతో అతని చుట్టూ చేరి, గానం చేసేవారని చెపుతారు. తన నూతన మతాన్ని తన గీతాలద్వారా ప్రచారం చేసిన గొప్ప భక్తుడు బసవేశ్వరుడు. ఇతని మార్గాన్నే ప్రజలంతా అనుసరించి చరితార్థులైనారని చెప్పవచ్చు. స్వమత రక్షణార్థమై వీరు శూరత్వాన్ని, భక్తి ప్రదర్శనంలో వీరత్వాన్ని ప్రదర్శించినందువల్లనే వీరు వీరశైవులుగా ఖ్యాతి చెందారని చెప్పవచ్చు. అయితే బసవేశ్వరుడు భక్తి పేరుతో మిండ జంగాల్ని ప్రోత్సహించడం, రాజాజ్ఞను ధిక్కరించడం, రాజధనాగారాన్ని దుర్వినియోగం చేయడం, ప్రభు హత్యకు కారణమవడం మొదలైన అంశాలు అంత సమర్థనీయాలు కావని విమర్శకుల అభిప్రాయం. జ్ఞానహీనమైన భక్తి అంధము, భక్తిహీనమైన జ్ఞానము వంధ్యము. **(Faith without wisdom is blind and wisdom without faith is barren).** ఈ సిద్ధాంతాన్ని తత్వవేత్తలంతా అంగీకరించారు. అయితే మతావేశపరులు ఈ సిద్ధాంతాన్ని వ్యతిరేకించారని చెప్పవచ్చు. బసవేశ్వరుడు జ్ఞాని, భక్తుడు అనడంలో ఎలాంటి సందేహం లేకపోయినప్పటికీ, బసవేశ్వరుని అనుయాయవర్గంలో చాలామంది జ్ఞానరహితులైన భక్తులుగా భావించబడడం వల్ల ఆ కాలంలోని శైవేతరులైన భక్తులు బసవేశ్వరుని మతంపట్ల ఏవగింపు ధోరణిని అవలంబించారని విమర్శకుల అభిప్రాయం.

బిజ్జలుని మంత్రిగా వున్న కాలంలో బసవేశ్వరుడు జొన్నలను ముత్యాలుగా మార్చడం, వంగకాయాల్ని లింగకాయలుగా మార్చడం, విషాన్ని అమృతప్రాయంగా సేవించడం మొదలైన మహిమలతో తన అప్రాకృత శక్తిని వ్యక్తం చేశాడని చెప్పవచ్చు. అయితే బసవేశ్వరుడు రాజాజ్ఞను ధిక్కరించినందుకు, రాజాగ్రహానికి గురై కుటుంబంతో సహా కళ్యాణకటక నగరం వీడి కూడలి సంగమం చేరి లింగైక్యం చెందినట్లుగా చెపుతారు.

బసవపురాణాన్ని బట్టి, ఇతర చారిత్రకాధారాల్ని బట్టి గ్రహించిన బసవని చరిత్రగా దీనిని చెప్పవచ్చు.

బసవేశ్వరుడు వ్రాసిన భక్తిగీతాలు నాలుగు లక్షలకు పైగానే వున్నట్లు చెపుతారు. వీటికి వచనాలని పేరు. తాళ్ళపాక అన్నమయ్యా రచించిన వేంకటేశ్వర వచనాలు, కృష్ణమాచార్యుడు వ్రాసిన సింహాద్రి నారసింహ వచనాలు ఈ కోవలోనివే. వీరందరూ తమ ఇష్టదైవంపై భక్తి పారవశ్యంతో వ్రాసిన గీతాలు. ప్రతి వచనానికి చివర మకుటంగా వారి ఇష్టదేవతా సంభోదన వుంటుంది. తాళ్ళపాక వారి వచనాలకు 'వేంకటేశ్వరా' అనే సంభోదనా మకుటం, కృష్ణమాచార్యుల వచనాలకు 'నరసింహా' అనే సంభోదనా మకుటం వున్నట్లే బసవని వచనాలకు 'కూడలి సంగమ దేవరా' అనే మకుటం వుంది.

కృష్ణ తుంగభద్ర నదులు సంగమించిన తీర్థ స్థలంలోగాని, కృష్ణామలాపహా నదులు సంగమించిన తీర్థ స్థలంలోగాని వెలసియున్న సంగమేశ్వర లింగమే కూడలి సంగమ దేవునిగా చెపుతారు. బసవేశ్వరునికి ఇష్టదైవం, గురువు ఈ కూడలి సంగమదేవుడే. చివరకు బసవేశ్వరుడు లింగైక్యం చెందింది ఈ సంగమ క్షేత్రంలోనేనని సోమన వివరించాడు.

ఈ విధంగా బసవేశ్వరుడు వీరశైవ మత వ్యాప్తికై కంకణధారియై, ఆ శివుడి సేవలోనే తన సర్వస్వాన్ని సమర్పించి, తర్వాతి తరం వారికి మార్గదర్శకంగా నిలిచాడని చెప్పవచ్చు. విభూతి, రుద్రాక్షధారణంలాంటి వర్ణాశ్రమ ధర్మాల్ని నెలకొల్పి వీరశైవానికొక ప్రత్యేక ప్రతిపత్తిని బసవేశ్వరుడు కల్పించాడనడంలో ఎలాంటి సందేహం లేదని చెప్పవచ్చు.

# వీరశైవతత్వం

## శైవసిద్ధాంత పరిచయం

అనాది నుంచి భారత దేశంలో ఏదో ఒక రూపంలో శైవమతం వుండిందని చెప్పవచ్చు. ఋగ్వేదంలోనే రుద్రుడను పేరదైవం వెలిశాడు. మూర్తిమంతుడుగ చెప్పబడినప్పటికీ అతడిని దైవం అనడంకంటే ఒక ప్రకృతిశక్తి అనడం సబబని చెప్పవచ్చు.

ఋగ్వేదంలో శివ శబ్దమున్నా అది సంజ్ఞానామంగా, రుద్రుడనే మూర్తిపరంగా కానరాదు. అది కేవలం విశేషణ పదంవలెనే 'శివాయ శివతరాయ' అని తరతమ ప్రత్యయాలతో ప్రయోగింపబడుతుంది. ఆ పదానికి మంగళ కరుడైన శివశంకరుడని అర్థం.

ఋగ్వేదకాలంలో కేవలం ప్రకృతి దేవతారూపంలో స్తుతింపబడుతున్న రుద్రుడు శ్వేతాశ్వతరోపనిషత్కాలం నాటికి 'శివుడు'గా ఆరాధ్య దైవతమై పూజింపబడసాగాడు. ఇలాగే వేదకాలంలో పెక్కు ప్రకృతి శక్తులు మూర్తి రహితభావంతో కీర్తింపబడితే, అవే ఉపనిషత్కాలంలో దైవతాలై మూర్తిభావం పొంది పూజింపబడసాగాయి. రుద్రశివుడు పరబ్రహ్మ స్వరూపుడుగా భావింపబడ్డాడు.

సింధులోయలోని హరప్పా, మొహం జాదారోలలో త్రవ్వకాలు సాగించినపుడే కొన్ని అద్భుత విషయాలు బయల్పడ్డాయి. క్రీ.పూ. కొన్నివేల సంవత్సరాల నుండే నాగరికత అక్కడ వెలసినట్లు గుర్తింపబడింది. ఆ కాలంనాటికి అక్కడ ప్రజలు కట్టిన గృహాలు, ఏర్పరచుకొన్న నీటి వసతులు, మురుగునీటి కాలువలు, పారుదల సౌకర్యాలు, ఉపయోగించుకొన్న గృహోపకరణాలు, వాని ఆకారాలు, పూజా విధానాన్ని గుర్తించే చిహ్నాలు అనేకం బయల్పడ్డాయి. ఆ కాలంలో కూడా శివపూజ జరుగుతుండేదనడానికి నిదర్శనాలు. చిన్నవి, పెద్దవి అయినలింగాలు, పాణిపట్టాలు మొదలైన శివచిహ్నాలు అని చెప్పవచ్చు. దీనిని బట్టి శివుని లింగరూపంలో శక్తిని పాణిపట్ట రూపంగా భావించి పూజించే విధానం ఆనాటికే వున్నట్లు తెలుస్తున్నది. ఈనాడు దక్షిణ దేశంలో గల శివాలయాలన్నింటిలోను సామాన్యంగా కన్పించే 'చరణామృత కుండాన్ని' పోలిన 'జలనాళిక' (Closed outlet) హరప్పా, మొహంజొదారోలలో కన్పించినట్లుగా శ్రీ ఆర్.పి.బెనర్జియా తన, 'Archaeological Survey - Annual Report' (1923-24)లో ప్రకటించారు.

అందువల్ల శైవమే భారతదేశంలో ప్రాచీనమైన మత మనడం నిర్వివాదాంశం. అనాటికే శివలింగాలు కన్పించడం వల్ల లింగపూజ ప్రాచీనత తెలుస్తున్నది.

హరప్పా, మొహంజొదారో త్రవ్వకాలలో లభించిన ప్రాచీనావశేషాల్లో బహుముఖుడైన శివుడున్నాడు. యోగాసనంపై కూర్చున్న శివుడున్నాడు. త్రిశూలధారియైన శివుడున్నాడు. శివునకు, వృషభానికి గల సంబంధాల్ని తెలిపే గుర్తులున్నాయి. వీటిని గమనిస్తే ఆర్యుల ఆగమనానికి పూర్వమే ఉత్తర భారత దేశంలో శైవముండేదని తెలుస్తుంది. ఆర్యుల నాగరికత వెలసిన తొలి రోజుల్లో లింగపూజ వారికి తెలియదు. కనుక ఈ సింధులోయ నాగరికత, సంస్కృతి అంతా ద్రావిడ సంస్కృతికి చెందినదని, అది ఆర్యుల నాగరికత కంటే కొన్ని వేల సంవత్సరాలకు పూర్వందే అయి వుండవచ్చునని Heras పండితుని అభిప్రాయం. ఆర్యుల ఒత్తిడికి తట్టుకోలేకనే ద్రావిడులు క్రమంగా దక్షిణ ప్రాంతాలైన కర్ణాటక, తమిళ, కేరళ ప్రాంతాల్లో నివాసమేర్పరచుకొన్నారని చెప్పవచ్చు.

## శైవ సిద్ధాంతాలు

భారత దేశంలో ప్రాచీన మతం శైవమేనని, ఆనాటి హిందూమతానికి అది రూపమని, దానినే ఆర్యులు గ్రహించి తమ సంస్కృతికి అనుగుణంగా క్రొత్తరూపంలో వెలయించారని C. Eliot గారు విశదీకరించారు. ఈ భావాన్ని బలపరచడానికి 'శివ శబ్దానికి మూలమైన 'శివప్పు' శబ్దం ద్రావిడ ప్రకృతి నుంచి వచ్చిన విషయాన్ని ఉదాహరణంగా చెప్పవచ్చు.

ఆగమాలలో,

"యదాసాపరమా శక్తిః స్వేచ్ఛయా విశ్వరూపిణీ
నశివేన వినాదేవీ, నదేవ్యాచ వినాశివః
శివశక్తి రితి హ్యేకం తత్త్వ మహుర్మనీషిణః"

అని వర్ణింపబడింది. దీనిని బట్టి శివుడు వేరువేరైన భిన్నతత్త్వాలు కావని, శివరూప ప్రకాశం, విమర్శరూప శక్తిని కలిగిన ఒక దివ్యతత్త్వమని కామ కళావిలాసతంత్రం తెలియజేస్తున్నది.

(సంస్కృత వాఙ్మయ చరిత్ర - ద్వితీయ సంపుటం - 96వ పేజీ)

శైవం ద్రావిడమూలమని చెప్పుటకు క్రింది ప్రమాణం ఉపయుక్త మవుతుంది. శివాలయాలు దక్షిణదేశంలో వున్నా, ఉత్తరదేశంలో వున్నా ఆ ఆలయాల్లో ప్రవేశించడానికి అర్హత, భగవంతుని పూజలో పాల్గొనే అధికారం,

అర్చామూర్తిని స్పృశించే స్వేచ్ఛ అందరికీ వుంది. అయితే శ్రీ వైష్ణవం మొదలైన సంప్రదాయాలకు చెందిన విష్ణ్వాలయాల్లో ఈ అర్హతలు ఉపనయనం వంటి పద్ధతుల్ని పాటించే మొదటి వర్ణత్రయం వారికే వున్నాయి. ఇప్పటికే ఒక్క ఆరాధ్యశాఖ (దక్షిణదేశంలోని)లో తప్ప అన్నిజాతుల వారిలో ఈ ధర్మంకుల విచక్షణ రహితంగానే అవలంబింపబడుతోంది.

శైవ సిద్ధాంతం దక్షిణదేశం దాటి ఉత్తరానికి వ్యాపింప లేకపోవడానికి అనేక కారణాలున్నాయి. అవి ఆర్య నాగరికత ఉత్తరాన పూర్తిగా కొనసాగుతుండడం, శైవ సిద్ధాంత మత ప్రాతిపదకాలైన మూల గ్రంథాలు మొదట ద్రావిడ భాషలో రచింపబడి వుండడం వల్ల ఆ భాష నేర్చుకొనక ఆ మతరహస్యాల్ని అవగాహన చేసుకోకపోవడము భారతదేశంలో మత వ్యాప్తికి సంస్కృత భాష తోడ్పడినట్లుగా మరొక భాష తోడ్పడలేదనడం నిర్వివాదాంశం. ఈ కారణాన్నే శ్రీ C. Eliot గారు "The Tamil Literature of Dravadian Saivism is ignored by many European Scholars" అని పేర్కొన్నారు. అందువల్లనే శైవ సిద్ధాంత సంప్రదాయం దక్షిణ దేశం వదలి వెళ్ళలేకపోయింది.

ఆర్యుల ఆగమనానికి పూర్వం భారత దేశంలో వుంది శైవమే. ఆర్యులు దాన్నే అనుసరించారు. వేద సమ్మతమైన శైవమార్యులది. శైవాగమాలు దీనినే బలపరిచాయి. పురాణాల్లో కూడా ఇవి ప్రతిపాదితమైనాయి. ఈ శైవం ప్రధానంగా సామాన్య శైవం, మిశ్ర శైవం, శుద్ధశైవం, అనే భేదాలతో వున్నట్లు సుప్రభేదా ద్యాగమాల ద్వారా తెలుస్తున్నది. అన్యదేవతా ద్వేషం లేకుండా, ఎల్లవేళలా శివభావననే కలిగివుండడం సామాన్య శైవం. దీనిని శ్రీనాథుడు మొదలైనవారు ఆచరించారు. అన్యదేవతా పూజను కూడా అంగీకరించి, శివభక్తి పాటించడం మిశ్ర శైవం. దీనిని నేడు స్మార్తపద్ధతి అని కూడా అంటారు. శివేతర దైవాన్నంగీకరింపని శైవం శుద్ధ శైవం. దీనిలోని పాశుపతశాఖ అన్నిటికంటే ముఖ్యమైనది.

పాశుపతం, శైవ సిద్ధాంతం, ప్రత్యభిజ్ఞా దర్శనం - ఈ మూడు పరస్పర సంబంధాలైన శైవ శాఖలని స్పష్టంగా చెప్పవచ్చు. వీటిలో సమాన ధర్మాలెన్నో వున్నాయి. పాశుపతానికి నకులీశ పాశుపత దర్శనమని పేరు కలదు. ఈ దర్శనానికి మూల గ్రంథమైన పాశుపత సూత్రాలు క్రీ.శ. ప్రథమ శతాబ్దకాలం నాటికే వ్రాయబడిందని విమర్శకుల అభిప్రాయం. ఈ సూత్రాలకు రాశీకరుడు వ్యాఖ్యానం వ్రాశాడు. ఈ వ్యాఖ్యానానికి పంచార్థ భాష్యమని పేరు. ఈ పంచార్థ భాష్యంలో, కారణం (Cause), కార్యం (Effect), యోగం

(Meditation), విధి (Behaviour), దుఃఖాతం (Dissotition of Sorrow) అనే 5 అర్థాలు (పదార్థాలు) వివరింపబడివుండడం వల్ల ఇది పంచార్థ భాష్యమైంది. ఈ దర్శన గ్రంథాన్ని 1940లో శ్రీ ఆర్. అనంత కృష్ణశాస్త్రిగారు ప్రకటించారు. పేరును బట్టి నకులీశుడే ఈ సంప్రదాయ ప్రవర్తకుడని చెప్పవచ్చు ఈ పంచార్థ భాష్యంలోని 5 అర్థాల విశదీకరణ ఇలా వుంది. 'కారణం' అనగా పతి అని, 'కార్యం' అనగా పశువు అని శ్రీ రాధాకృష్ణ పండితులు వ్రాసినారు. (Indian Philosophy - Volume I - Page 488).

శ్రీ శంకరాచార్యులవారు 'పశు' శబ్దాన్ని, 'అశాశ్వతమైన భౌతిక శరీరమునే శాశ్వతమైన ఆత్మగా చూచునది' అని నిర్వచించారు.

(మహావాక్య దర్పణం - 50వ శ్లోకం).

పశువులను కాపాడేవాడు కనుకనే శివుడు పశుపతి అయ్యాడని, ప్రాణికి దుఃఖాంతం ఆ పశుపతి కారుణ్యంచేతనే కలుగుతుంది కాని, దానికి గల జ్ఞానవైరాగ్యాలతోటి కాదని రాశీకరుడు, "తస్మాత్ ప్రసాదాత్ సదుఃఖాంతం ప్రాప్యతేనతు జ్ఞానవైరాగ్య ధర్మైశ్వర్య త్యాగమాత్రాత్ ఇత్యర్థః" అని తన వ్యాఖ్యానంలో వివరించాడు. (పాశుపత సూత్రములు - 6వ పేజీ).

ఈ పాశుపత సూత్రాల్లో వివరింపబడిన ఈ పతి, పశు, పాశాలనేవి త్రికమని సంజ్ఞతో దక్షిణదేశంలోని శైవ సిద్ధాంత సంప్రదాయంలోను, కాశ్మీరంలోని ప్రత్యభిజ్ఞా దర్శనంలోను ప్రధానస్థానాన్ని ఆక్రమించాయని చెప్పవచ్చు.

## శైవ సిద్ధాంతం

'పతి' అంటే ఈశ్వరుడు (God), 'పశు'వంటే ఆత్మలేక ప్రాణి (Soul), 'పాశ'మంటే సంసారం లేక పదార్థం (World or Matter) వీటి తత్త్వాన్వేషణే శైవ సిద్ధాంతంలోని ప్రధాన సూత్రం. ఈ శైవ సిద్ధాంతం శంకరాచార్యులు ప్రతిపాదించిన అద్వైత సిద్ధాంతం లాగా, రామానుజాచార్యులు ప్రతిపాదించిన విశిష్టాద్వైత సిద్ధాంతం లాగా వేద ప్రాధాన్యాన్నంగీకరించిందని చెప్పవచ్చు. ఈ శైవ సిద్ధాంత సంప్రదాయం మూడు విధాలైన ప్రమాణాల్నంగీకరిస్తున్నది. అని ప్రత్యక్ష, అనుమాన, శ్రుతి ప్రమాణాలు. ఈ శ్రుతి శబ్దంవల్ల వేదాలు, ఉపనిషత్తులు, 28 శైవాగమాలు గ్రహింపబడుతున్నాయి. వేదాలు సర్వజన సామాన్యాలు, ఆగమాలు కేవలం శైవ సంప్రదాయ బోధకాలు. ఆగమాల్ని శివాగమాలు, రుద్రాగమాలని విభజించవచ్చు. శివాగమాలు పది. అవి కామికాగమం, యోగజాగమం, చింత్యాగమం, కారణాగమం, అజితాగమం,

దీప్తాగమం, సూక్ష్మాగమం, సహస్రాగమం, అంశుమదాగమం, సుప్రభేదాగమం. ఈ పది మూలాగమాలుగా, ఈశ్వర ప్రోక్తాలుగా విశ్వసింపబడుతున్నాయి. ఇవి సంఘంలో మొదటి వర్ణత్రయం వారిచే అనుసరించబడేవని చెప్పవచ్చు. రుద్రాగమాలు 18. అవి విజయాగమం, న్విశ్వాసాగమం, స్వాయంభవాగమం, వీరాగమం, రౌరవాగమం, మకుటాగమం, మలాగమం, చంద్రజ్ఞానాగమం, బింబాగమం, ప్రోద్గీతాగమం, లలితాగమం, సిద్ధాగమం, శాంతాగమం, సర్వోత్తరాగమం, పారమేశ్వరాగమం, కిరణాగమం, అనలాగమం, వాతులాగమం. ఇవి అందరికొరకు ఉద్దేశింపబడినవి. ఈ 18 మనుష్య సంపాదితాలని విశ్వసింపబడుతున్నాయి. ఈ 28 ఆగమాల్లోని సారాన్నంతా తీసి 'పౌష్కరాగమ' మని శివుడే సామాన్య జనం కోసం సంగ్రహించినట్లుగా వైతిహ్యంలో వుంది.

ఈ శైవాగమాలు 28ని పరమ ప్రమాణంగా అంగీకరించు సంప్రదాయాలు భరతఖండంలో మూడున్నాయి. అవి దక్షిణ దేశంలోని తమిళనాట వెలసిన శైవ సిద్ధాంత సంప్రదాయం, పశ్చిమ దేశంలోని కర్ణాట, మహారాష్ట్రలలోని వీరశైవ సంప్రదాయం, ఉత్తరదేశంలోని కాశ్మీరంలో వెలసిన ప్రత్యభిజ్ఞా సంప్రదాయం.

శివాగమాలన్నీ ఒక్కొక్కటి నాలుగు పాదాలుగా విభజింపబడ్డాయి. అవి చర్యాపాదం, క్రియాపాదం, యోగపాదం, జ్ఞానపాదం. వీటిలో ముఖ్యమైంది జ్ఞానపాదం. ఈ ఆగమాలన్నీ వేదోపనిషత్తుల కాలానికి తర్వాత, పురాణ కాలానికి పూర్వం వెలసి వుండవచ్చునని విమర్శకుల అభిప్రాయం.

ఈ శైవ సిద్ధాంతంలో శివుడు, జీవుడు ఇద్దరూ సమాన స్థాయిలో వున్నారు. శివజీవులు నిత్యాలైన భిన్నతత్త్వాలని శైవ సిద్ధాంతం ప్రతిపాదిస్తోంది. శివతత్త్వమెంత నాశరహితమో, జీవతత్త్వం కూడా అంతే నాశరహితం. శివతత్త్వమెంత శాశ్వతమో, జీవతత్త్వం కూడా అంతే శాశ్వతం. జీవుడు దేహాన్నాశ్రయించి దేహభిన్నుడై వున్నాడు. జీవుడు ఆధ్యాత్మ తత్త్వమే కాని, స్థూలపదార్థం మాత్రం కాదు. అంటే జీవులకి స్థూల రూపం లేదని చెప్పవచ్చు. మన శరీరంలోని ప్రాణ వాయువుతో జీవుని పోల్చరాదు. అందువల్ల ప్రపంచంలో కన్పించే అన్ని పదార్థాలకంటే జీవుడు భిన్నుడని చెప్పవచ్చు.

జీవుడు రాగద్వేష వశుడైనపుడు, రాగవశుడై ఇష్ట వస్తు ప్రాప్తికై కొన్ని అకృత్యాలకు పాల్పడడం జరుగుతుంది. అటువంటప్పుడు జీవుడు ముక్తిని

పొందే అవకాశాలు చాలా తక్కువ. రాగద్వేషాతీతుడై, భగవత్ప్రీతిగా ప్రవర్తిస్తేనే అతనిలోని 'అహం' నశించి పరిశుద్ధుడై మోక్షగామి అవుతాడని చెప్పవచ్చు. ఇందుకతడు రాగద్వేషాల్ని జయించాలి.

జీవునకు మోక్షావస్థ ఆకస్మికంగా కలుగదు. నిరంతర ప్రయత్నంపై ఆధారపడి, జీవితమంతా పాటుపడితే తప్ప లభించకపోవచ్చు. ఇది జీవితంలో ఒక క్రమంగా సాగుతుంది. ఈ క్రమం నాలుగు దశల్లో ముగుస్తుంది. అవి చర్య, క్రియ, యోగం, జ్ఞానం. ఈ నాలుగు దశల్లో మోక్షాన్ని సాధింపదలిస్తే దీక్ష అవసరం.

చర్య అంటే భటుడు యజమానిని సేవించినట్లుగా పత్రపుష్పాలతో శివుని సేవించడం. ఇది ప్రాథమిక దశ. ఇది వ్యక్త్యారాధనం. ఇచ్చట శివమూర్తే శివుడు. తిరునావుక్కరసు ఈ మార్గాన్ని అవలంబించిన వారిలో ప్రసిద్ధుడు.

క్రియ అంటే శివుని నిరాకారునిగా భావించి సేవించడమని చెప్పవచ్చు. ఈ మార్గం కుమారుడు తండ్రిని సేవించే విధానాన్ని పోలినదిగా చెప్పవచ్చు. దీనికి సత్పుత్రమార్గమని పేరు. దీనిలో మంత్రోచ్చారణం ప్రధానం. మోక్షమార్గంలో ఇది రెండవదశ. తిరుజ్ఞాన సంబంధరు ఈ మార్గాన్ని అనుసరించిన వారిలో ముఖ్యుడుగా చెప్పవచ్చు.

యోగం అంటే జీవుడు శరీరంలోని నాడీమండల జ్ఞానం కలిగించి ప్రవర్తించే విధానం. జీవుడు ఈ యోగ సాధనకాలంలో శివునితో మిత్రునిలాగా సహకరిస్తాడని చెప్పవచ్చు. ఈ మార్గానికే సహమార్గమని పేరు. మోక్షమార్గంలో ఇది మూడవదశ. సుందరమూర్తి అనే యోగీశ్వరుడు ఈ మార్గాన్ని త్రొక్కినవారిలో ప్రసిద్ధుడని చెప్పవచ్చు.

జ్ఞానమార్గం చివరిది. ఇందులో సమకక్ష్యలో ఆధ్యాత్మికంగా శివునితో సమకక్ష్యలో నిలుస్తుంది. ఇది భార్యాభర్తల సంబంధాన్ని పోలినట్టిది. ఈ మార్గాన్నే సన్మార్గమంటారు. మాణిక్య వాచకర్ అనే యోగీంద్రుడు ఈ మార్గాన్ని అనుసరించిన వారిలో ప్రసిద్ధులని చెప్పవచ్చు.

శైవ సిద్ధాంతంలో సాయుజ్యమంటే ద్వైతా ద్వైత పద్ధతిలో జీవేశ్వరులు భిన్నులైనప్పటికీ, గుర్తింపరానంతగా, ప్రత్యేక ప్రతిపత్తి తెలియనంతగా కలసిపోవుటయేకాని, శంకరాద్వైత పద్ధతిలో శివునిలో అంతర్భవించి ప్రత్యేక

వ్యక్తిత్వాన్ని పోగొట్టుకొనడం కాదని చెప్పవచ్చు. శైవ సిద్ధాంతంలో జీవుడు, శివుడు, సంసారం మూడూ ప్రత్యేక వ్యక్తిత్వం కలిగిన భిన్నతత్త్వాలు. జీవుడు శివునిలో ఐక్యమైతే ఈ శైవ సిద్ధాంతం సార్థకత నొందినట్లుగా చెప్పవచ్చు.

ఈ విధంగా పాల్కురికి సోమనాథుడు తన రచనల ద్వారా శైవసిద్ధాంతాన్ని, తద్వారా పరిణమించిన వీరశైవతత్త్వాన్ని పామర జనులకు కూడా అర్థమయ్యేట్లు విశ్లేషించాడని చెప్పవచ్చు.

ప్రాచీన నాగరికతకు చిహ్నాలుగా నిలిచిన మొహంజొదారో, హరప్పా శిథిలాల్లో వెలువడిన శాసనాలలో శివారాధన గురించి, శైవమతాన్ని గురించి వుండడం చేత ఇప్పుడు ప్రపంచ వ్యాప్తి పొందిన మతాలన్నిటిలోను శైవమతం చాలా ప్రాచీనమైనదని చెప్పవచ్చు. మన దేశంలో అన్ని ప్రాంతాల్లో, అన్ని రాష్ట్రాల్లోని ఆలయాల్లో శివలింగాలు ప్రతిష్ఠింపబడి వుండడాన్ని ఈ మత వ్యాప్తికి, ప్రాచీనత్వానికి నిదర్శనంగా చెప్పవచ్చు. శైవారాధన ఒక విశిష్టమతంగా ఎపుడు రూపొందెనో చెప్పడం కష్టతరమైనప్పటికీ శైవతత్త్వం, ఆచరణ అనే అంశాల గురించి ఆగమాలు చాలాకాలం క్రిందనే చెప్పినట్లుగా తెలుస్తున్నది. కాలం గడిచేకొద్దీ ఆగమాల్లో చెప్పిన విషయాలు, వేదాల్లోని విశేషాలు ఒకదానితో ఒకటి ఏకీభవించడం జరిగిందని చెప్పవచ్చు. తిరిగి వాటిలో కూడా బిన్నత్వం ఏర్పడి అనేక మార్పులు సంభవించాయి. వేదాల్లోని పంచభూతాల ఆరాధన క్రమంగా ఆలయాల్లోని విగ్రహారాధనగా రూపొందింది. ఆగమాల్లో విగ్రహారాధన గురించి చెప్పినట్లే వేదాల్లోని వర్ణాశ్రమ ధర్మం ఆగమాల్లోకి ప్రవేశించింది. ఈ విధంగా శైవమతం కొద్ది మార్పులతో దేశమంతటా వ్యాపించి 11వ శతాబ్దం చివరివరకు వృద్ధి చెందిందని చెప్పవచ్చు. 12వ శతాబ్దంలో జైన మతానికి, వైష్ణవ మతానికి ప్రాధాన్యమెక్కువై శైవ మతానికి బలం సన్నగిల్లిందని విమర్శకుల అభిప్రాయం. ఈ పరిస్థితుల్లో 12వ శతాబ్దపు మధ్య ప్రాంతంలో కర్ణాటక దేశాన గొప్ప మతాచార్యుడైన బసవేశ్వరుడుద్భవించి శైవమత శైథిల్యాన్ని అరికట్టాడు. వర్ణాశ్రమ ధర్మ శృంఖలాల నుండి విడిపించాడు. ఆ మతాలలో నూతన చైతన్యాన్ని, శక్తిని ప్రవేశపెట్టి పునరుద్ధరించాడు. ఈ విధంగా పునరుద్ధరణ జరిగిన తర్వాత శైవ మతాన్ని వీరశైవమని, లింగాయుత మతమని పేర్కొన్నట్లు చెపుతారు. బసవేశ్వరుడు ఈ మతంలో విప్లవాత్మక మార్పుల్ని చేయడంవల్ల వీరశైవ మత ప్రారంభకుడుగా నిలిచాడని విమర్శకుల భావన.

వీరశైవ మతంలో బసవేశ్వరుడేర్పరచిన శివానుభవ మంటపం చారిత్రాత్మకమైంది. దీనిని వీరశైవ సిద్ధాంతానికి జన్మస్థానంగా, వృద్ధిస్థానంగా చెప్పవచ్చు. నిజానికీ సంస్థ ఆధ్యాత్మికంగా, సాంఘికంగా ప్రాచుర్యం కలిగినట్టిది. దీనిని వ్యవస్థాపించినవాడు బసవేశ్వరుడు. అధ్యక్షపీఠాన్ని అధిష్ఠించినవాడు అల్లమ ప్రభువుగా విమర్శకులు చెపుతారు. ఈ విధంగా శివానుభవ మంటపం వీరశైవ సిద్ధాంతానికి బీజప్రాయమై నిలిచిందని చెప్పవచ్చు.

వీరశైవ సంప్రదాయంలోను, దాని ప్రచారంలోను శివానుభవ మంటపానికి చారిత్రక ప్రాముఖ్య ముందని చెప్పవచ్చు. శివానుభవ మంటపం నిజానికి ఒక కేంద్ర స్థానం వంటిది. అందుకే దీనివైపు సమస్త శైవులు ఆకర్షితులయ్యారు. వీరిలో జాతి వివక్షతలు, లింగభేదాలు లేవు. సామాజిక భేదాలు, ఆధ్యాత్మిక తరతమ భేదాలు లేవు. వీరు ఏ వృత్తులవారైనా కావచ్చు. రాజకుమారుల నుంచి కృషీవలుల వరకు, సంసారుల నుంచి సన్యాసుల వరకు ఎవరైనా వుండవచ్చు. ఈ మత సంస్థ కారణంగా వీరశైవ సాహిత్యంలో వచన సాహిత్యానికి ప్రాముఖ్యత సంభవించింది. ఈ శివానుభవ మంటపమనే మత సంస్థవల్లనే ముఖ్యమైన మతాచారాలు ప్రారంభమై ఆచరణలోకి వచ్చాయని చెప్పవచ్చు. సంఘంలో స్త్రీలకు ఒక ప్రతి పత్తిని కల్గించడం, వర్ణాశ్రమ ధర్మాల్ని, కులభేదాల్ని నిర్మూలించడం, అస్పృశ్యతా నివారణంతో పాటు కష్టించి పనిచేయడంలో గౌరవభావాన్ని కల్గించడం ఈ మతాచారాల్లోని ప్రధాన విశేషాంశాలుగా చెప్పవచ్చు. ఈ విశేషాంశాలే సంఘంలో ఒక విధమైన జాగృతిని కలిగించి వీరశైవ మత వ్యాప్తికి కారణమై సమాజ విస్తృతికి ఉపయోగపడ్డాయని చెప్పవచ్చు.

సంప్రదాయ బద్ధంగా శైవం నుంచి సంక్రమించిన రెండు విశ్వాసాలు వీరశైవంలో కన్పిస్తాయి. (1) వీరశైవం ఈ నాటిది కాదు. దీనిని ప్రాచీన కాలంలోనే రేవణారాధ్యులు, మరుళారాధ్యులు, ఏకోరామారాధ్యులు, పండితారాధ్యులు, విశ్వారాధ్యులు స్థాపించియున్నారు. వీరు స్థాపించిన మతాన్నే బసవేశ్వరుడు పునరుద్ధరణ చేసి ప్రచారంలోకి తెచ్చాడని వీరశైవ మతాను కూలుర విశ్వాసంగా చెపుతారు. (2) ఈ ఆరాధ్య పంచకం మహోన్నతాలైన స్థావర లింగాల నుంచి ఉద్భవించినట్లు వీరి విశ్వాసం.

వీరశైవ మతంలో శివలింగం అత్యంత ప్రాధాన్యతను సంతరించుకొన్నది. ఈ మతానికి కేంద్రస్థానంగా నిలిచివున్నది. ఈ శైవ మతంలో ఆరాధనా స్థానంగా శివలింగ స్వరూపాన్ని గమనించవచ్చు. దీనినే ఆ మతాను కూలురు శివపరమార్థంగా భావిస్తారు. అయితే వీరశైవంలో మరొక ప్రత్యేకత వుంది.

వీరు శివలింగం బదులు ఇష్టలింగాన్ని శివుని స్థానంలో పూజిస్తారు. అంటే శివభక్తకి, మతాను సరణకు సంకేతంగా శివలింగాన్ని భావిస్తారు. దీనినే శివ స్వరూపంగా చెపుతారు. అంటే ఈ లింగం వల్ల శరీరంలోని ప్రతి అణువు పాప పంకిలం నుంచి వీడి పారిశుద్ధ్యం పొందుతుందని వీరి విశ్వాసం. ఈ విధంగా నిరంతరం ఈశ్వరుని సాన్నిధ్యంలో, సంపర్కంలో జీవిస్తారని చెపుతారు. ఈ మతాన్ని అనుసరించేవారు 60 లక్షల మంది వున్నారని విమర్శకులు చెపుతారు. భారత దేశమంతా వీరు వ్యాపించి వున్నా, కర్నాటకలో వీరి వ్యాప్తి బహుళమని చెప్పవచ్చు.

## శైవ సంప్రదాయం

బసవేశ్వరునికి ముందున్న శైవ సంప్రదాయమే విధంగా వుందో, బసవేశ్వరుడు నెలకొల్పిన శైవధర్మ స్వరూపమేవిధంగా వుందో, పాల్కురికి తన గ్రంథాల్లో ప్రతిపాదించిన సిద్ధాంతానికీ, తర్వాత విస్తరించిన వీరశైవాచార మెటువంటిదో మొదలైన విషయాల్ని నిర్ణయించిన పక్షంలోనే వీరశైవ చరిత్ర యొక్క సమగ్ర స్వరూపం తేట తెల్లమవుతుందని విమర్శకుల అభిప్రాయం.

శైవ మతం అనాదిగా భరత ఖండాన నెలకొని వుంది. ఋగ్వేదంలో శివుని పేరు కన్పించకపోయినా, రుద్రుడు ప్రధాన దైవాలలో ఒకడిగా కీర్తించబడ్డాడు. ఈ కారణంగానే ఉపనిషత్తుల్లో రుద్రోపనిషత్తులు కూడా వున్నాయి. పురాణాల కాలంనాటికి త్రిమూర్తుల పూజ దేశంలో నెలకొని వుంది. పురాణాల్లో కొన్ని శివపరమైనవి కూడా వున్నాయి.

శైవులలో పాశుపతశాఖ చాలా ప్రాచీనమైంది. ఇది వైష్ణవ పాంచరాత్ర సిద్ధాంతాన్ని పోలివుందని చెప్పవచ్చు. ఈ రెండింటికీ సాంఖ్యం, యోగం ఆధారాలు. ఉపనిషత్తుల ప్రమాణం పైనే ఇవి నిలిచి వున్నాయి. పాశుపతంలో లింగపూజకు అధిక ప్రాధాన్యమీయబడింది. లింగపూజ ఎప్పటి నుంచి ఈ దేశంలో ప్రబలిందో చెప్పడం కష్టమైనా, పురాతత్వ శాస్త్రజ్ఞులు ఈ పూజ ఉనికి క్రీ.పూ. చాలాకాలం ముందు నుంచే ఉన్నట్లుగా తెలియజేస్తున్నారు. అయితే దక్షిణ హిందూ దేశంలో పాశుపతశాఖ ఎప్పటినుంచి వ్యాపించిందో చెప్పడానికి ఆధారాలు కన్పించవు. ఉన్న ఆధారాలు కూడా 10వ శతాబ్దం నుంచి వుండడం వల్ల పాశుపతశాఖ తమిళ దేశం నుంచి ఉత్తరాన ఆంధ్రదేశంలోకి తర్వాతి కాలంలో వ్యాపించినట్లుగా చెపుతారు. అధర్వ శిలోపనిషత్తు, అధర్వ శిఖోపనిషత్తు, నీల రుద్రోపనిషత్తు, కైవల్యోపనిషత్తులలో పాశుపత సిద్ధాంతానికి మూలాధారాలు కన్పిస్తున్నాయి. వాయు పురాణంలో

కూడా దీని ప్రస్తావన వుంది. కాపాలిక శాఖ కూడా పాశుపత సంప్రదాయం లోనిదే. కాపాలికులకు మహావ్రతులని కూడా పేరు. ఈ పేరు శాసనాల్లో కన్పిస్తున్నదని విమర్శకుల అభిప్రాయం. అలాగే దక్షిణ హిందూ దేశంలో కాలాముఖుల పేరుమీద కొందరు శైవ సంప్రదాయస్థుల పేర్లు శాసనాలలో కన్పిస్తున్నట్లు విమర్శకులు తెలియజేశారు.

బళ్ళారి జిల్లాలోని కురుగోడు గ్రామంలోని ఒక శాసనంలో వీరి ప్రస్తావన వున్నట్లుగా చెపుతారు. ఈ శైవ సంప్రదాయాలు కాక, ఆగమాల నాధారం చేసుకొని కొన్ని సంప్రదాయాలు దక్షిణ దేశంలో ఎక్కువగా వున్నట్లు చెపుతారు.

శైవాగమాలలో కొన్ని శివపరమైనవి, మరికొన్ని రుద్ర పరమైనవి. కామిక, యోగజ, చింత్య, కరణ, అజిత, దీప్త, సూక్ష్మ, సహస్ర, అంశుమాన్, సుప్రభ (సుప్రభేద) అనే ఆగమాలు శివపరమైనవిగా చెపుతారు. విజయ, నిశ్వాస, స్వాయంభువ, ఆగ్నేయక, భద్ర, రౌరవ, మకుటి, విమల, చంద్రహార, ముఖయుగ్బింబ, ఉద్గీత, లలిత, సిద్ధ, సంతాన, నారసింహ, పరమేశ్వర, కిరణ, పర అనే ఆగమాలు రుద్ర పరమైనవిగా చెపుతారు. మొత్తం వున్న 28 ఆగమాలలో ఒక్కొక్కదానికి అనుబంధాలుగా కొన్ని ఉపాగమాలు కూడా వున్నాయనీ, అన్నీ కలిసి ఆగమ గ్రంథాల సంఖ్య 198 అని విమర్శకులు అభిప్రాయ పడుతున్నారు.

## వీరశైవం - దాని స్వరూప స్వభావాలు

వీరశైవం వైదిక, జైన, బౌద్ధ మతాల్ని ప్రతిఘటించడానికి ఏర్పడిన మతంగా చెపుతారు. శైవమతం భరత ఖండంలో ముఖ్యంగా దక్షిణ ప్రాంతాల్లో ప్రసిద్ధిచెందిన ప్రాచీన మతమని శైవాచార్యుల చరిత్రవల్ల తెలుస్తోంది. ద్రవిడాంధ్ర కర్ణాటక దేశాల్లో శైవమతం వ్యాపించిన విధానాన్ని శైవభక్తుల చరిత్రలు విశదపరుస్తున్నాయి. శంకరాచార్యులు జైన, బౌద్ధమతాల ప్రాచుర్యాన్ని తగ్గించినా, ప్రజా బాహుళ్యంలో వాటి వ్యాప్తికి కాలం చెల్లలేదని చెప్పవచ్చు. ప్రజాహృదయంలో భక్తిమార్గం పెరిగి, నూతన వికాసం ఎలా కలిగిందో, ఈ నూతన వికాసాన్ని వీరశైవం ఏవిధంగా ప్రతిబింబింపజేసిందో బసవేశ్వర చరిత్ర పఠనం వల్ల మనకు తెలుస్తుంది.

బసవేశ్వరుడు బ్రాహ్మణ కులానికి చెందినవాడైనప్పటికీ ఉపనయనాన్ని నిరాకరించి వీరశైవ దీక్షలో లీనమైన పరమ శివభక్తుడు. భవులంటే ఇతనికి గిట్టదు. భవులైన బ్రాహ్మణుల్ని తీవ్రంగా నిందించాడు. వారిని త్రాటిమాలలు,

పచ్చిమాలలుగా అభివర్ణించాడు. సోమన తన అభిప్రాయాన్ని బసవేశ్వరుని రూపంలో తెలియజేశాడని విమర్శకుల భావన.

బ్రాహ్మణులను త్రాటిమాలలు, పచ్చిమాలలుగా నిందించుట

శూలిభక్తుల కెత్తుకేలది ద్రాటి
మాలలకెత్తుట మఱి తప్పుగాదె?
మాలలయి త్రాటిమాలల, పచ్చి
మాలల మాటలు వోలునే వినఁగ?
అసమాక్షుఁ గొలువని యగ్రజుండైన
వసుధ మాలల మాలవాఁడకా కెట్లు
మాలఁడే యాతని మాలఁడన్ త్రాటి
మాలల భువిఁబచ్చి మాలలు గాక!
మార్గమే యాత్రాటి మాలలఁగలయ?
పరహరార్చితునకు మున్నెత్తుకేలు
ధరనెత్తుఁ గూడునే త్రాటిమాలలకు?

(బసవపురాణం)

బ్రాహ్మణులను త్రాటికుక్కలు, మాలకుక్కలని నిందించుట

శ్రీ మహాదేవు నర్చించు చేతులను
నామాల కుక్కల నర్చింపదగునె?

(బసవపురాణం)

కుక్కయేయిది? దీని గుక్కయన్ త్రాటి
కుక్కలు భువిఁ జెడ్డ కుక్కలు గాక!

(పండితారాధ్య చరిత్ర)

బ్రాహ్మణులను గాడిదలనే నిందించుట

............... వేద భరా క్రాంతులనఁగఁ
బడిన బ్రాహ్మణ గార్దభంబుల తోడఁ
..................................................
బ్రతిసేసి యాడినం బాపంబు వచ్చు

(బసవపురాణం)

'వేద భారభరాక్రాంత' యనవ
గవ 'సవై బ్రాహ్మణ గార్దభ' యననె
గడిశ్రుతుల్ మోపరి గాడ్డలై మోవఁ
బడిన బ్రాహ్మణ గార్దభంబుల కంటె

(పండితారాధ్య చరిత్ర)

బ్రాహ్మణులను కర్మచండాలురని, వ్రత భ్రష్టులు, పశుకర్ములు, అధిక పాపాత్ములు, కర్మజీవులు, సోమపానం గావించు పాణులు, దుర్జాతులు అని సోమన నిందించాడు. ఇంకా బ్రాహ్మణులను 'బాపనకూళఅవు'లని, నిందించాడు. శివభక్తుని కాలిచెప్పుతో సరితూగరని కథారూపంలో చెప్పాడు. వారి ఇంటి పేర్లను వికారంగా కల్పించి చెప్పి అవహేళన చేశాడు. ఉదాహరణకు- గ్రుడ్డి గోవిందుడు, కొమ్మనఘట శౌరి, బమ్మనభట్టు, వామనప్పన, త్రేదులవారు, ఆదిత్యకూచి మొదలైన పేర్లు బసవపురాణంలో చెప్పాడు. అయితే సోమన నిందించిన బ్రాహ్మణులెవరో పరిశీలించవలసివుంది.

సోమన వేదాల్ని ప్రమాణాలుగా అంగీకరించాడు. వీరశైవ మత స్థాపనకు వేదాలే ప్రధాన ప్రమాణాలని చెప్పాడు. తాను స్వయంగా చతుర్వేద పారంగుడైనందువల్ల వేదాలనాధారం చేసుకొన్న ఇతిహాసాలు కూడా అతనికి ప్రమాణాలేనని చెప్పవచ్చు. అయితే వీరశైవులు వేదాధ్యయనం చేస్తారు. 'వేదాలు అనాదులు కావు. శివుడే అనాది పురుషుడు. విశ్వంలోని సమస్తం అతని నుంచి కలిగి, అతనిపై ఆధారపడి, అతని అనుగ్రహం వల్లనే కొనసాగుతోంది' అనే సిద్ధాంతాన్ని ఆమోదించిన వారిపై సోమనకు ద్వేషం లేదని విమర్శకుల అభిప్రాయం.

బసవని కాలం వరకు శైవులలో గర్భాష్టమంలోనే ఉపనయన కర్మ జరుగుతుండేదని చెపుతారు. బసవేశ్వరుని తండ్రికి, 'గర్భాష్టమమున, సుతునుపనయంబు, శుభ ముహూర్తమునఁ జేయుదునని తద్ద 'జెడి ముడిపడగ' అని చెప్పి ఉపనయనం వీర మాహేశ్వరాచార దీక్షితునికి తగని పని అని సోమన బసవేశ్వరుని ద్వారా సూచించాడు. 'పరమాత్ముడైన శివుడే గురువు. ఇతరులను గురువులుగా భావించడం నరకహేతువు. గురుకృప జన్మం గలవాడికి కర్మ జన్మం దుష్కర్మమే. గురుపాదాల నర్చించువాడు హవిస్సుతో అగ్నిని అర్చించడం అపరాధం. మలహరాత్మకమైన మంత్రాల్ని నేర్చినవాడికి ఇతర మంత్రాల్ని నేర్వడం తప్పు. శూలిభక్తులకు నమస్కారం చేయవచ్చు కాని తాటి మాలలకు నమస్కరించకూడదు. కర్మపాశాల్ని వదలిన శివ దీక్షితుడు తిరిగి వాటిని వేయకూడదు. రుద్రాక్ష ముద్రల్ని ధరించిన వాడు

క్షుద్రముద్రల్ని ధరించరాదు. ఉభయ కర్మల్ని త్రోసిరాజన్నవారికి ఉపనయన కర్మ నాచరించమని చెప్పడం అతనిని కర్మాబ్ధిలో ముంచడమేనని సోమన తెలియజేశాడు.

ఉపనయన విధిని తిరస్కరించి కుల గోత్రాల నెండగట్టి జాతి వర్ణ విభేదాల్ని పాటించక లోకాన్నంతటినీ వీరభక్తి మయంగా చేయడానికి బసవేశ్వరుడు నడుం బిగించినట్లుగా చెపుతారు. బసవేశ్వరునికి ముందు ఇంతగా వీరశైవానికై నడుం కట్టినవారు లేరని సోమన అభిప్రాయం. ఇందుకు ఉదాహరణగా బసవడు పొత్తిళ్ళలో వుండగా-

'ఇలమఱపడ్డ నిర్మల శివభక్తి దలయెత్తు వడు వునఁ
దాఁదలయెత్తు
కడఁకతో నాది మార్గము తప్పకుండ నడుగిడులీలఁ
దప్పడుగులు వెట్టు'
(బసవపురాణం)

అనే పద్యాన్ని చెప్పవచ్చు.

కాని బసవేశ్వరుడు లేవనెత్తిన వీరశైవ సంప్రదాయం మాత్రం అంతకు మునుపున్నట్లు సోమనాథుని మాటల వల్ల తెలిసినప్పటికీ అది స్థిరమైన అభిప్రాయంగా తోచకపోవచ్చునని విమర్శకుల అభిప్రాయం. అప్పట్లో బ్రాహ్మణ సంస్కారాల్ని శివ సంప్రదాయాన్ననుసరించి జరుపుకొంటూ వుండే సాధారణ శైవ గృహస్థులు, వారిలోనే శైవధర్మ ప్రచారానికి తిరుగుతుండే జంగములు వుండేవారు. అయితే శైవ బ్రాహ్మణులలో జాతివర్ణ విభేదాలుండేవి. వాటికి అతీతులైన వారు జంగములు. శైవులందరినీ జంగములుగా చేసి వారిలో వీరశైవ భక్తిని ప్రబలం చేయడమే బసవేశ్వరుని సంకల్పమని విమర్శకుల భావన. వీరశైవునికి జాతి వర్ణ వివక్షత వుండరాదని, అంత్యజుడైనా భక్తిమార్గాన పయనించి వీరశైవ దీక్షను గ్రహిస్తే అతడిని పూజించాలని అతడినే శివమూర్తిగా భావించాలని సోమన అభిప్రాయం. అయితే 'కులజుడెవడు?' అన్న ప్రశ్నకు జవాబుగా సోమన తన 'పండితారాధ్య చరిత్ర'లో 'కులజులు గులజులే? కులహీనులైనఁ గులజుల శివభక్తి కలిమి' అని సమాధానం చెప్పాడు.

బ్రాహ్మణేతరులలో క్షత్రియ వైశ్యులు బసవని వీరశైవాన్ని అంగీకరించారో, తిరస్కరించారో తెలియనప్పటికీ చతుర్థ, పంచమ వర్ణాల్లో మాత్రం అది శీఘ్రంగా వ్యాపించిందని చెప్పవచ్చు. బ్రాహ్మణులైనా తొలుత ఆవేశంలో కొందరు బసవని జాతి వర్ణ పరిత్యాగ సిద్ధాంతాన్ని ఆమోదించి బసవని

అనుయాయుల్లో కొందరు చేరినప్పటికీ, అనేకులు బసవని అవతార పురుషునిగా భావించి అతని పట్ల భక్తిని చాటుతూ వచ్చారే తప్ప తమ బ్రాహ్మణత్వాన్ని వదలలేదని చెప్పవచ్చు. వేదాలకు శైవపరంగా అర్థం కల్పించినప్పటికీ బ్రాహ్మణ ధర్మాల్ని మాత్రం అవలంబిస్తూనే వచ్చారని చెప్పవచ్చు. బసవనిపై అపరిమితమైన భక్తి ప్రపత్తుల్ని ప్రకటిస్తూ అతనిని దర్శించడానికై దాక్షారామం నుంచి కళ్యాణకటకానికి వృద్ధాప్యంలో కూడా బయలుదేరిన మల్లికార్జున పండితారాధ్యుడే బ్రాహ్మణ ధర్మాన్ని వీడలేదన్నప్పుడు ఇక సాధారణ బ్రాహ్మణుల విషయం పరిశీలించడం అవసరం లేదని సోమన అభిప్రాయం.

బసవని కాలంలో అతని మతాన్ని వ్యాపింపచేయ సంకల్పించిన మరికొందరు భక్తులు కూడా, ఆయుధాల్ని ధరించి విచ్చలవిడిగా సంచరిస్తుండే వారని చెపుతారు. వీరశైవులు పరమత నిర్మూలనకై దౌర్జన్యాలకు దిగినట్లు కూడా కొన్ని కథల వల్ల తెలుస్తుంది. జైనుల ప్రతిమల్ని నిర్మూలనం చేసి వాటి స్థానాల్లో శివుని ప్రతిమల్ని ప్రతిష్ఠించిన వృత్తాంతం పండితారాధ్య చరిత్రలో వర్ణింపబడింది. పండితారాధ్యుని నిందించిన బౌద్ధుని అతని అనుయాయులే చంపేశారు. బసవని అనుసరించిన వీరవ్రతులలో దొంగతనంలో ఆరితేరిన వారుకూడా వున్నారని చెప్పడానికి కన్నద బ్రహ్మయ్య కథే నిదర్శనం. అయితే వీరశైవ మత వ్యాప్తికోసం చేసింది హింస కాదనే సిద్ధాంతం అప్పట్లో పూర్తిగా ప్రబలడం వల్ల శివప్రీతికోసం చేసిన ఏపనైనా సరైనదేనని భావించడం వల్ల, శివభక్తుల పట్ల విశేష ఆసక్తి కనపరచాలనేది సోమన అభిప్రాయంగా చెప్పవచ్చు. ఇందుకు ఉదాహరణగా క్రింది పద్యాన్ని పేర్కొనవచ్చు.

"సన్నుతలింగ ప్రసాదివి నిన్నుఁ ఋనెంబు బాపంబుఁ బొందవు

,...............

ఇందు మదీయ మహీయః ప్రసాది వొందునే యెట్లును

బుణ్యాపాపములు"

(పండితారాధ్య చరిత్ర- 25, 26 పేజీలు)

వీరశైవంలో జంగమునుత్తముడిగా చెపుతారు. అతనికి లింగమునకు భేదం లేదని లింగశరీరాన్నే జంగమ శరీరంగా లింగప్రాణాన్నే జంగమ ప్రాణంగా జంగమమూర్తినే లింగమూర్తిగా అర్చించడం ఉత్తమ ధర్మమని చెపుతారు. అతడు గురుమూర్తి అని అర్చించడం మధ్యమ ధర్మమని శివశాసనాధారుడని అర్చించడం తుదికక్ష్యయని చెపుతారు. జంగమ, లింగమ ధర్మాల గురించి కొందరు విమర్శకుల అభిప్రాయాలు క్రింది విధంగా వున్నాయి.

"లింగం అచరం, జంగమం చరం. లింగం కాయం, జంగమం ప్రాణం. లింగం ప్రాణలింగావతారం, జంగమం ఆచార్య అవతారం. లింగం మంత్రక్రియాధారం, జంగమం తంత్రక్రియాధారం. లింగం యోగమజ్జనం, జంగమం భోగమజ్జనం. ఒక మూర్తిది పూజాస్థానం. రెండోమూర్తిది ఆరాధనాస్థానం. ఒకరికి త్రికాలార్చనలు, రెండోవారికి సర్వకాలార్చనలు. ఒకరికి షోడశోపచారాలు, రెండోవారికి రాజ వదుపాచారాలు. లింగానికి మనోగుణ నివేదనం మాత్రం, జంగమానికి తను మనోధన నివేదనం. "శివభక్తి పరులఁ బూజింపకే ప్రొద్దు, శివపూజ లొకకోటి నేసిన వృధయ, శివభక్తి పరులఁబూజించిన జాలు, శివపూజలొకకోటి సేసినవాఁడు, జంగమ భక్తి హీనుని పూజ, వీనుఁగుఁగై సేయఁ బూనినయట్లు" అని సోమన తెలియజేశాడు. బసవ భక్తుని బాల్యవర్ణనం మనోహరంగా వుంది. అతనికి శివలింగ సౌఖ్యానుభవం-చన్బాలు, గురుపద ధ్యానం-వెన్న, వేదాంత సూక్తులు-ఆదిమార్గం, తప్పటడుగులు, లింగపూజలే-బాల్యక్రీడలు, శివభక్తి స్వరూపమున్న శివునికి, శివభక్తునికి మధ్యగల సంబంధాన్ని సోమన చక్కగా నిరూపించాడని చెప్పవచ్చు. శివభక్తునికి వీరవ్రతం, వీర మాహేశ్వర వ్రతం అవసరం. వీర మాహేశ్వర పూజయే పరమ శివపూజగా చెపుతారు. ఈ పూజ ఆ కాలంలో విస్తరించి వుండేదని చెపుతారు. గురువు సంసారికి వీరభక్తి దీక్షనిచ్చేవాడు. ఈ దీక్ష పండితారాధ్యునికి మునుపే వున్నట్లుగా చెపుతారు. ఈ సంప్రదాయం ప్రకారమే మల్లికార్జున పండితుడు కూడా ఆ దీక్ష పొందాడని, ఈ విషయం పండితారాధ్య చరిత్రలో నిరూపించబడినట్లుగా కూడా చెపుతారు. నిజమైన శివపూజ ఎలా వుంటుందో ఇందులో వర్ణింపబడిందని చెప్పవచ్చు. శివపూజ రెండు విధాలు. బాహ్య పూజ, అభ్యంతర పూజ. బాహ్య పూజ మంచిదే కాని, అభ్యంతర పూజ ఉత్తమోత్తమం. తమ వీరభక్తిని రుజువు చేయడానికి వీరశైవులు కళ్ళుపీకి, తిరిగి కళ్ళను పొందేవారు. నాలుకల్ని త్రుంచుకొని తిరిగి నాలుకల్ని పొందేవారు. తలలు తెగనరుక్కుని తిరిగి పొందేవారు. శ్రీశైలంలోని వీరమండపం ఇంతటి తీవ్రభక్తికి నిదర్శనంగా నిలిచివున్నది. తమ భక్తి నిరూపణకై పాముల్ని చేతితో పట్టుకొనేవారు. దీపానికి చమురు లేకుంటే తమ జుట్టుకు నిప్పంటించి దీపం వెలిగించేవారు. తమ దేహాల్ని కాల్చుకుని ఆ పొగతో ధూపం వేసి తమ భక్తిని ప్రకటించేవారు. ఇందుకు నిదర్శనంగా, "పురుషుడు శివభక్తి విరహితుడేనని బురుషుని మాఱుట దరుణికిఁ బథము" అని బసవపురాణంలోని వాక్యాల్ని చెప్పవచ్చు. ఇలాంటి వీరభక్తులు ఆ కాలంలో అసంఖ్యాకులుగా వుండేవారు. బసవనికాలంలో ఒక కళ్యాణకటక నగరంలోనే, లక్షా ఎనభైవేల మంది భక్తలింగాలు, తొమ్మిదివేల మంది

వ్రతస్థులు, పదివేలమంది చలవాది శీలవంతులు, ఏడువేల ఏడువందల మంది వీరగణాలు, పంద్రెండు వేల మంది మిండజంగములు, మొత్తం రెండు లక్షల పద్దెనిమిదివేల ఏడువందల మంది ఈ వీరవ్రతాన్ని అవలంబించే వారని చెపుతారు.

మల్లికార్జున పండితారాధ్యుని నోట సోమనాథుడు ఖండించిన మతాల్లో బౌద్ధ, జైనమతాలు కూడా వున్నట్లుగా చెపుతారు. వీటి సిద్ధాంతాలు, సంప్రదాయాలు వేరు. ఆంధ్ర దేశంలోనే కాక దక్షిణ దేశమంతటా దాదాపుగా క్రీ.శ. 4, 5 శతాబ్దాల వరకు బౌద్ధమతం అధిక ప్రచారంలో వుండేది. క్రమంగా బౌద్ధమతం క్షీణదశకు రాగా, తమిళదేశంలో శైవం, కర్ణాటక దేశంలో జైనం వేళ్ళూనడం ఆరంభమైంది. ఆంధ్ర దేశంలో 10వ శతాబ్ది కాలానికి జైనమతం క్షీణించిందని, కర్ణాటకంలో మాత్రం అది మరి రెండు శతాబ్దాల వరకు నిలిచిందని చెప్పవచ్చు. వీరశైవం బయలుదేరిన తర్వాత అవి పూర్తిగా క్షీణించాయని చెప్పవచ్చు. వీరశైవులు బౌద్ధారామాల్ని, జైన వసతుల్ని బుద్ధి పూర్వకంగా, బలవంతంగా, దౌర్జన్యంగా, క్రూరంగా పాడుచేశారు. వాటి స్థానాల్లో లింగ ప్రతిష్ఠలు జరిపించారు. పండితారాధ్య చరిత్రలో జైనుల వసతుల్ని శైవులు నాశనం చేసిన విధం వర్ణింపబడింది. దేవర దాసయ్యా పాట చెరువులో ఏణూరు వసతుల్ని తొలగించినట్లు చెపుతారు. అలాగే కోవూరులోని వసతులన్నీ బ్రహ్మయ్య నాశనం చేసినట్లు చెపుతారు. అబ్బలూరులోని వసతుల్ని ఏకాంత రామయ్యా పడగొట్టించాడని, కటకంలో బండారు బసవన్న జైనుల వసతుల్ని భస్మం చేశాడని, వర విళిగెలో వైజకవ్వ ప్రతిమను పడగొట్టి, ఆ స్థానంలో వైజనాథేశ్వరుని ప్రతిష్ఠించినట్లు, మారుళిగెలో వున్న హిరియవసదిలోని జైనుల్ని హిరియనాగయ్యా మొదలైన 13 మంది వీరావతారులు ధరించి మహేశ్వర ప్రతిష్ఠ చేసినట్లు చెపుతారు. పులిగెఱలోని సుంహోన్న వసతిని పడగొట్టి ఆదెయ్యా అనేవాడు సౌరాష్ట్రానికి వెళ్ళి సోమలింగాన్ని ఆహ్వానించి ప్రతిష్ఠించినట్లు, పిళ్ళనైనారు జైనులను వాదంలో ఓడించి, కూనపాండ్యుని గూని పోగొట్టి జినమంత్ర పత్రం, శివమంత్ర పత్రం రెండింటినీ నిప్పుల్లో వేసి పరీక్షించి చూస్తే శివమంత్ర పత్రం మాత్రం కాలకపోవడం, వాటినే కావేరీ వరదలో విడిస్తే జైన పత్రం కొట్టుకొనిపోయి, శైవపత్రం ఏటికెదురెక్కడం గురించి చెపుతారు. నిడుమాండనే రాజు రాజ్యంలో వున్న జైనులందర్నీ పిలిపించి వారిని వాదంలో ఓడించి, వారి తలలు గీయించడం, నాగీశ నాయనారిని జైనులు అనేక విధాలుగా బాధింపగా అతడు పంచాక్షరీ మంత్రాన్ని జపించి వారి నందర్నీ వధించడం, ఇదిత్తాండి అనే పుట్టుగ్రుడ్డియైన శివభక్తుని జైనులు బాధింపగా అతడు

శివుని ప్రార్థించి రెండు కన్నుల్ని పొందడమే కాక, జైనుల కళ్ళు పోయేటట్లు చేయడం, నమినంది అనే శైవభక్తుడు ప్రతిరోజూ శివుని ముందు వేయినేతి దీపాల్ని పెట్టే వ్రతాన్ని పాటించేవాడై వుండగా, జైనులతనికి నేయిని అందుబాటులో లేకుండా చేసినపుడు లింగోదకాలతోనే దీపాల్ని వెలిగించి, జైనుల పశువులు మరణించునట్లుగా శపించినట్లు చెపుతారు. ఈ విధముగా తీవ్రమైన ఆపదలకు గురైన అనేకులైన బౌద్ధులు, జైనులు మృతిచెందారు. కొందరు శైవమతంలో ప్రవేశించారు. నానాటికీ బౌద్ధ, జైన మతాలు భరత వర్షంలో నామ మాత్రంగానే మిగిలి పోయాయి.

సోమన కాలంనాటికి బౌద్ధమతం కేవలం నశించిందనే చెప్పవచ్చు. బౌద్ధ కుటుంబాలు మాత్రం కొన్ని అక్కడక్కడా కన్పించేవి. బౌద్ధాలయాలకు ఇతర మతస్థులు దానాలు చేస్తూ వుండేవారని కొన్ని శాసనాలవల్ల విదిత మవుతుందని చెప్పవచ్చు. బౌద్ధులు కానివారు కూడా బుద్ధుని పేరు పెట్టుకొని వుండేవారు. బౌద్ధారామాలకు దగ్గరగా వుండే గ్రామాల్లో బౌద్ధేతరులిప్పటికీ వున్నారని, వారు శివకేశవాలయాలకు చేసిన దానాలవల్ల తెలుస్తోందని విమర్శకుల అభిప్రాయం.

## వీరశైవ సిద్ధాంతం

వీరశైవ సిద్ధాంతాన్నే భేదా భేద సిద్ధాంతమని, శివ విశిష్టా ద్వైతమని అంటారు. అయితే శివ విశిష్టా ద్వైతానికి, వీరశైవ సిద్ధాంతానికి కొంత భేదమున్నట్లు చెప్పవచ్చు. శంకరాచార్యులది అద్వైత సిద్ధాంతం, రామానుజునిది వైష్ణవ విశిష్టా ద్వైతం, శ్రీకంఠునిది శివాద్వైతం, ఆనంద తీర్థునిది ద్వైతం - ఇవన్నీ వీరశైవ భేదా భేద సిద్ధాంతాన్ని అనుసరిస్తాయి. ఇవి రామానుజుని ద్వైతభావాన్ని అంగీకరిస్తూనే నిత్య సామీప్యం, సారూప్యం, భోగమాత్రమైన సమత్వ రూపమున్న శివ జీవాద్వైతాన్ని ప్రతిపాదిస్తాయి. దీని ప్రకారం శివునికి, జీవునికి అభేదత్వం చాలా తక్కువ. ఇద్దరూ నిత్యులే. ఇద్దరికీ భేదమే ఎక్కువ. శివుడు పూర్ణుడు, జీవుడు పూర్ణుడు. ఈశ్వరుడు ప్రభువు, శక్తుడైతే, జీవుడు భక్తుడు, అశక్తుడు. ఈశ్వరుడు సర్వస్వతంత్రుడు, జీవుడు సర్వాధీన తంత్రుడు. జీవునికి సారూప్యముక్తి మాత్రం వుంది. దీనినే శివసామరస్యంగా భావిస్తారు. జీవునికి సారూప్యమే కాని సాయుజ్యం లేదు. 'నిరతిశయ స్వరూపానంద సాక్షి స్వప్రకాశివరూప పరాహం భావపత్తి'ని ముక్తి అని భావిస్తారు. ద్వైత సిద్ధాంతం ప్రకారం అయిదు విధాలైన భేదాలున్నట్లుగా చెపుతారు. జీవునికి, జీవునికి; జీవునికి, జడానికి; ఈశ్వరునికి, జడానికి; జీవునికి, ఈశ్వరునికి; జడానికి, జడానికి మధ్యగల భేదాలే ఈ అయిదు

విధాలైన భేదాలు. భేదాభేద సిద్ధాంతం ప్రకారం జీవేశ్వరులకు సంసార దశలో భిన్నత్వముంది. మోక్షదశలో అభిన్నత్వముంది. అద్వైతంలోని జగన్మిథ్యాత్మ, మాయ సిద్ధాంతాల్ని భేదాభేద సిద్ధాంత వాదులంగీకరించరు. అట్లే, చేతనా చేతన స్వరూపమైన జగత్తు ఈశ్వర శరీరమనే విశిష్టా ద్వైత వాదాన్ని కూడా వారంగీకరించరు. మోక్ష దశకు పూర్వం, పరంలలో కూడా జీవేశ్వరులకు భిన్నత్వముందనే ద్వైత సిద్ధాంతవాదాల్ని కూడా వారు ఒప్పుకోరు. శివుడినే పరబ్రహ్మవాచ్యుడిగా భావించే శివాద్వైత వాదుల సిద్ధాంతానికి, ద్వైతాద్వైత సిద్ధాంతానికి ఈ విషయంలో భేదం కన్పించదు. కానీ చేతనా చేతన ప్రపంచం ఈశ్వరునికి భిన్నమైనది. ఈశ్వరునిపై ఆధారపడి వుంది. శివునికే కర్తృత్వశక్తి వుంది. భేదాభేద సిద్ధాంతాన్ని విశ్వసించి షట్స్థలమనే అభ్యాసయోగం నిర్వహించడం వల్లనే శివత్వం ప్రాప్తిస్తుందని చెపుతారు. దీనికి ఉపాసన, ధ్యానం, ధారణం, జ్ఞానంలను సాధనాలుగా చెపుతారు. జ్ఞానం వల్లనే శివత్వం ప్రాప్తిస్తుంది. షట్ స్థల జ్ఞానం లేగ యోగం కుదరదు. వీరశైవ సిద్ధాంతంలో షట్స్థల జ్ఞానం చాలా ప్రాధాన్యత వహించిందని చెపుతారు. దీనిని గురించి వివరణాత్మకంగా పరిశీలించవలసిన అవసరం ఎంతైనా వుందని భావించవచ్చు.

## షట్ స్థలాలు

శైవాగమాలు - శైవం, పాశుపతం, సోమం, లాకులంలని నాలుగు భేదాలుగా వున్నాయి. వీటిలో శైవం - వామం, దక్షిణం, మిశ్రమం, సిద్ధాంతం అని నాలుగు విధాలు. వామం శక్తి ప్రధానం, దక్షిణం భైరవాత్మకం, మిశ్రమం సప్తమాతృ పదం, సిద్ధాంతం వేద సమ్మతం. ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించే కామితా గమంలో, ఉత్తర భాగంలో వీరశైవ సిద్ధాంత ప్రస్తావన వుంది. 'వి' అంటే విద్యగా వీరశైవులు భావిస్తారు. విద్యలో రమించేవాడు వీరుడు కాబట్టి వీరిని వీరశైవులంటారు. అంటే శివరూపమైన విద్యలో విశేషంగా రమించేవాడు. కాబట్టి వీరశైవుడనిపించుకొంటాడని చెప్పవచ్చు. విద్యలో రమిస్తూ, హేయమైన మాయను త్యజిస్తాడు కాబట్టి వీరమాహేశ్వరుడవుతాడు. శైవులు జ్ఞాన యజ్ఞ రతులు, మాహేశ్వరులు కర్మ యజ్ఞ రతులు. శైవులు అభ్యంతరార్చన చేస్తే, మాహేశ్వరులు బాహ్య పూజ గావిస్తారు. శైవ మాహేశ్వరుల కంతగా భేదమున్నట్లు కన్పించదు.

వీరశైవ సిద్ధాంతంలో షట్స్థల జ్ఞానం ముఖ్యమైంది. భక్తస్థలం, మాహేశ్వర స్థలం, ప్రసాద స్థలం, ప్రాణలింగ స్థలం, శరణస్థలం, ఐక్య స్థలం అనేవి

ఆరు షట్ స్థలాలు. ఈ స్థల ధర్మ విభేదం చేత, వీరశైవులు భక్తాది సంజ్ఞలు కలిగి ఆరు విధాలుగా వుంటారని విమర్శకుల అభిప్రాయం.

ఎవరిలో అయితే శైవభక్తి సముత్పన్నమైందో అతనిని శివభక్తునిగా భావిస్తారు. అతడు తాను అనుష్ఠించాల్సిన ధర్మాల్ని కలిగి వుండడమే భక్తస్థలం. ఈ భక్త స్థలం - పిండస్థలం, పిండ విజ్ఞాన స్థలం, సంసార హేయతా స్థలం, గురుకారుణ్య స్థలం, లింగధారణ స్థలం, భూతి ధారణస్థలం, రుద్రాక్ష ధారణ స్థలం, పంచాక్షర జపస్థలం, భక్తి క్రియాస్థలం, ఉభయ పూజా స్థలం, జంగమ పూజాస్థలం, ప్రసాద స్వీకృతి స్థలం, సోపాది కధానస్థలం, నిరుపాది కదాన స్థలం, సహజ దానస్థలం అని 15 అవాంతర భేదాల్ని కలిగి వుంది.

కేవలం సహజ దాన నిష్ఠాపరుడై, బ్రహ్మాది స్థాన విముఖుడై వుండేవాడు మాహేశ్వరుడనిపించుకొంటాడు. భక్తి వైరాగ్యాలెక్కువై స్థిర వివేకం కలవాడే మహేశ్వరుడు. అట్టి మహేశ్వర ధర్మాల్ని పాటించడమే మాహేశ్వర స్థలం. ఈ స్థలం - మాహేశ్వర ప్రశంసా స్థలం, లింగ నిష్ఠాస్థలం, పూర్వా శ్రమ నిరసన స్థలం, సర్వాద్వైత నిరసన స్థలం, ఆహ్వాన వర్జన స్థలం, అష్టమూర్తి నిరసన స్థలం, సర్వ గత్వ నిరసన స్థలం, భక్తి శివత్వ స్థలమనే తొమ్మిది అవాంతర భేదాల్ని కలిగివుంది. లింగనిష్ఠమనే భావంతో పాపబంధాల్ని ధ్వంసంచేసి మనో ప్రసాదాన్ని కలిగివుండడమే ప్రసాద స్థలం. ఇది ప్రసాది స్థలం, గురు మాహాత్మ్య స్థలం, లింగ మాహాత్మ్య స్థలం, జంగమ గౌరవస్థలం, భక్త మాహాత్మ్య స్థలం, శరణ ప్రశంసాస్థలం, శివప్రసాద మహిమ స్థలమనే ఏడు అవాంతర భేదాల్ని కలిగివుంది.

లింగం చిదాత్మకమైన బ్రహ్మం. దాని శక్తి ప్రాణరూపిణి. అలాంటి రూపం వుండే లింగాన్ని తెలుసుకొన్నవాడు ప్రాణలింగి. ప్రాణలింగ ధర్మాన్ని అనుష్ఠించడమే ప్రాణలింగ స్థలం. దీనిలో ప్రాణలింగ స్థలం, ప్రాణలింగార్చన స్థలం, శివయోగ సమాధి, లింగనిజస్థలం, అంగలింగ స్థలం, అని అయిదు అవస్థలున్నాయి.

అంగలింగ జ్ఞానం కలిగి తాను సతినని భావించి పతి అయిన శివుని ధ్యానించి ఆ ధ్యాన సౌఖ్యంలో ప్రవేశించినవాడు శరణుడు. శరణ భావాన్ని కలిగివుండడమే శరణ స్థలం. దీనిలో శరణ స్థలం, తామస వర్జిత స్థలం, నిర్దేశ స్థలం, శీల సంపాదనం అని నాలుగు అవాంతర భేదాలున్నాయి.

ప్రాణలింగమనే యోగం వల్ల సుఖాతిశయాన్ని అనుభవిస్తూ శరణుడు శివునితో ఐక్యాన్ని కల్పించుకోవడం ఐక్యస్థలం. ఇది ఐక్యస్థలం, ఆచారస్థలం, ఏకభాజన స్థలం అని నాలుగు అవాంతర భేదాల్ని కలిగివుంది.

ఇప్పటివరకు తెలియజేసినవన్నీ షడంగ స్థల వివరణాలు. లింగస్థలాల వివరణ ఈ విధంగా వుంది. ఈ లింగస్థలాలు పైన తెలిపిన షడంగ స్థలాలననుసరించి 57 భేదాలు కలిగివున్నాయి.

భక్త స్థలానికి సంబంధించి లింగస్థలాలు - దీక్షా గురుస్థలం, శిక్షా గురుస్థలం, జ్ఞాన గురుస్థలం, క్రియాలింగ స్థలం, భావలింగ స్థలం, స్వస్థలం, చరస్థలం, పరస్థలం.

మహేశ్వర స్థలానికి సంబంధించి లింగస్థలాలు, క్రియాగమ స్థలాలు, భావాగమ స్థలం, జ్ఞానాగమ స్థలం, సకాయస్థలం, అకాయస్థలం, పరకాయస్థలం, ధర్మాచార స్థలం, భావాచార స్థలం, జ్ఞానాచార స్థలం.

ప్రసాద స్థలానికి సంబంధించి లింగస్థలాలు, కాయానుగ్రహ స్థలాలు, ఇంద్రియానుగ్రహ స్థలం, ప్రాణానుగ్రహ స్థలం, కాయార్పణ స్థలం, కరణార్పిత స్థలం, భావార్పిత స్థలం, శిష్యస్థలం, శుశ్రూషా స్థలం, సేవ్యస్థలం.

ప్రాణలింగ స్థలానికి సంబంధించి లింగస్థలాలు, ఆత్మస్థలం, అంతరాత్మస్థలం, పరమాత్మ స్థలం, నిర్దేహాగమ స్థలం, నిర్భావాగమ స్థలం, నష్టాగమ స్థలం, ఆదిప్రసాది స్థలం, అంత ప్రసాది స్థలం, సేవ్య ప్రసాది స్థలం.

శరణ స్థలానికి సంబంధించిన లింగ స్థలాలు, దీక్షోపాదోదక స్థలం, శిక్షాపాదోదక స్థలం, జ్ఞానపాదోదక స్థలం, క్రియానిష్పత్తి స్థలం, భావనిష్పత్తి స్థలం, జ్ఞాన నిష్పత్తి స్థలం, పిండాకాశ స్థలం, బింబాకాశ స్థలం, మహాకాశ స్థలం, క్రియా ప్రకాశ స్థలం, భావ ప్రకాశ స్థలం, జ్ఞాన ప్రకాశ స్థలం.

ఐక్య స్థలానికి సంబంధించిన లింగస్థలాలు, స్వీకృత ప్రసాధస్థలం, శిష్టోదన స్థలం, చరలయ స్థలం, అచరలయ స్థలం, భాండ స్థలం, భాజన స్థలం, అంగలేపస్థలం, స్వపరాజ్ఞ స్థలం. భావాభావలయస్థలం.

మొత్తం లింగస్థలాలు 57 అని విమర్శకుల భావన. -

## శైవశాఖలు

ఈ శైవశాఖల స్వరూపాన్ని, మత స్వరూపాన్ని గుర్తించడానికి ఈ యుగంలో ప్రస్తావించిన ముగ్గురు శివకవుల గ్రంథాల్ని బట్టి గుర్తించవచ్చు కాని మత గ్రంథాలాధారంగా వీలుకాదని విమర్శకుల అభిప్రాయం. ఈ శాఖలన్నిటిలోను సమానధర్మం శివపారమ్యం (శివుడే పరమని భావించడం). కాని ఆచార వ్యవహారాల్లో, ధర్మాచరణంలో వారికి ఏకవాక్యత లేదు. ఈ శైవశాఖల్లో కాలాముఖులు, పాశుపతులు, శాక్తేయుల శాఖలు ప్రధానాలు.

## కాలాముఖులు

వీరి ఆచార వ్యవహారాలు క్రింది విధంగా వుంటాయి. మఠాధిపతి ఆజన్మ బ్రహ్మచారిగా వుండాలి. నన్నెచోడుడు మఠాధిపతి అయిన కృతిపతి యొక్క బ్రహ్మచర్య వ్రతాన్ని అధికంగా తెలియజేశాడు. కాలాముఖులకు శివారాధనతో పాటు శక్త్యారాధన కూడా వుందని చెబుతారు. కుమార సంభవ గ్రంథంలో శివశక్తుల మధ్య అభేదం ప్రతిపాదించబడింది.[1]

హిమవంతుడు, మేనకలు బిడ్డల కొరకై శక్తిని ఆరాధించారు.[2]

కాలాముఖులలో హింసాపరమైన ధర్మం లేదు. వీరు వర్ణ వ్యవస్థను అంగీకరిస్తారు. ఇతర దైవతాలను శివాంగభవులుగా భావిస్తారు, తప్ప ధూషణం చేయరు.

## పాశుపతులు

శివతత్త్వసార గ్రంథంనుంచి తెలిసినంతవరకు ఇది పండితారాధ్యుని మతం.

పిపీలకం మొదలుకొని సర్వజీవులు పశువులని అంటారు. సంసార బంధం వీరిని కట్టి పడవేసిన పాశం. ఈ పశురాశికి పతి, ఈ పాశాన్ని సడలింపగల దక్షుడు శివుడు. అందుకే శివుడు పశుపతి. శివుడిని పరదైవతంగా సేవించువారు పశుపతులు.

వైదికాలైన భక్తి జ్ఞాన కర్మాలనే మార్గత్రయంలో వీరికి భక్తి పట్ల మక్కువ. కాని కర్మాన్ని విస్మరించరు, జ్ఞానాన్ని తిరస్కరించరు. కాని భక్తికి అధిక ప్రాధాన్యతనిస్తారు. జ్ఞాన సముపార్జన లేకుండానే కేవలం భక్తి పారవశ్యంతో సిద్ధి పొందిన మహనీయుల్ని శివతత్త్వసారంలో పెక్కుచోట్లు ప్రశంసించారు. వీరిది వైదిక శైవమని చెప్పవచ్చు. కానీ వైదికులైన అద్వైతులను

వీరు తీక్షణంగా విమర్శిస్తారు. అద్వైతులవలె వీరికి కూడా సన్యాసాశ్రమం లేదు. అద్వైతులు శివపూజాపరులే కాని, శివకేశవ భేదాన్ని పాటించరు.

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చహృదయం శివః"

అద్వైతులకు ఇది పరమలక్ష్యం. వైదిక శైవులకు కేశవ నామస్మరణే రుచించదు.

కాలాముఖులవలె వీరుకూడా వర్ణవ్యవస్థను అంగీకరించారు. శక్త్యారాధనం వీరి కర్మాచారణంలో కానరాదు.

## వీరశైవమతలక్ష్యం

'శివస్య ఇదమ్' అనే వ్యుత్పత్తిచే శైవశబ్దం ఏర్పడినది. శైవమతం మంగళమూర్తియైన శివుని గురించి తెలుపుతున్నది. 'శివ' శబ్దం 'చవ్వ' అనే ద్రావిడశబ్ద భవమని కొందరి భావన. చవ్వ అంటే తెలుపు.

వీరశైవానికి శివభక్తి, లింగధారణం, విభూతి రుద్రాక్ష ధారణం, పంచాక్షరీమంత్రం, లింగపసాయత శస్త్రధారణం, ప్రధాన లక్షణాలు. వీరశైవంలో శివభక్తి వీరస్వరూపాన్ని దాల్చింది. వీరశైవ ధర్మాలు సాంఘిక పరివర్తనాన్ని, మత పరివర్తనాన్ని తెలుపుతున్నాయి. వీరశైవ సంఘానికి బసవేశ్వరుడు దండనాయకుడు, మహేశ్వరులు సేనాపతులు, భక్తులు సైనికులు. భక్తసైన్యం శత్రుమిత్రాభిమానాన్ని, ప్రాణధన మానాభిమానాన్ని, లేక శైవ ధర్మ నిర్వహణాన్ని చేయబూనింది. జంగములైన శివభక్తులందరినీ శివస్వరూపులుగా భావించేవారు. వీరశైవులు బ్రాహ్మణులు - మాలలు, పండితులు - పామరులు, ప్రభువులు - ప్రజలు, స్త్రీలు - పురుషులు, దొంగలు - దొరలు మొదలైన భేదావరణం లేని శివభక్తులు. శివభక్తులు వారి సర్వస్వాన్ని జంగములకర్పించి శివానందాన్ని పొందేవారు. వీరశైవం జంగమభక్తిని, భవి నిరసనాన్ని బోధించింది. లింగధారణం లేని వారంతా భవులు. భవులు నిరసింపబడిన విధాన్ని బసవపురాణం, వీరశైవాగమాలు విశదం చేస్తున్నాయి. వీరశైవం బ్రాహ్మణ్యాన్ని, యజ్ఞయాగాదుల్ని, కర్మలను నిరసించి నిందిస్తున్నాయి. పాల్కురికి సోమన తదితర బ్రాహ్మణులు కొందరు కులగోత్రాల్ని విసర్జించి వీరశైవ దీక్షను స్వీకరించి కృతార్థులయ్యారని చెప్పవచ్చు.

మల్లికార్జున పండితారాధ్యుడు మొదలైనవారు వీరశైవ దీక్షను పూని కులంతో పొత్తును విడవలేక వీరశైవ సంఘంలో చేరలేకపోయారు. 'భక్తిమీద

వలపు బ్రాహ్మ్యంబుతో బొత్తు బాయలేను నేను బసవలింగ' అంటూ మల్లికార్జున పండితుడు ఆక్రోశం చెందుట లింగధారణ స్వీకారాన్ని, బసవమత స్వీకారాభిలాషను సూచిస్తున్నది. లింగధారణ స్వీకారం కాక కేవలం శైవమత స్వీకారాన్నే తెలిసిన యెడల, బసవలింగ నామ సంస్మరణానికి భక్తివలపుకు అర్థం కన్పించదు. వీరశైవ ప్రతిభ తగ్గిన తర్వాత బ్రాహ్మణులు, వైశ్యులు లింగధారణ దీక్షపొందడం అసంభవమని చెప్పవచ్చు. లింగధారి బ్రాహ్మణులు వీరశైవ నామాన్ని ఎప్పుడు స్వీకరించినా, భిన్నమతాలవారు, భిన్న వర్ణాలవారు వీరశైవుల వర్ణాశ్రమ ధర్మాల్ని పారద్రోలడానికి చేసిన ప్రయత్నాల్ని వీరశైవ మత చరిత్రం విశదం చేస్తున్నది. వీరశైవం తలపెట్టిన కులావరణ నిర్మూలనం దుస్తరమైంది. లింగాయుతం, జంగములు, సాలెలు, జాండ్రలు ప్రత్యేక కులం వారై మరికొన్ని కులాలేర్పడ్డాయి. వైదిక ధర్మ ప్రాబల్యం తిరిగి తలెత్తింది. భక్తి ప్రధానమైన వీరశైవం నిర్జీవమైన ఆచార సంప్రదాయబద్ధమై సాంఘిక ప్రయోజనాలకు, మానవ కళ్యాణానికి నిరుపయోగమైందని కొందరు విమర్శకుల అభిప్రాయం.

వీరశైవులకు త్రివిధ దీక్షలచే దగ్ధం గావించి భౌతిక శరీరాన్ని లింగ శరీరంగా చేసి గురువు ప్రసాదించిన ఇష్టలింగాన్ని స్థూల శరీరంలో గండంలోనో, శిరంలోనో, భుజంలో గాని, వక్షంలో గాని ధరిస్తూ సూక్ష్మకారణ శరీరాల నిష్ఠితమైన ప్రాణభావ లింగాలతో దానికి అవినాభావ ఐక్యాను సంధానం అలవరిస్తూ అనన్య చిత్తంతో అర్చించడం, ప్రణవ సహిత శైవ పంచాక్షరీ మంత్రం తప్ప మరి ఏ ఇతర మంత్రాల్ని మననం చేయకుండడం, ఇష్టలింగార్చన కన్నా భిన్నాలైన కర్మాలన్నిటిని పరిహరించడం, ఇష్టలింగం కోసం ప్రాణత్యాగానికి పాల్పడడం, లింగైక్యం చెందినపుడు సాధకుని ఇష్టలింగాన్ని అతనితోనే వుంచి ఖననం చేయడం, ఇటువంటివి వీరశైవ సాధకుడు పాటించాల్సిన నియమాలుగా కనిపిస్తున్నవి.

# భక్తి-నిర్వచనం-కవులు నిర్వచించిన భక్తితత్వం

భక్తి, దాని స్వరూపం, భక్తి నిర్వచనం, కవులు నిర్వచించిన భక్తితత్వాన్ని సైద్ధాంతిక ప్రామాణిక గ్రంథాలతో విశ్లేషించి, పరిశీలించడం ఈ అధ్యాయంలోని ప్రధానాంశం. ఇంకా ఈ అధ్యాయంలో భక్తి స్వరూపం, దాని తత్వం, శైవ వైష్ణవ మతాల వర్గీకరణ, భక్తి భేదాలు, భక్తి - జ్ఞాన - కర్మలు, భక్తి - వైశిష్ట్యం, భక్తి - రసస్థితి, భక్తి - భాగవతం, భక్తి - భావమా, రసమా, భక్తి - రసౌచిత్యం, భక్తి - రసత్వ సిద్ధాంతం స్థాపన అనే అంశాల్ని క్రమంగా పరిశీలించాల్సి వుంది.

భక్తికి నిఘంటువుల్లోనూ, వేదాల్లోనూ, ఉపనిషత్తుల్లోనూ, పురాణేతిహాసాల్లోనూ, స్తోత్రాల్లోనూ, నవీనుల సిద్ధాంతాల్లోనూ, పేర్కొనబడిన నిర్వచనాల్ని స్థూలంగా పరిశీలించడం వల్ల భక్తి స్వరూపం, భక్తి భావం స్పష్టంగా అవగతమవుతాయని చెప్పవచ్చు.

## నిఘంటువుల్లో భక్తి

'భజ' ధాతువుపై 'క్తిన్' ప్రత్యయం చేరితే భక్తి శబ్దమేర్పడింది. 'భజ' ధాతువుకు 'సేవ' అనే అర్థాన్ని 'మేదినీకోశం'లో చెప్పినా, ఆ ధాతువుకు అనురాగం, అర్చన, ప్రేమ అనే అర్థాలు కూడా వున్నాయి. 'ఉపాసన' అనే విశేషార్థం కూడా వుంది.

పూజ్యులపై అనురాగం భక్తి.[1]

"ఈశ్వరే పరానురక్తిః"[2] అన్న ప్రమాణంతో పరమమైన అనురక్తి భక్తి అని తేలింది.

పరమేశ్వర విషయంలో వున్న పరమ ప్రేమ భక్తి ఉపాసకుడి ఆవృత్తిరూపమైన పరిపక్వమైన ఇది ధ్యాన, శ్రవణ, మనన, అభ్యాస, ఫలభూతమైన చిత్తవృత్తి భక్తి. ఈ చిత్త వృత్తి పరమ ప్రీతికి అధీనమని చెప్పవచ్చు. ఈ పరిశీలన వల్ల భక్తి శబ్దానికి సేవ, భజన, అర్చన, అనురాగ విశేషం, పరానురక్తి, ఉపాసన అనే అర్థాలు వున్నట్లు తెలుస్తుంది.

## వేదాల్లో భక్తి

వైదిక వాఙ్మయంలో శరణాగతి అన్నా, ప్రవృత్తి అన్నా ఒక్కటే. అదే భక్తి. ప్రపత్తితో భక్తి సమాప్తి అవుతుంది[3] ప్రపత్తి 'న్యాస' విద్యగా ఆరణ్యకాల్లో

ప్రతిపాదించబడింది.[4] అదే వేదాల్లో ఆత్మ సమర్పణగా విద్యగా నిర్దేశితమైంది.[3] వేదబుక్కులు భక్తిని పరోక్షంగా నిర్వచించాయి.[5]

యజుర్వేదంలో కూడా శరణాగతి రూపంలో భక్తి నిర్వచించబడింది. 'ఓ పురుషోత్తమా సుకృత జనులకే ప్రవేశార్హతగల స్వర్గాదిలోకాలపై త్రిపాద్విభూతి పొందే దానికి స్త్రీ, పుత్ర, సోదర, ధన, జనసహితంగా పూజ్యుడవూ, అగ్రగతి ప్రదాతవూ అయిన నిన్నే మేము శరణు పొందుతున్నాము'

పై అనుశీలన వల్ల భక్తి శబ్దాన్ని ఋగ్వేదం ఆత్మ సమర్పణ బుద్ధి అనీ, యజుర్వేదం దాన్నే శరణాగతి అని నిర్వచించినట్లు తెలుస్తుంది.

## ఉపనిషత్తుల్లో భక్తి

ఉపనిషత్తులు భక్తి శబ్దార్థాన్ని 'శరణాగతి'లో సూచించాయి. 'మోక్షకాంక్షగల నేను శరణుబొచ్చుతున్నాను' అని భక్తిని, 'శరణాగతి' రూపంలో శ్వేతాశ్వతర ఉపనిషత్తు భావించింది.[6]

అవివేకులు ఇంద్రియసుఖాల్ని పొందడానికి ఎటువంటి ఆతురత కనబరుస్తారో దాన్నే భగవద్విషయంలో చూపిస్తే అదే భక్తి అని ప్రమాణం.[7]

భక్తి అంటే భగవంతుడు సేవ అని, ఇహపర సుఖాదుల్ని ఆపేక్షించక భగవంతుడిలో మనస్సును లీనం చేసేదిగా ఆ సేవ ఉండాలనీ, గోపాల పూర్వతా పిన్యు పనిషత్తు.[8]

## పురాణేతిహాసాల్లో భక్తి

నిరంతరత్వంతో అతిగాఢంగా ఉన్న పరమేశ్వర విషయకమైన ప్రీతిభక్తి అనీ, విషయసుఖాల్లో అవివేకులకు గాఢతరమైన ప్రేమ ఉంటుందనీ, ఆ ప్రీతిని ఈశ్వరపరం చేయడమే భక్తి అని విష్ణుపురాణం చెప్పింది.[9]

పంచమ వేదమైన వ్యాస భారతంలోని భక్తి విషయాన్ని, మధ్వాచారులు భగవంతుడి మాహాత్మ్య జ్ఞానంతో సుదృఢమైన, సర్వాధికమైన స్నేహబుద్ధి భక్తియనీ దానివల్ల మాత్రమే ముక్తి అనీ, అంటే జ్ఞాన పూర్వకమైన నిత్యమైన పరస్నేహమే భక్తి అనీ వివరించారు.[10]

అధ స్సూచికలోని సుదృఢ, సర్వతో<ధిక, పరస్నేహ శబ్దాలు విష్ణుపురాణ నిర్వచనానికి వివరణలై భక్తిని నిర్వచిస్తున్నాయి.

నారదాది పాంచరాత్రాగమాలు 'భగవంతుడియందు గాఢతమమైన మమకారాన్ని కలిగివుండడమే భక్తి'యని చెప్పాయి. ఇది భీష్మ ప్రహ్లాద ఉద్ధవ నారదాదుల అభిప్రాయమనీ అందులోనే వుంది.[11]

## స్తోత్రాల్లో భక్తి

ఆదిశంకరులు తమ శివానందలహరిలో భక్తిని ఇలా నిర్వచించారు.

"అంకోలం నిజబీజ సంతతి, రయస్కాంతో పలంసూచికా,
సాధ్వీనైజ విభుం, లతాక్షితిరుహం, సింధుస్సరి ద్వల్లభమ్
ప్రాప్నోతీహ యథాతథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తిరు పేత్య తిష్ఠతి సదాసాభక్తి రిత్యుచ్యతే"

(శివానందలహరి - 61వ శ్లోకం)

ఆచార్యుల వారి భక్తి నిర్వచనం కాంతా సమ్మితమైన కావ్యమార్గంలో ధ్వన్యాత్మకంగా వుండడం విశేషం వారిచ్చిన ఉదాహరణల వల్ల భక్తి స్వరూపం స్పష్టం.

'భక్తి ప్రియా' అన్న శ్రీ లలితా నామాన్ని వ్యాఖ్యానిస్తూ శ్రీ భాస్కర రాయలు తమ 'సౌభాగ్య భాస్కర భాష్యం'లో భక్తి విషయాల్ని వివరించారు. ముఖ్య గౌణ భేదంతో భక్తి రెండు విధాలు. 'ఈశ్వర విషయిక అనురాగ చిత్త వృత్తి విశేషం' ముఖ్య భక్తి అనీ, భక్తి మీమాంసా సూత్రంలో వున్న దాన్నే వారు వివరించారు. కాగా అది ఈశ్వరుడిపై పరమమైన అనురక్తి అని తెలుసున్నది.

దేవీభాగవతంలోని పరాభక్తిని మధుసూధన సరస్వతి 'ధారావాహిక తాంగతా' అని వివరించాడు.

భగవత్పరమైన అనురక్తి, ఆర్ద్రభూతమై హృదయంలో ప్రతిబింబించి చలించక, ప్రవాహ రూపకంగా వున్న భావ విశేషమే భక్తి అని మధుసూధన సరస్వతి తెలియజేశాడు.

## భక్తి - నిర్వచనం - నవీనులు

ఇంతవరకు విభిన్న ప్రమాణాల ద్వారా ప్రదర్శితమైన భక్తి నిర్వచనం నవీనుల ద్వారా కొత్త పుంతలు తొక్కిందని చెప్పవచ్చు.

'ప్రేమ లేక ప్రపత్తి ద్వారా భగవదైక్యాన్ని పొందడం భక్తి' అని రామకృష్ణ పరమహంస తెలియజేశాడు. హృదయపూర్వకంగా చిత్తశుద్ధితో చేసిన దైవపూజ భక్తి అని వారు తెలిపారు.

'ప్రేమతో ప్రారంభించి ప్రేమతో అభివృద్ధి గాంచి, ప్రేమతో సమాప్తినొందే పరమేశ్వరాన్వేషణమే భక్తి' అని వివేకానందుల వారి భక్తి నిర్వచనం.

'మానవ చిత్త వృత్తులకు ప్రత్యక్ష సంబంధం గలది భక్తియోగం' అని శివానంద సరస్వతి నిర్వచించారు.

జ్ఞానయుక్తమైన ఆచరణ భక్తి అని మరొక ప్రమాణం వుంది. భగవంతుడిపై భక్తితో మూఢత్వాలు లేకుండడం భక్తిసారమని రాధాకృష్ణ పండితులు తెలిపారు.

నిస్వార్థంతో భగవ దధీనుడై భగవత్సేవను నిర్విషయ ప్రేమతో చేయడం భక్తి అని ఇంకొక అభిప్రాయం వుంది. తనకు ప్రీతిపాత్రమైన వాటినన్నిటినీ సర్వార్పణం చేయబడడం, అతి పవిత్రమైన త్యాగం అదే భక్తి అని ఒక అభిప్రాయం వుంది. భక్తి శబ్దానికి 'భజ' ధాతువు అనీ, 'క్తిన్' ప్రత్యయమనీ, దీనికి సేవ, ఉపాసన, పూజ్యులపై అనురాగం, ఈశ్వరుడిపై పరమప్రేమ అర్చన అనే అర్థాలు వున్నాయనీ, పామరులకు ఉన్న ఐహికమైన గాఢానురక్తి పరమేశ్వర పరమైతే అదే భక్తి అనీ, నిఘంటువుల్లోని నిర్వచనం. అదేవైదిక వాఙ్మయంలో శరణాగతి ప్రపత్తిరూపంలో వుందనీ, విశేషించి అది ఆత్మ సమర్పణ విద్య అనీ తెలిసింది.

## భక్తి భేదాలు

భక్తిని ఎందరో వర్గీకరించి ఎన్నో భేదాల్ని చూపారు. ప్రస్తుతం భగవద్గీత, భాగవతం, నారదభక్తి సూత్రాలు, భక్తి రసాయనం, భక్తి రసామృత సింధువుల నాధారంగా భక్తిని వర్గీకరించి భేదాల్ని నిరూపించడం సహేతుకమని చెప్పవచ్చు.

భాగవతం ప్రకారం భక్తి సగుణ, నిర్గుణ భేదాలలో రెండు రకాలు. ఫలసంకల్ప భేదాన్ని బట్టి సగుణభక్తి 9 రకాలు. త్రిగుణాల్ని బట్టి భక్తి 3 రకాలు. అవి తామస రాజస సాత్త్వికాలు. అంటే తమోగుణ, రజోగుణ, సత్వగుణ ప్రధానాలైనవి. అలాగే సాత్వికభక్తి 3 రకాలు. సగుణభక్తి 9 రకాలు. వీటిలో పూర్వ పూర్వం కంటే ఉత్తరోత్తరాలు విశిష్ఠమైనవి. ఈ 9 రకాల

భక్తి శ్రవణ, కీర్తన, స్మరణ, పాదసేవన, అర్చన, వందన, దాస్య, సఖ్య, ఆత్మనివేదన భేదాలతో ఒక్కొక్కటి మరలా తొమ్మిది విధాలుగా విభజించబడి వుంది.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం

అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్"

(భాగవతం 7-5-21)

నిర్గుణ భక్తి ఒకే రకమైంది. సర్వగుణాలకు ఆశ్రయభూతమైన పరమేశ్వరుడిలో గుణ, శ్రవణ మాత్రంతో సముద్రంలో చేరబోయే గంగాప్రవాహం మాదిరిగా ఎడతెగనట్టిదీ, ఫలాభిసంధిరహితమైనట్టిదీ, భేద దర్శనం శూన్యమైనట్టిదీ అయిన మనః ప్రవృత్తి నిర్గుణ భక్తికి లక్షణం.

భక్తి రసాయనం గౌణభక్తిని నాలుగు రకాలుగా చెప్పింది. అవి తామసీభక్తి, రాజసీభక్తి, సాత్త్వికీభక్తి, మిశ్రితభక్తి.[12]

గౌణభక్తి గుణాల్ని బట్టి, ఆర్త్యాదుల్ని బట్టి రెండురకాలు. గుణ సంబంధమైన భక్తి విషయాన్ని గీత విస్తరించి చెప్పింది. ఆర్తిత్వం, అర్థారిత్వం, జిజ్ఞాసత్వం, జ్ఞానత్వం అని సంకల్ప భేదాలు గీతలో చెప్పబడ్డాయి. ఆర్తి, అర్థారిత్వ జిజ్ఞాసత్వాలు గౌణ భక్తికి చెందుతాయనీ, జ్ఞానత్వం ముఖ్యభక్తికి చేరుతుందనీ, ముఖ్యభక్తిలో భక్తుడు భక్తికోసం భక్తిని చేస్తాడేకానీ ఫలాన్ని ఆశించికాదని గీతాప్రవచనం చెప్పింది.

స్థూల దృష్టితో కాయిక, వాచిక, మానసిక భేదాలు చెప్పబడ్డాయి. పూజాదికం చేయడం పారశర్యుడి మతం. ఇదికాయిక భక్తి. అలాగే భగవత్కథాదుల్ని వినడం గర్గుడిమతమని నారదుడు చెప్పాడు. జప, కీర్తన, పురాణపఠన, వ్యాఖ్యాన, హరికథా శ్రవణం మొదలైనవి ఇందులోకి వస్తాయి. ఆత్మరతిలో విరోధం లేక దేహం గాని, వాక్కుగాని వుండడం మానసిక భక్తి అని నారదుడు చెప్పాడు. భగవద్భక్తి సాధనావస్థలో అపరభక్తి లేక గౌణ భక్తి అనీ, సిద్ధావస్థలో పరాభక్తి అని పిలువబడుతుంది.

భక్తి అనేది పరమార్థ దృష్టికి ఏకరూపమే అయినా అది వ్యవహారంలో 11 రూపాల్ని దాల్చుతోంది. అవి భగవత్కళ్యాణ గుణాభివర్ణనం, భగవద్దివ్య మంగళ విగ్రహానురాగం, భగవత్పూజ, భగవత్స్మరణం, భగవత్సేవ, భగవంతుని పట్ల ప్రదర్శించే సఖ్యభావప్రేమ, భగవంతుని పుత్రునిగా భావించుట, భగవంతుని భర్తగా భావించుట, భగవంతునికి సర్వం సమర్పించుట,

భగవన్మయుడై వుండుట, భగవంతుని వీడి వుండలేక పోవుట. ఈ 11 రూపాలే శ్లోక రూపంలో క్రింది విధంగా వుంది.

శ్లో॥ "గుణమాహాత్మ్యా సక్తి, రూపాసక్తి, పూజాసక్తి,
స్మరమాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి,
కాంతాసక్తి, ఆత్మనివేదనాసక్తి,
తన్మయతాసక్తి, పరమ విరహాసక్తి, రూపా
ఏకధా అపి ఏకదశాభవతి".

గుణ మాహాత్మ్యా సక్తి భక్తికి నారదుడు, వ్యాసుడు, రూపాసక్తి భక్తికి బృందావన స్త్రీలు, పూజాసక్తి భక్తికి అంబరీషుడు, స్మరణాసక్తి భక్తికి ప్రహ్లాదుడు, దాస్యాసక్తి భక్తికి హనుమంతుడు, సఖ్యాసక్తి భక్తికి ఉద్ధవార్జునులు, వాత్సల్యాసక్తి భక్తికి దేవకీ కౌసల్యలు, కాంతాసక్తి భక్తికి రుక్మిణీ సత్యభామలు, ఆత్మనివేదనాసక్తి భక్తికి బలి, విభీషణులు, తన్మయతాసక్తి భక్తికి సనత్కుమార యాజ్ఞ వల్కులు, పరమ విరహాసక్తి భక్తికి గోపికాస్త్రీలు ప్రాతినిధ్యం వహిస్తారు.

## భక్తితత్వం

ప్రేమ స్వరూపం అయిన భక్తితత్వం నిగూఢమైంది. ప్రేమ రూపంగానేకాక, ద్వేష పూర్వకంగానైనా భగవన్నామాన్ని స్మరిస్తే అది కూడా భక్తిలో ఒక భాగమేనని చెప్పవచ్చు. భగవంతుడి విషయంలో భక్తి ఎలాంటిదో భయం ద్వేషం మోహంలాంటివి కూడా ముక్తి దాయకాలే. కొందరి అభిప్రాయం ప్రకారం, నిరంతర స్మరణ, భక్తికన్నా ద్వేషాదుల్లోనే అధికంగా భగవత్పరమవుతుందని చెప్పవచ్చు. ఈ విషయానికి భాగవతంలోని శ్లోకాన్ని ఆధారంగా చెప్పవచ్చు.[13]

భక్తితత్వం ప్రేమ పూర్వకంగానే కాక, ద్వేషం, సఖ్యం, భయం, బంధం, విరహం మొదలైన ఎన్నోభావాల్లో ఇమిడివుంది. అందువల్లనే భక్తి చాలా విశాలమైన లక్షణాన్ని కలిగివుంది. ఏ జన్మ ఎత్తినా, జాతి, కుల, మత, లింగభేదాలు గాని, పశుపక్షి కీటకాది భేదాలు గాని, లేక నిరంతరం ఆ పరమేశ్వరుణ్ణి హృదయంలో నిలిపి ధ్యానిస్తే భగవంతుడి అనుగ్రహంతో ఆ ప్రాణికి మోక్షం ప్రాప్తిస్తుంది అనేది ప్రధానమైన భక్తితత్వం. దీన్నే వేదశాస్త్రపురాణాలు ప్రవచించాయి.

అందుకే ఆది శంకరులు ఈ విషయాన్నే మధుర కవితారూపంలో శివస్తుతి వ్యాజంతో ప్రవచించారు.[14]

భగవంతుడిపై వున్న ప్రేమకు మూడు ప్రత్యేక లక్షణాలున్నాయి. ఇందులో అహంకారానికి చోటులేదు. భగవత్ప్రేమ ఏకాంతికం. భగవంతుణ్ణి ప్రేమించడం తప్ప భక్తుడికి ఇతర సంగతి తెలియదు. ఈ ప్రేమలో ఒక పారవశ్యం కలుగుతుంది. భక్తుడు ఆత్మారాముడై వుంటాడు.

భక్తికి పూజకభావం బీజం. పూజ్య పదార్థ సంబంధాలైన విశేషాలు మొదట్లో పూజకుడి మనస్సును ఆకర్షిస్తాయి. పూజకుడు పూజ్యపదార్థంలోని విశేషాల్ని పొందడానికి ప్రయత్నిస్తాడు. ఈ ప్రయత్నమే సాధన. ఇది మొదటి దశలో పూజించే వాడికి, పూజించబడే పదార్థానికీ భేదభావం ఎక్కువగా వుంటుంది. క్రమంగా ఆ భేదభావం రూపుమాసి, అధీనస్థితి ఏర్పడుతుంది. కనుక జీవబ్రహ్మలయొక్క భేదభావంతోనే మొదట భక్తి పొడచూపుతుంది. తరువాత పరమేశ్వరుడు సకల కళ్యాణ గుణుడు అని నమ్మి ఆ గుణసంపదను పొందాలనే తీవ్రమైన అభిలాష, మొదట పొటమరించిన భక్తిని ప్రోది చేసుకొని, ధ్యేయాకారతత్వాన్ని పొంది, దాని అంశను జీవుడికి పొందించి, చివరకు జీవబ్రహ్మలకు ఏక్యాన్ని కలిగిస్తుంది. ఇదే భక్తితత్వం. దీని భావమే క్రింది శ్లోకం.

"దేహబుద్ధ్యాతుదాసోఽహం జీవబుద్ధ్యాదంశకః

ఆత్మ బుద్ధ్యాత్వమే వాహమితిమే నిశ్చితామతిః"

## భక్తిమార్గం

వ్యక్తా వ్యక్తాలకు, కర్మజ్ఞాన మార్గాలకు, సగుణ, నిర్గుణోపాసాలకు మానవ హృదయంలో భక్తిమార్గం సంధిబంధనంగా వుంది. రుద్రేంద్ర వరుణాగ్ని దేవతార్చనలతో ప్రారంభమైన వైదికమతం 'సర్వంఖలిద్వం బ్రహ్మ' అనే తత్వ పరిజ్ఞాన పరిణామం పొందింది. ఈ పరిణామాలు ద్వైతాద్వైతాల్లోను, శైవవైష్ణవాల్లోను, నిర్గుణ సగుణోపాసాల్లోను, కర్మ భక్తి జ్ఞానయోగాల్లోను, నిగమాగమ పురాణాల్లోను కనిపిస్తుంది.

మానవుని నిత్య జీవితంలో దుఃఖనివృత్తికి, సుఖప్రాప్తికి దైవసందర్శనం పరమ సాధనంగా వుంది. జైన బౌద్ధమతాలు సంసారం దుఃఖసాగరమని, సన్యాసం సుఖసాధనమని ఉపదేశించాయి. అద్వైతం సంసారం మాయా కల్పితమని ఉపదేశించింది. పండితులు, బ్రాహ్మణులు కర్మలతోను, సిద్ధాంతాలతోను, సన్యాసాశ్రమంతోను కాలయాపన చేస్తుంటే ప్రజలు అజ్ఞానాంధకారులై దుఃఖవేదన అనుభవించేవారు. వైరాగ్యం, నిర్లిప్తత్వం,

నిర్లక్ష్యం. నిస్పృహ, నిస్సహాయత్వం, పరిపాటై భారతీయ చైతన్యం నిర్వీర్యమైంది. ఈ విషయావస్థ యందు వీరశైవం మత ధర్మాల్లోను, లక్ష్యాల్లోను, సాంఘికార్థిక పరిస్థితుల్లోను గొప్ప పరివర్తనాన్ని కలుగజేసింది.

## భక్తులు - వర్గీకరణ

భక్తి పరమార్థ దృష్టికి ఒకే రూపంగా కనిపించినప్పటికీ అది వివిధ రూపాల్ని దాల్చింది. ఈ భక్తులలో భగవత్కళ్యాణాన్ని కాంక్షించేవారు, భగవంతుని దివ్య మంగళ విగ్రహాన్ని అనుగ్రహంగా అభిలషించేవారు, భగవంతుని పూజించేవారు, భగవంతుని స్తుతించేవారు, భగవంతుని పట్ల సఖ్యభావాన్ని కలిగివుండేవారు, భగవంతుని పుత్రునిగా భావించేవారు, భగవంతుని భర్తగా భావించేవారు, భగవంతునికి సర్వం సమర్పించేవారు, భగవంతుడిని కలలోనైనా వీడి యుండలేమనే తలంపు కలవారు వున్నారు. పురాణ పురుషులెందరో ఇటువంటి భక్తి ప్రపత్తుల్ని ప్రకటించి తన జన్మసార్థకం చేసుకొన్నారు. వీరిలో నారదుడు, వ్యాసుడు, అంబరీషుడు, ప్రహ్లాదుడు, హనుమంతుడు, బలి, విభీషణులు తదితరులు వున్నారు.

బసవపురాణం భక్తిమయమైన కావ్యం. ముఖ్యంగా వీరశైవ మతానికి ఒక దిక్సూచిలా వ్యవహరించింది. శైవభక్తికి, నిష్ఠకు, నియమాలకు, ఆచార సంప్రదాయాలకు, అపరిమితమైన విశ్వాసాలకు ఒక ప్రతీకగా ఇప్పటికీ నిలిచియున్నది.

బసవపురాణంలో ఎందరో భక్తులు మనకు కనిపించినప్పటికీ, పండిత పామరులనే గాక ఇతర మతస్థులను సహితం ఆకర్షించుకొనేటట్లుగా వున్న పాత్రలు ముగ్ధభక్తులు. వీరికి భగవంతుని తత్వం గాని, భక్తి గొప్పతనం గాని, మరి ఏ ఇతర విషయాలు గాని తెలియవు. ఈశ్వరుని తమలాంటి సహజ వ్యక్తిగా వీరు భావిస్తారు. ఈశ్వరునితో ఇతరులతో మాట్లాడినట్లే మాట్లాడుతారు. అతన్ని నిందిస్తారు, ధూషిస్తారు, ప్రేమిస్తారు, అల్లరిపెడతారు, తమతో ఆడుకోను రమ్మంటారు, తాము పెట్టింది తినమంటారు - ఇలాంటి భక్తుల హావభావాలు, వారి మాటలు, చేష్టలు కేవలం. శైవభక్తులనేకాక ఇతరులను కూడి అలరిస్తాయని చెప్పవచ్చు.

బసవపురాణం శైవవాఙ్మయంలో శిరోభూషణ గ్రంథంగా చెప్పబడు తున్నది. చారిత్రక దృష్టితో గమనించినా, సారస్వత దృష్టితో పరిశీలించినా పరిశోధకులకు ఈ గ్రంథం ఒక అమూల్య గ్రంథంగా కనిపిస్తుంది. ఈ గ్రంథం ఆంధ్రదేశంలో శైవమత వ్యాప్తికి ఇతోధికంగా తోడ్పడింది. వీరశైవంలో శైవభక్తి

వీరస్వరూపాన్ని దాల్చుతుంది. శివభక్తి పారవశ్యంలో భక్తులు తమ కన్నుల్ని, భార్యాబిడ్డల్ని, ప్రాణాల్ని సైతం శివకైంకర్యమొనర్చి మోక్షప్రాప్తి పొందిన కథలు ఈ బసవపురాణంలో చాలావున్నాయి.

బసవపురాణంలో బసవేశ్వరుడనే బ్రాహ్మణోత్తముని భక్తితత్వం వివరింప బడింది. బసవేశ్వరుని రాజ్యాధికారం, ధృడసంకల్పం, పరమ శివభక్తి, త్యాగశీలం, కులనిరసనం, జంగమభక్తి కుమ్మర గుండయ్య, పూసలనయనారు, కిన్నెర బ్రహ్మయ్య, కొఱయ, కలకేత బ్రహ్మయ్య, యొళిగ మారయ్య, కన్నడ బ్రహ్మయ్య, మునిఁడి చౌడయ్య, సురియ చౌడయ్య, తెలుఁగు బొమ్మయ్య, ఏకాంతరామయ్య, తిరునావుకరశుడు, ఇరుత్తాండి. పిళ్ళనైనారు, నిడుమారడు, నమినంది, సాంఖ్యతొండడు, గోపూరి బ్రహ్మయ్య, తేడర దాసయ్య, హిరియ నాచయ్య, సోమన్న, నైజకవ్వ, షొడ్డల దేవుబాచయ్య, అరియమ, వీరశంకరుడు, శివలెంకమంచయ్య, శంకరదాసయ్య, కల్లి దేవయ్య, బిబ్బబాచయ్య, మాదరదూడయ్య, బానస భీమయ్య, శ్వపచ్చయ్య, ఉద్భటుడు, కక్కయ్య, భోగయ్య, గుడ్డవ్వ, జగదేవదండ నాయకుడు, ఏలేశ్వరు కేతయ్య, సవరదనాచయ్య, అల్లయ్య మధుపలయ్యల కథలు. మొదలైనవి ఇందులో ప్రసిద్ధాలైన అంశాలు. ఈ పురాణంలోని అనేక కథల్లో ముఖ్యమైనవి కొన్ని.

ఆ కథలు :- బల్లేశు మల్లయ్య, కాటకోటుడు, మొఱటద వెంకయ్య, తిరుచిట్టం బలుడు, ముగ్ధ సంగయ్య, రుద్ర పశుపతి, నక్కనైనారు, బెజ్జమహాదేవి, గొడగూచి, దీపద కళియారు, నాట్యనమిత్తండి, ఉడుమూరి కన్నప్ప, కళియాంబనైనారు, సకలేశ్వరు మాది రాజయ్య, మడివాలు వాచయ్య, ఇరువదాండారి, జగదేకమల్లుడు, నిమ్మవ్వ, నరసింగనయనారు, కొట్టరువు చోడడు, హలాయుధుడు, సిరియాలుడు, మిండనైనారు, బాణుడు, పిట్టవ్వ, కలికామదేవుడు, ఏణమూర్తినైనారు, కడమలనంబి, గుగ్గులు కళియారు, అరివాళునయనారు, అడిభర్తుడు, ఏణాదినాధుడు, చేదివల్లభుడు, హంయూరి చోడడు, ఇరువదాండారి, కళియంబనైనారు, అంగుళి మారయ్య, గుణపాలుడు, ఈ భక్తుల కథల్లో ముగ్ధభక్తుల కథలుకొన్ని కలవు. అవి కన్నప్ప, గొడగూచి, బెజ్జమహాదేవి, సిరియాళుడు, నిమ్మవ్వ, బాణుడు, పిట్టవ్వ, గుణపాలుడు, ఇరుత్తాంగి, పిళ్ళనైనారు, నైజకవ్వ, ఉద్భటుడు, కక్కయ్య, కిన్నెర బ్రహ్మయ్యల కథలు.

# ముగ్ధ భక్తితత్వం

భక్తి అంటే సేవ, జీవితాన్ని ఏకచిత్తంతో భగవంతునికి కానుకగా సమర్పించడం, పూజ్యభావంతో భగవంతుని స్తుతించడం, నిస్వార్థంగా భగవంతుని పట్ల విశ్వాసాన్ని ప్రకటించడం, తోటి మానవుల పట్ల ప్రేమ, వాత్సల్యభావాల్ని కలిగివుండడమని చెప్పవచ్చు.

ఈ భక్తి అనేక పరిణామాల్ని పొందింది. ఇతిహాసాల్లో, పురాణాల్లో, వేదాల్లో, ఉపనిషత్తుల్లో, స్తోత్రాల్లో, గ్రంధాల్లో, నిఘంటువుల్లో భక్తి అనేక స్వరూపాల్ని పొంది, జన జీవితాన్ని ప్రతి బింబించిందని చెప్పవచ్చు. నిర్మలమైన మనస్సుతో భగవంతుని పట్ల ప్రదర్శించే భక్తి భావమే మనిషి జీవితానికి ఒక సార్థకతను చేకూరుస్తుందని చెప్పవచ్చు.

బసవపురాణ గ్రంథంలో వీరశైవం విశ్వరూపాన్ని దాల్చి కావ్యమంతా సంతరించు కొన్నది. కేవలం శైవభక్తుల కథలే ఇందులో మిక్కుటాలు. సోమనాధుడు తన కాలంలో, తనకు ముందున్న కాలంలో శైవభక్తులుగా ప్రసిద్ధిచెందిన కొందరి చరిత్రల్ని విశదీకరించడమే బసవపురాణంలో కనిపించే ఇతివృత్తమని చెప్పవచ్చు. ఇతివృత్తం రీత్యా ఈ కావ్యానికి బసవని చరిత్ర అని నామకరణం చేయాలి. కాని సోమన దీనిని బసవపురాణం అన్నాడు.

బసవపురాణంలోని ముగ్ధభక్తుల చరిత్రను పరిశీలిస్తే వారి అమాయకపు చేష్టలు, భగవంతుని పట్ల వారు ప్రదర్శించిన మూఢభక్తి, కోపావేశాలు, వారి కపటంలేని ప్రేమ మనకు కనిపిస్తాయి. ఈ ముగ్ధభక్తుల్లో ముఖ్యంగా పేర్కొనదగినవారు గొడగూచి, బెజ్జమహాదేవి, సిరియాలుడు, నిమ్మవ్వ, కక్కయ్య, ఉడుమూరికన్నప్ప, కిన్నెర బ్రహ్మయ్యలు. వీరి నిష్కల్మష భక్తి ఎంతైనా పరిశీలింపదగివున్నది.

సోమనాధుడు ఈ ముగ్ధభక్తుల పాత్రల్ని ఒకేరీతిగా, అచ్చు పోసినట్లుగా కాక, వారికి ప్రత్యేక వ్యక్తిత్వాన్నాపాదించి, విలక్షణంగా చిత్రించాడని చెప్పవచ్చు. ఈ పాత్రల ద్వారా సమాజంలో చైతన్యం తీసుకురావడానికి సోమన చేసిన కృషి ప్రశంసనీయమని చెప్పవచ్చు. పాత్రల ముగ్ధత్వాన్ని కళ్ళకు కట్టినట్లు ప్రదర్శించి ప్రజ్ఞావంతుడని నిరూపించుకొన్నాడు సోమన. సోమన సృష్టించిన ఈ ముగ్ధభక్తుల పాత్రలు సర్వజన సమాదరణీయాలు, సామాజిక జీవనానికి, సన్నిహితాలు, అతి సహజంగా ప్రవర్తించేవి, నిర్మలమైన నిశ్చల భక్తికి చక్కటి నిదర్శనాలు అని చెప్పవచ్చు.

బెజ్జమహాదేవి శివునికి చేయు పరిచర్యల్ని గమనిస్తే సోమనాథుని వస్తు పరిశీలనా శక్తి ద్యోతకమవుతుంది. తాను తెచ్చిన పాలను శివుడు ఆరగింపలేదని శివభక్తురాలైన గొడగూచి భయాందోళనలు వ్యక్తం చేస్తుంది ఈ సందర్భంలో సోమన గొడగూచి ముగ్ధత్వానికి భావాల్ని పొందుపరచి మనోహరంగా పాత్రవర్ణన చేశాడు. ఈ కథలలో సోమన ఆయా ప్రాంతాల్లో, ఆయా సందర్భాల్లో వాడబడిన వ్యవహారిక పదజాలాన్నే వుపయోగించడంవల్ల ఈ కథలు పండితుల్నే కాక పామరుల్ని కూడా విశేషంగా ఆకర్షించాయని చెప్పవచ్చు.

# వీరవైష్ణవులలో ముగ్ధభక్తులు

## వైష్ణవం

వేదాలు, ఉపనిషత్తులే కాక విష్ణుభక్తులైన ఆళ్వారుల దివ్యప్రబంధాలు కూడా విశిష్టా ద్వైతానికి ప్రమాణాలు. ఆళ్వారులు పరమభక్తులు. ఆళ్వారుల అనుభూతుల సంప్రదాయమే వైష్ణవానికి ఆధారం. దీనికి శాస్త్రత్వాన్ని ప్రథమాచార్యుడైన నాథముని కల్పించాడు. నాథమునికి ముందు నమ్మాళ్వారు చతుర్వేదాలు, తిరువిరుత్తీమ్ తిరువాశిరీయం, పెరియ తిరువందాది, తిరువామ్, మొళిగ్రంథాలున్నాయి. వీటిని ఆధారంగా నాథముని విశిష్టా ద్వైతానికి ఒక రూపాన్ని కల్పించాడు.

శైవ వైష్ణవాలు ప్రాచీన మతశాఖలు. హైందవ ధార్మిక జీవన విధానానికి ప్రతీకలుగా ప్రత్యేకించి దక్షిణదేశంలో ఇవి ఎక్కువగా విస్తరించాయి. వేద మౌలికాలైన ఈ రెండు శాఖలు కాల క్రమంలో ఎన్నో పరిణామాలు పొందాయి. అవాంతర భేదాల్ని సైతం పొందాయి. శివ ప్రాధాన్యం కలిగింది శైవం. విష్ణు ప్రాధాన్యం కలిగింది వైష్ణవం. దక్షిణ భారతంలో జనజీవన విధానంపై వీటి ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. శైవ, వైష్ణవాల్లో వీరశైవం, వీర వైష్ణవం అనే ప్రత్యేక శాఖలు బయలుదేరి ఒక దశలో దక్షిణాదిని ఒక ఊపు ఊపాయి. సామాజిక జీవనానికి ప్రమాదాన్ని కూడా కలిగించాయని చెప్పవచ్చు.

## తమిళ సాహిత్యంలో ఆళ్వారుల ప్రసక్తి

ఆంధ్రవాఙ్మయ చరిత్రలో వీరశైవ సాహిత్యాన్ని ఒక ప్రత్యేక వస్తువుగా గుర్తించి పరిశోధన చేశారు. పతన పాతనాదుల్లో ఆ సాహిత్య ప్రత్యేకతల్ని నిరూపించిన వారున్నారు. కాని వైష్ణవ సాహిత్యాన్ని, అందులోను ఆళ్వారుల వాఙ్మయాన్ని విస్తృతంగా, సాలోచనగా పరిశోధన చేసినవారు చాలా తక్కువమంది. ఈ వాఙ్మయం యొక్క ప్రత్యేకతల్ని స్పష్టంగా నిరూపించినవారు దాదాపుగా లేరనే చెప్పవచ్చు. ఇందుకు కారణాలుగా ఆళ్వారుల వాఙ్మయం చాలావరకు తమిళ భాషలోనే ప్రచురితమై వుండడం, తెలుగు కవులలో అతి కొద్దిమందికి మాత్రమే తమిళంతో పరిచయమేర్పడి వుండడంలను చెప్పవచ్చు. అంతేకాక ప్రాచీనాంధ్రయుగంలో శైవప్రాబల్యం అధికంగా వుండడం కూడా మరోకారణంగా చెప్పవచ్చు. అయితే, విజయనగర రాజుల కాలం నుంచి ప్రత్యేకించి రాయల యుగంనాటి నుంచి వైష్ణవం ఆంధ్ర దేశంలో బహుళవ్యాప్తి కావడంతో వెలుగులోకి వచ్చిందని విమర్శకుల అభిప్రాయం.

## ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో ఆళ్వారుల ప్రసక్తి

ఆంధ్ర వాఙ్మయంలో మొదట ఆళ్వారుల ప్రసక్తి కృష్ణమాచార్యుల (13వ శతాబ్దం) సింహగిరి వచనాల్లో కనిపిస్తుంది.

> "దేవా! శ్రీరామానుజుల సిద్ధాంతమును బోలు మఱి సిద్ధాంతము లేదు. పరమాచార్యులం బోలు మఱి యాచార్యులు లేరు. పరమ భాగవతులం బోలు మఱి సమ్మోదపరులు లేరు. వారికైంకర్యపరులం బోలు మఱి కైంకర్యపరులు లేరు. 'అస్మద్గురుభ్యోనమః' అను మంత్రంబునకు సరిమంత్రంబు లేదు. పరమ రహస్యంబునుం బోలు మఱి రహస్యంబు లేదు. స్వామి సింహగిరి నరసింహ నమోనమో దయా నిధీ!"

(సింహగిరి వచనములు - 17వ వచనం)

పద కవితా పితామహుడు తాళ్ళపాక అన్నమయ్య 32 వేల సంకీర్తనల్ని వెలయించాడు. వీటిలో ఆళ్వారుల ప్రసక్తి క్రింది విధంగా వుంది.[1]

ఆళ్వారులు పన్నెండు మందని విమర్శకుల అభిప్రాయం. వీరిని గురించి ప్రస్తావించి, వీరి చరిత్రలను విపులంగా వర్ణించిన ప్రసిద్ధ ప్రాచీన కవులు తాళ్ళపాక చిన్నన్న, సిద్ధిరాజు తిమ్మరాజు, నంబూరి కేశవాచార్యులు - ఈ ముగ్గురు కవులు విష్ణు భక్తులైన 12 మందిని గురించే కాక వైష్ణవ మత వ్యాప్తి గావించిన యమునాచార్య, రామానుజాచార్యుల చరిత్రల్ని కూడా తమ గ్రంథాల్లో తెలిపారు. వీరిలో మొదటి వాడైన తాళ్ళపాక చిన్నన్న పెద తిరుమలయ్య నాల్గవ కుమారుడు. అన్నమాచార్య చరిత్రం, పరమయోగి విలాసం, అష్టమహిషీ కళ్యాణం, ఉషా పరిణయం గ్రంథాల్ని రచించాడు. చిన్నన్న ద్విపదసాహిత్యానికి గౌరవం పెంచిన కవి. అందుకే 'చిన్నన్న ద్విపదకెరుగు' అని చెపుతారు. ఇతనికి చిన్న తిరువేంగళనాథయ్యా, చినతిరువేంగళయ్యా, తిరువెంగళనాథయ్యా, తిరువెంగళనాథయ్యాం గార్, వెంగళార్య, తిరువెంకట నాథయ్యా, తిరు వేణాధర్, తిరువేణాధయ్యార్ అని నామాంతరాలున్నాయి. చిన్నన్న రచించిన పరమయోగి విలాసం 8 ఆశ్వాసాలతో నిండివుంది. ఇందులో 6337 ద్విపదలు పొందు పరచబడ్డాయి. చిన్నన్న ఈ గ్రంథాన్ని అలువేలు మంగ, వేంకటేశ్వరులకు అంకితమొసగాడు.

చిన్నన్న పరమయోగి విలాసానికి సంస్కృతంలోని గరుడవాహన పండితుని దివ్యసూరి చరితమ్, అనంతాచార్యుని ప్రసన్నామృతమ్, తమిళంలోని పిన్ బళగియ పెరుమాళ్ జ్యీయర్ (ఆరాయిరప్పడి) (14వ) గురు

పరంపరాప్రభావం, మణవాళ మహాముని (14వ శ) ఉపదేశ రత్నమాలలు ఆధారం కావచ్చునని విమర్శకుల అభిప్రాయం. చిన్నన్న వీటిలో కొన్ని మార్పులు చేశాడని వారిభావన.

మూలంలో వున్న భక్తిసారయోగి కథలో దృఢవ్రతుడు నాల్గవజాతికి చెందినవాడు. భక్తిసారుడు మొదట్లశైవుడు. పాణార పంచముడు. నిజమైన వైష్ణవుడు కులాలకు అతీతుడని భావించినందువల్ల చిన్నన్న ఈ కులాల ఊబిలోకి దిగలేదని విమర్శకుల అభిప్రాయం.

కథాంశాలలో కూడా చిన్నన్న కొన్ని మార్పుల్ని చేశాడు. సారుడనే ఆళ్వారు చరిత్రలో వల్లవరాయడు తనకు తిరిగి యవ్వనం ప్రసాదించమని స్వామినుద్దేశించి గానం చేయమని కణికృష్ణుని కోరినట్లు ఆధార గ్రంథాలు వర్ణిస్తే, తనకే కోరిక లేనట్లు, కృష్ణుని కవితకు మెచ్చి తనమీద పాట వినాలనే తలంపు వున్నట్లుగా చిన్నన్న మార్పుచేశాడు. కులశేఖరాళ్వార్ చరిత్రలో కులశేఖరుడు సైన్యాన్ని సమాయత్తం చేసి యుద్ధానికి సన్నద్ధమై మంత్రితో శ్రీరామ శత్రు సంహార ఘట్టాన్ని చదవమని కోరగా మంత్రి చదవడంతో, కులశేఖరుడు తర్వాత సేనల్ని ఉపసంహరించుకొన్నట్లుగా ఆధార గ్రంథాల్లో వున్నదానిని రామాయణ పారాయణం జరుగుతుండగా సీతాపహరణం విని కులశేఖరుడు రావణునిపై దండెత్తడానికి సైన్యాన్ని సమాయత్తపరచి తాను లంకవైపు కదిలే సమయంలో గోవిందుడు విమానంపై వచ్చి తనతో తీసుకొని వెళ్ళినట్లుగా చిన్నన్న మార్పు చేశాడని విమర్శకులు తెలియజేస్తున్నారు. తిరుప్పాణార్ చరిత్రలో పాణార్ వరివెన్నులో శ్రీవత్స అంశంలో జన్మించాడని, మాతదాసుడనే పంచముని వద్ద పెరిగాడని ఆధార గ్రంథాల్లో వుంటే కుల ప్రసక్తిని చిన్నన్న వర్ణించకుండా మార్పు చేశాడు.

ఆళ్వారుల చరిత్రను సమగ్రంగా వర్ణించే మరోకావ్యం పరమయోగి విలాసం. కావ్యకర్త సిద్ధిరాజు తిమ్మరాజు. ఇతడు కొండవీటిని పాలించిన అళియరామరాయని మేనల్లుడిగా చెపుతారు. తిమ్మరాజు తన పరమయోగి విలాసాన్ని మంగళగిరి నృసింహస్వామికి అంకితం చేశాడు. ఇది ఒక చంపూప్రబంధం. 5 ఆశ్వాసాల గ్రంథం. తిమ్మరాజు ఈ గ్రంథాన్ని చిన్నన్న రచించిన పరమయోగి విలాసం ఆధారంగా రచించినట్లు కన్పిస్తుందని విమర్శకుల అభిప్రాయం. ద్విపద రూపంలోని గ్రంథానికి ఇది పద్యరూప పరివర్తనమని వారి భావన. చిన్నన్న 200 ద్విపదలతో 108 దివ్య తిరుపతుల్ని వర్ణిస్తే తిమ్మరాజు ద్విరదగతి రగడలలో వర్ణించాడు.

ఇక మూడవ గ్రంథం నంబూరి కేశవాచార్య రచించిన ఆచార్యసూక్తి ముక్తావళి. దీనిని గ్రంథకర్త రామానుజాచార్యులకు అంకితమిచ్చాడు. రచయిత తల్లిదండ్రులు అలిమేల్మంగమ్మ, వెంకటకృష్ణాచార్యులు, మంగళగిరిలో చేరిన నంబూరి కేశవాచార్య నివాసస్థలం.

ఆచార్యసూక్తిముక్తావళిలో పూర్వ, మధ్య ఉత్తరాలనే మూడు భాగాలున్నాయి. మొదటి దానిలో ఆరు, రెండవ దానిలో పన్నెండు, మూడవ దానిలో ఆరు ఉల్లాసాలున్నాయి. వీటిలో ఆళ్వారుల చరిత్ర, రామానుజుల చరిత్ర ఆచార్య పురుషుల చరిత్రలు వున్నాయి. ఇందులో ఆళ్వారుల కథలే కాక విశిష్టాద్వైత రహస్యాలు కూడా నిండివున్నాయి. కవి గురు పరంపరా ప్రభావం, దివ్యసూరి చరిత్రం, ప్రసన్నామృతం, యతీంద్ర ప్రవీణ ప్రభావం, ఆధారంగా ఈ గ్రంథాల్ని రచించాడని చెప్పవచ్చు.

తెలుగు కవులలోని ఈ 12 మంది ఆళ్వారులను శ్రీ కృష్ణ దేవరాయలు తన కావ్యం ఆ ముక్తమాల్యదలో క్రింది విధంగా స్తుతించాడు.

"అలపన్నిద్దరు సూరులందును సముద్యల్లీలగా పున్నవె
గ్గల పందాపము బాప నానిజమనః కంజాత సంజాత
పుష్కల మాధ్వీక ఝరిన్మురారి నొగియంగా జొక్కిధన్మాత్ములౌ
నిలపన్నిద్దరు సూరులం దలతు మోక్షేచ్ఛామతిం దివ్యలన్"
(ఆముక్తమాల్యద 1-10)

## తెలుగు కవులు మెచ్చిన ఆళ్వారులు

ఆళ్వారులు పన్నెండు మందైనప్పటికీ తెలుగు కవులకు విప్రనారాయణుడు, ఆండాళ్ (గోదాదేవి)లు మాత్రమే మెచ్చినట్లుగా విమర్శకుల అభిప్రాయం. ఇందుకు తగిన కారణాల్ని కూడా తెలియజేశారు. అవి ఇతర ఆళ్వారులలో కంటే విప్రనారాయణుని కథలో శృంగార స్పర్శ అధికంగా వుండి, సమకాలీన రాజకీయ పరిస్థితులకనుగుణంగా రచింపబడి వుండడం, ఆళ్వారులలో గోదాదేవి (ఆండాళ్) ఒక్కతే స్త్రీ కావడం, ఆమె భక్తితో రంగనాథుణ్ణి స్మరించి వరించడం సామాన్య స్త్రీలను విశేషంగా ఆకర్షించే అంశాలు కావడం వల్లనే వీటిని తెలుగు కవులు ప్రశంసించినట్లుగా విమర్శకులు తెలిపారు. ఈ కారణాలు వల్లే తెలుగులో విప్రనారాయణునికి సంబంధించిన మూడు ప్రబంధాలు, మూడు యక్షగానాలు కన్పిస్తున్నాయి.

## విప్ర నారాయణుడు

తాళ్ళపాక చిన్నన్న, తిమ్మభూపతి, మల్లనల విప్రనారాయణ కథలు దాదాపుగా ఒకే రకంగా కన్పిస్తాయి. కాని సారంగు తమ్మయ్య తన 'వైజయంతీ విలాసం'లో చాలా మార్పులు చేశాడు.

ఆధారగ్రంథాల్లో దేవదేవి అక్క అలివేణి. కాని చిన్నన్న, తిమ్మభూపతి, మల్లనలు దేవదేవి అక్క అని చెప్పారు కాని పేరు చెప్పలేదు. సారంగు తమ్మయ్య దేవదేవి అక్కకు మధురవాణి అని నామకరణం చేశాడు. ఆధార గ్రంథాల్లో విప్రనారాయణునికి సేన మొదలియారు పంచ సంస్కారాలు గావించినట్లుండే చిన్నన్న గురువు పేరు తెలుపలేదు. ఆధార గ్రంథాల్లో విప్రనారాయణుని శిష్యునిపేరు రంగదాసుడని వుంటే చిన్నన్న కాంతోపయంతుడని చెప్పారు. తమ్మయ్య రంగనిగా పరిచయం చేశాడు.

కథాంశాల్లోని మార్పుల్ని పరిశీలిస్తే శ్రీహరి వనమాలికాంశంతో ఒక వైష్ణవ గృహస్థునికి విప్రనారాయణుడు జన్మించాడని ఐతిహ్యంలోవుంది. అయితే సారంగు తమ్మయ్య, లక్ష్మినారాయణ దంపతులకు సంతానం లేదని, సంతానం లేని కారణం చేత ఒక వైష్ణవ యతీంద్రుడు భిక్షకు రావడానికి తిరస్కరించడంతో లక్ష్మినారాయణ దంపతులు వేదన చెంది విచారిస్తుంటే కలలో విష్ణువు కన్పించి నలుపు తెలుపు రంగుల పూలదండను ప్రసాదించాడని అదే వైజయంతి అని మార్పుచేశాడు. దేవదేవి తన గయ్యాళి తల్లిపోరు పడలేక వేశ్యావృత్తి మాని విరక్తురాలైనట్లు చిన్నన్న వ్రాయగా, పింగళోపాఖ్యానం విని విరక్తురాలైనట్లు సారంగు తమ్మయ్య వర్ణించాడు. రాజు దేశ బహిష్కరణ శిక్ష విధిస్తే విప్రనారాయణుడు దేహత్యాగానికి సంసిద్ధుడైనట్లుగా తమ్మయ్య మార్పు చేశాడు. దీనిని బట్టి వైష్ణవాచార విధేయత చిన్నన్నలో, భక్తిరస ప్రాధాన్యం తిమ్మరాజులో, మల్లనలో, శృంగార ప్రాధాన్యం తమ్మయ్యలో చోటుచేసుకున్నట్లుగా విమర్శకుల అభిప్రాయం.

## గోదాదేవి (ఆండాల్)

వైష్ణవాంధ్ర సాహిత్యంలో విశిష్టస్థానాన్ని అధిష్ఠించిన ఆముక్తమాల్యద గ్రంథానికి విష్ణు చిత్తీయమని పేరుకూడా వుంది. రచయిత వైష్ణవుడు, కృతిభర్త శ్రీనివాసుడు, కృతి వైష్ణవ సంబంధితం. ఆంధ్ర ప్రబంధాల్లో ప్రౌఢం. ఇందులో ఎన్ని కథలున్నప్పటికీ గోదాదేవి కథకే అధిక ప్రాధాన్యత వచ్చిందని విమర్శకుల అభిప్రాయం. రాయలు తన కాలంనాటి వైష్ణవ గురు పరంపరా ప్రభావాన్ని తెలిపే కథల్ని పరిశీలించి కొన్ని మార్పులుచేసి ప్రబంధ రచన

చేశాడు. ఆధార గ్రంథాల్లో పాండ్యరాజు పేరు వల్లభదేవుడని వుంటే, రాయలు మత్స్యధ్వజుడని చెప్పాడు. మూలంలో గోదాదేవి చెలికత్తె అనుగ్రహం అని వుండగా, రాయలు మరాళి, హరిణి, స్రగ్విణి అనే చెలికత్తెల్ని అదనంగా జోడించాడు. గోదాదేవికి 'సూడికొడుత్త నాచ్చియారో' అనే పేరు ప్రసిద్ధికాగా, దానికి తగినట్టుగా ఆముక్తమాల్యద అని పేరు పెట్టాడు.

మూలంలో తులసీ వనంలో బాలకన్య విష్ణుచిత్తునికి దొరికిందని వుండగా, నెలదమ్మి బావికి దగ్గరగా తులసీవన సీమలో తిన్నెపై, 'గోద'నిసుగుగా దొరికిందని రాయలు మార్చి వ్రాశాడు. గోదాదేవి భూదేవి అవతారంగా చెప్పినా దానికి తోడు సత్యాదేవి అవతారమని కూడా రాయలు స్పష్టం చేశాడు. మూలంలో శ్రీరంగనాథస్వామి గోదాదేవిని వరించి, అంతర్ధానం చేశాడని వుంటే రాయలు మధ్యలో కొంత కథ నడిపాడు. మూలంలో లాగే పరిణయంతో రాయలు కథ ముగించాడు.

తాళ్ళపాక చిన్నన్న తన పరమయోగి విలాసంలో గోదాదేవి కథను చాలా మూల విధేయంగాను, కొంత ఆముక్తమూల్యద ఆధారంగా వ్రాశాడు. కొన్ని అంశాల్లో పాత్రక్రొత్తల మేలు కలయిక కన్పిస్తుంది.

యక్షగాన వాఙ్మయంలో విప్రనారాయణ చరిత్రవున్నట్లే గోదాదేవి చరిత్రకూడా వుంది. ఈ చరిత్రను 'ఆండాళ్ చరిత్ర' పేరిట కొత్తూరు రంగనాయకమ్మ రచించింది. ఈ యక్షగానంలో 'ఆండాళ్' చరిత్ర ప్రధానమైనా ఆళ్వారుల చరిత్రలు కూడా కన్పిస్తాయి. గోదాదేవి పెండ్లి వేడుకల పాటలు ఈ యక్షగానంలోని ప్రత్యేక అంశాలు.

తెలుగులో ప్రత్యేకించి తిరుమంగ ఆళ్వారు చరిత్ర కావ్యాలు లేవు. కానీ రెండు యక్షగానాలు మాత్రం కన్పిస్తున్నాయి. మొదటిది కోవెల తిరువెంగడదాసుది, రెండవది పరాశరం శేషాచార్యులది. కోవెల తిరువేంగడదాసు తన యక్షగానాన్ని కవి మంగళగిరి నరసింహ స్వామికి అంకితమిచ్చాడు. ఇతని కాలం 1800-1850 మధ్య వుండవచ్చని ఆచార్య ఎస్వీ జోగారావు గారి అభిప్రాయం. ఈ రెండు యక్షగానాల్లో గోదాదేవి చరిత్ర విపులంగా వర్ణితమైంది.

ఈ విధంగా వైష్ణవాంధ్ర సాహిత్యంలో గోదాదేవి, విప్రనారాయణులు ఒక విశిష్ఠ స్థానాన్ని అధిరోహించారు. తెలుగు కవులకు వీరిరువురే ప్రీతిపాత్రులైనారని చెప్పవచ్చు.

ఆచార్య బిరుదురాజు రామరాజు తన తెలుగు జానపద గేయ సాహిత్యమనే సిద్ధాంత గ్రంథంలో శ్రీ ఆండాళ్ చరిత్రను ఉదహరించారు. ఇతర ఆళ్వారుల ప్రసక్తి ఏమాత్రం కనిపించదు. శ్రీ ఆండాళ్ చరిత్రం తోహరా రూపకంలో 600 పంక్తుల గ్రంథం. ఈ గ్రంథకర్త రంగాచార్యులు అని రామరాజు తెలిపారు. ఈ గ్రంథంలో భూదేవి ఆండాళ్‌గా, గరుడాళ్వారు పెరియాళ్వారుగా అవతరించడం, 108 దివ్య తిరుపతుల నామాల శ్రీరంగ మహత్యం, ఆండాళ్ తిరుమొళి సారాంశం, శ్రీరంగనాయకుల కళ్యాణ విభవం మొదలైనవి వున్నాయి. తెలుగులో ప్రసిద్ధమైన రాయల ఆముక్తమాల్యదను రంగాచార్యులు పాటరూపంలో పలికారు.

జానపద వాఙ్మయంలో వైష్ణవ సంబంధ గేయాలు తెలంగాణాలోనే ఎక్కువగా కన్పిస్తాయి. మహబూబ్ నగర్, ఆదిలాబాద్, ఓరుగల్లు మండలాలలో ఎక్కువ. గ్రామాధికారులైన రెడ్లు, వెలమలు, గోలుకొండ వ్యాపారులు అధికంగా వైష్ణవులు కావడమే దీనికి కారణంగా చెప్పవచ్చు.

## ఆధునికయుగంలో ఆళ్వారులు

20వ శతాబ్దంలో వెలువడిన ఆళ్వారుల వాఙ్మయాన్ని ఐదు రకాలుగా విమర్శకులు వర్గీకరించారు. మొదటిది పద్య, గద్య, గేయ నాటకాలు, అనువాదాలు. శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యులు 'గోదావైభవం' పద్యకావ్యంగా రచించారు. భాగవత దశమస్కంధ పారాయణంతో ముగ్ధులై ఈ కావ్యం వ్రాసినట్లు ఆయన తన పీఠికలో తెలియజేశారు. గోదా కళ్యాణం వ్రాసినవారిలో మరొకరు శ్రీ పీసపాటి రంగాచార్యులు. వీరు గోదా కళ్యాణంతో పాటు తిరుప్పావైను అనువదించారు. ఆళ్వారుల పట్ల తనభక్తి ప్రపత్తుల్ని క్రింది విధంగా ప్రకటించుకొన్నారు.

"పన్నిద్ధరాళువారుల
సన్నిధులన్మనమునందు సాష్టాంగముగా
పెన్నిధులని సేవింతును
పన్నగశయనుని పవిత్ర పదముల గొల్తున్"

గోదాదేవి కథను గేయకావ్యంగా తీర్చిదిద్దినవారు శ్రీ దివి రంగాచార్యులు. ఈ గ్రంథం మంజరీ ద్విపదలో వ్రాయబడింది.

రెండవది తెలుగు లిపిలో సంస్కృత ద్రావిడ భాషల్లోని ఆళ్వారుల చరిత్రలకు సంబంధించిన గ్రంథాల్ని ముద్రించడం. ప్రతివాది భయంకర

అణ్ణంగరాచార్య స్వాములవారు శ్రీనివాసాచార్యులతో కలిసి గరుడవాహన పండితుడు రచించిన దివ్యసూరి చరిత్రాన్ని ముద్రించాడు. అలాగే మణవాళ పెరుమాళ్ నాయనార్ రచించిన ఆచార్య హృదయాన్ని 1972లో ప్రకటించారు. భాష తమిళమైనా తెలుగు లిపిలో ముద్రించడం ఈ గ్రంథం ప్రత్యేకత.

ఇక మూడవది నాలాయిర దివ్య ప్రబంధాలకు టీకా తాత్పర్య భావ వివరణలు సమకూర్చడం. ఈ ప్రయత్నం చేసిన పెద్ద సంస్థలలో తిరుమల తిరుపతి దేవస్థానం, శ్రీరామానుజకీర్తి కౌముది గ్రంథమాల (గుంటూరు), శ్రీ గోదా గ్రంథమాల (ముసునూరు)లు ప్రసిద్ధాలు.

ఇంకా నాల్గవది తెలుగులో ఆళ్వారుల వాఙ్మయ వైశిష్ట్యం గురించి నిరూపించే పరిచయ విమర్శ గ్రంథాలు. ఈవిధంగా కృషి చేసినవారు టి. లక్ష్మణాచార్యులు, ధనకుధరం వరదాచార్యులు. వరదాచార్యులు రచించిన 'ఆళ్వారులు-దివ్యప్రబంధాలు' ఆళ్వారుల వాఙ్మయానికొక ఉపయుక్త గ్రంథం. ఇవేకాక శ్రీరామానుజాదాసులు రచించిన దివ్యసూరి కథాసారం, మొవ్వ శ్రీనివాస పెరుమాళ్ రచించిన దివ్యసూరి హృదయం, ఆచార్య పురుషుల చరిత్రలు ప్రసిద్ధాలు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఆళ్వారుల దివ్యవైభవం అనే పుస్తకాన్ని ప్రచురించారు. తిరువాయి పాటి రాఘవయ్య ఈ గ్రంథ రచయిత.

ఇక ఐదవది శ్రీ వేంకటేశ్వర స్వామిపై ఆళ్వారులు పాడిన పాశురాల ప్రచురణ.

శైవసాహిత్యంలాగే ఆళ్వారుల సాహిత్యం కూడా విశిష్టమైందని చెప్పవచ్చు. అయితే మత, ప్రాంత, భాషాభేదాల్ని విస్మరించి ఈ ఆళ్వారుల సాహిత్యాన్ని సమగ్రంగా పరిశీలించి, అధ్యయనం చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది. సంస్కృత, ద్రావిడ భాషల్లోని ఆళ్వారుల వాఙ్మయాన్ని తెలుగులో అనువదించి ఈ సాహిత్య మాధుర్యాన్ని అందించాల్సిన బాధ్యత తిరుమల తిరుపతి దేవస్థానం లాంటి ధార్మిక సంస్థలు బాధ్యతగా స్వీకరించాల్సి వుందని ఆచార్య సర్వోత్తమరావుగారి అభిప్రాయం.

ఈ విధంగా పరిశీలిస్తే వీరశైవులు, వీరవైష్ణవులు - వీరిరువురిలోనూ వున్న ముగ్ధభక్తులు, వారి భక్తి ప్రపత్తులు సమకాలీన సమాజాన్ని విశేషంగా ప్రభావితం చేశాయని చెప్పవచ్చు. వీరి భక్తి నిర్మల, నిశ్చల, నిష్కల్మషమైనదని చెప్పవచ్చు. వీరి గాథలవల్ల ప్రజల్లో అచంచల భక్తి విశ్వాసాలు పెంపొందాయని చెప్పవచ్చు.

# బసవపురాణ విశిష్టత

పాల్కురికి సోమనాధుడు రచించిన ద్విపద కావ్యాల్లో బసవపురాణం, పండితారాధ్య చరిత్రలు పేరెన్నికగన్నవి. ఈ రెండింటిలోను శైవ భక్తుల ప్రశంసవుంది. బసవ పురాణంలోని ప్రధాన ఇతివృత్తం బసవేశ్వరుని జీవిత మహత్యం.

పాల్కురికి సోమనాధుడు కావ్యరచనకు పూనుకొన్నపుడు శివకవులకు మత ప్రచారమే ధ్యేయమై కర్మమార్గం, వైదిక మత సిద్ధాంతాలలో నిరసనభావం కలిగిందని చెప్పవచ్చు. వీరిది వీరశైవమతం. దీనిలో జాతి, మతభేదాలు లేవు. అందరూ సమానులే. కలిమి లేములు కూడా వీరి మతంలో లేవు. కేవలం శివభక్తులైతే చాలు. మంత్ర తంత్రాలతో, చదువు సంధ్యలతో వీరికి పనిలేదు. సంఘంలో వుండే దురాచారాన్ని నిర్మూలించి సమానత్వ ప్రతిపాదనకై కంకణ బద్ధులైనవారని చెపుతారు. అందుకే వీరశైవులుగా ఖ్యాతి గడించారు. ఈ విషయాలన్నీ ధృష్టిలో వుంచుకునే వీరు రచనల్ని కొనసాగించారు. శివభక్తుల మహిమలు, భక్తి ప్రభావం ఎంతో గాఢంగా వీరి మనస్సుల్లో ప్రతిపాదింపబడ్డాయి.

సోమనాధునికి ముందు కాలంలో సాహిత్య సృష్టికి మతాన్ని ఆధారంగా చేసుకొన్నవాడు మల్లికార్జున పండితుడు. ఇతనికి పూర్వుడుగా చెప్పబడుతున్న నన్నెచోడుడు కూడా తన 'కుమార సంభవం'లో శైవమత సిద్ధాంతాల విశేషాల్ని గూర్చి చెప్పి వున్నాడు. అయితే అప్పటికి బసవేశ్వరుడు ఉద్భవించి వీరశైవ సిద్ధాంతాల్ని ప్రతిపాదించి వుండకపోవడం వల్ల ఇటు తెలుగు దేశంలో గాని, అటు కన్నడ దేశంలో గాని వీరశైవమనే ఒక మతం ప్రాదుర్భావం చెంది వుండలేదని చెప్పవచ్చు. ఈ కారణం వల్లనే నన్నెచోడుని కావ్యాన బసవని మతం కలదని చెప్పడం సమంజసం కాదని చెప్పవచ్చు. మల్లికార్జున పండితారాధ్యుని బసవేశ్వరునికి సమకాలికునిగా చరిత్రకారులు నిర్ణయించి వుండడంచేత బసవేశ్వరుడు కర్నాటక దేశంలో ఉద్యమించుచున్న విషయాల్ని చూడకపోయినా సమగ్రంగా వినివుండవచ్చు. వాటిచేత ప్రభావితమై వుండవచ్చు. ఈ ప్రభావం చేత తెలుగు దేశంలో మత ప్రచారం చేసి, గ్రంథాల్ని రచించి, వీరశైవానికే తన జీవితాన్ని అంకితం చేశాడని చెప్పవచ్చు.

పాల్కురికి సోమనాధుని మార్గం విశిష్టమైందని చెపుతారు. ఈ కవి రంగ ప్రవేశం చేసేకాలం నాటికి తెలుగుదేశంలో పండితత్రయం, కన్నడ

దేశంలో బసవేశ్వరుడు శైవమత ప్రచారం చేసి లింగైక్యం చెందినట్లుగా కొందరు విమర్శకుల అభిప్రాయం. ఆ విధంగా శైవ సిద్ధాంత మొక స్వరూపాన్ని పొందింది, స్వభావనిష్టమైంది. లోకంలో ఖ్యాతి గడించింది అధిక సంఖ్యాకులు స్త్రీ, పురుష, జాతి, కుల వివక్షత లేకుండా కర్నాటాంధ్ర దేశాల్లో ఈ మతాన్ని నిత్యజీవిత విధానంగా అవలంబిస్తుండేవారు. ఇంతటి స్వరూప, స్వభావ లక్షణాల్ని కలిగిన మతాన్ని కేవలం పామరుల్లోనే కాక అక్షరాస్యుల్లో కూడా సాంస్కృతిక సాహిత్య పరిణతి కలిగిన వారిలో కూడా ప్రచారం చేయాలనే అభిప్రాయం పాల్కురికి సోమనాధునికి కలిగినట్లుగా చెపుతారు. ప్రచారానికి ఉత్తమమైన సాధనం సాహిత్యమనే విషయాన్ని సోమన గుర్తించాడు. బసవేశ్వరుడు, పండితుడు, సాహిత్యాన్ని తమ ప్రచార సాధనంగా గ్రహించిన మాట నిజమే అయినప్పటికీ, ఆ సాధనానికి పరిపూర్ణశక్తిని నూటికి నూరుపాళ్ళు వినియోగించుకొన్నవాడే సోమనాధుడని చెప్పవచ్చు.

సోమనాధుడు సాహిత్య నిర్మాణానికి పూనుకొనే సమయానికి తెలుగు దేశంలోని పండితుడు, కన్నడ దేశంలోని బసవేశ్వరుడు మరణించారని విమర్శకులు చెపుతారు. వీరశైవ మతాన్ననుసరించేవారు. వీరిరువురినీ మహోన్నత పురుషులుగా భావించి గౌరవిస్తుండేవారు. వీరిని గురించిన కథలు, గాథలు, మహిమలు, మత సాహిత్య పాండిత్యాలు, లోకంలో ఖ్యాతి గడించి యుండేవి. బహుశా సోమనాధుడు ఈ విశేషాల్ని విని వుండవచ్చు. వీటి ప్రభావానికి లోనై వుండవచ్చు. ఆ వ్యక్తిత్వాల గొప్పతనాన్ని స్వీకరించి లోకానికి ప్రకటించడానికి పూనుకొన్నాడు. ఈ పని చేయవలెనంటే సాహిత్యమే ఉత్తమ సాధనమని భావించాడు. అందువల్లనే ఒక కావ్యానికి బసవేశ్వరుని నాయకునిగా చేశాడు, మరో కావ్యానికి పండితుని ప్రధానపాత్రగా తీర్చిదిద్దాడు. బసవేశ్వరుడు నాయకునిగా వెలసిన కావ్యం బసవపురాణం. పండితుడు నాయకునిగా ఉద్భవించిన కావ్యం పండితారాధ్య చరిత్ర. ఈ రెండు వ్యక్తిత్వాలకు సోమనాధుడు చారిత్రక ప్రాధాన్యంతోపాటు పౌరాణిక ప్రాధాన్యాన్ని కూడా సంతరించాడు. సోమనాధుని సాహిత్య దృష్టి ఉన్నతమైందని చెపుతారు. సోమన కన్నడంలో, సంస్కృతంలో రచనలు చేయడమే కాకుండా తెలుగులో కొన్ని అమూల్య గ్రంథాలు రచించి వీరశైవ మార్గాన్ని ప్రచారం చేయడానికి పూనుకొన్నాడు.

సోమన కృతులలో రెండవదియైన బసవపురాణం వీరశైవ సిద్ధాంతాలకు ప్రతీక అని చెప్పవచ్చు. ఇది ద్విపద వాఙ్మయంలో ఖ్యాతి గడించిన కృతి. ఇందులో సోమనాధుడు చెప్పిన బసవపురాణ కథానాయకుడైన బసవేశ్వరుని

చరిత్ర తెలుగు వాఙ్మయ చరిత్రలో అజరామరంగా నిలిచిందని చెప్పవచ్చు. సోమనాథుడు కేవలం కవి మాత్రమే కాడు. కవిత్వాన్నాధారంగా చేసుకొని వీరశైవ మత వ్యాప్తికి కంకణ బద్ధుడైన అసమాన మేధాశాలి అని చెప్పవచ్చు. అప్పటికే లోకంలో వ్యాపించి వున్న బౌద్ధ, జైన, వైష్ణవాది మతాల్ని శంకరాచార్యుని అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిఘటించి, వాటికి ధీటైన పాండిత్యాన్నంతా సంపాదించుకోగలిగాడని చెపుతారు. ఆ పాండిత్యాన్నంతా తన గ్రంథాల్లో ఉపయోగించాడు. ఇందువల్ల జన బాహుళ్యంలో శాస్త్రీయంగా వీరశైవ సిద్ధాంతం స్థాపిత మవుతుందే తప్ప జన సామాన్యంలోకి ధారాళంగా వ్యాపించాలంటే విద్వాంసుడో, పండితుడో అయినంత మాత్రాన సరిపోదు. ఈ సిద్ధాంతాన్ని అనుష్ఠించి, ఆచరణలో పెట్టి, లోకానికి లక్ష్యప్రాయుడై నటువంటి వ్యక్తి అవసరం. తనలాగే ఇతరులుకూడా అనుష్ఠించాలనే అభిప్రాయం కలుగజేయాలి. వారిలో ఉత్సాహాన్నే కాకుండా ఆవేశాన్ని కూడా రంగరించగలగాలి. ఆవేశాన్ని ప్రకోపించడానికి దేశభాషలో, దేశీయ ఛందస్సులో, దేశీయ రీతిలో కవిత్వం చెప్పడం కంటే మరొక మార్గం లేదనే విషయం తెలిసినవాడై వుండాలి. ఈ గుణాలన్నీ సోమనాథునిలో పరిపూర్ణంగా వున్నాయని చెప్పవచ్చు. ఇతని పాండిత్యం నిరుపమానమైందని చెపుతారు. అందువల్లనే సోమన ప్రజల హృదయాల్లో చిరస్థాయిగా తన రచనల ద్వారా నిలిచాడని చెప్పవచ్చు.

పాల్కురికి సోమనాథుని బసవపురాణంలోని కథలన్నీ వీరశైవ భక్తికి ప్రభావితమైనవేనని చెప్పవచ్చు. సోమనాథుని తొలి కృతులలో నామమాత్రంగా వున్న వీరశైవ సిద్ధాంతం బసవపురాణ, పండితారాధ్య చరిత్రలలో పరాకాష్ఠనందుకొన్నది. ఆ మతాన్ననుసరించే వారికి ఆదర్శప్రాయంగా నిలిచిందని చెప్పవచ్చు. పరమత ఖండనకై సోమనాథుడు అవలంబించిన పద్ధతిలో ఒక విశిష్టత వుంది. ముందుగా ఒక వాదాన్ని తీసుకొని, దాని స్వరూపాన్ని ముందుగా తెలిపి, తర్వాత వేదవాక్యాల్ని ఉదహరించి, ఆ వాక్యాలకా వాదమెలా విరుద్ధంగా వుందో స్పష్టంచేసి, తర్వాత పురాణేతి హాసాల నుంచి ఐతిహ్యాల్ని సంధించి తన విశిష్టతను చాటుతాడని విమర్శకులు చెబుతారు. వీరశైవ సిద్ధాంతమే సరైన సిద్ధాంతమని సంపూర్ణ విశ్వాసముండడం వల్ల ఈ సిద్ధాంత రూపకల్పనలో ఇతనికి ఎక్కడలేని వాగ్ధాటి కలిగింది. ఎదుటి పక్షం వారిని అసలు లెక్కలోకి తీసుకోడు. వాద ప్రకరణంలో ఒక్కొక్క వాదాన్ని గ్రహించి, వాటిని ఖండించి, చివరకు శివపర మాహాత్మ్యమత్వాన్ని సిద్ధాంతించి, అదే సరైన సిద్ధాంతమని రుజువు చేసేవాడని చెప్పవచ్చు.

పాల్కురికి సోమనాధుడు వీరశైవ మతాన్ని ప్రతిపాదించడానికి, ప్రచారం చేయడానికి సాహిత్య ప్రక్రియల్ని ఏ విధంగా సాధనాలుగా చేసుకొనివుండెనో, అదేవిధంగా 'దేశి' కవితను కూడా ఒక సాధనంగా చేసుకొన్నాడని చెప్పవచ్చు. ద్విపద, కందం, సీసం మొదలైన దేశీయ ఛందస్సుల్ని సోమనాధుడు విశేషంగా అభిమానించాడు. మహా కావ్యమైన బసవపురాణం ద్విపదలో నిబద్ధమైన గ్రంథం.

సోమన ప్రారంభించిన దేశి కవిత తెలుగులో ఒక సంప్రదాయంగా, ఒక సాహిత్య విశేషంగా నిలిచిపోయింది. సోమన తర్వాత చాలాకాలం వరకు తెలుగు కవులలో కొందరు ఈ దేశి కవితా సంప్రదాయాన్ననుసరించిన వారు కన్పిస్తారు. సోమనాధుని లాగానే ఈ కవులకు కూడా శైవమతాభినివేశం వుండింది. అంటే మత, సాహిత్య సంప్రదాయాలు రెండింటిలోను ఈ కవులు సోమనాధునికి అనుయాయులేనని చెప్పడం సమంజసం.

సోమన జానుతెనుగు పేరుతో సమ సంస్కృతోక్తులతో రచన సాగించాడు. 'దేశి' నుడికారాన్ని సంపూర్ణంగా అవలంబించి, తెనుగు తీయదనానికి లోనై, 'జాతులు రీతులు నేతులుట్టంగ' అని రచించాడు. కేవలం దేశీయ పదాల్ని ఉపయోగిస్తూ, వాటివలన కవిత్వం నీరసించకుండా, మధ్యమధ్య సందర్భానుసారంగా దీర్ఘసమాసాల్ని గుప్పించడం సోమన రచనల్లో కన్పించే విశేషాంశంగా చెప్పవచ్చు.

సోమనాధుని వైదుష్యం, లోకజ్ఞానం బసవపురాణంలో అనేక విధాలుగా ప్రస్ఫుటితాలైనాయి. హఠయోగం, రసవాదం, నేత్రవైద్యం, సర్పవైద్యం, ద్యూత విద్య, శకున శాస్త్రం, వేశ్యావర్ణనం, కామశాస్త్రం, చోరవిద్య, మృగయ, గర్భచిహ్నాలు, పిల్లల్ని పెంచే విధానం, పిల్లల్ని లాలించే విధానం, పిల్లల ఆటలు, శరీరావయవ కర్మలు, వస్త్రభేధాలు, ఈ విషయాలను గురించి సోమన విస్తరించి చెప్పాడు.

## ఇతివృత్తం

బసవపురాణంలో ఏడు ఆశ్వాసాలున్నాయి. వీటిలో బసవని జీవిత చరిత్రతో పాటు శివ మహిమల్ని తెలియజేసే అనేక కథల్ని సోమనాధుడు చెప్పాడు. బసవడు, మాదమాంబ, మండంగి మాదరాజులకు జన్మించిన వృత్తాంతమంతా మొదటి ఆశ్వాసంలో వర్ణించాడు. బసవనిభక్తి, ఉపనయన నిరాకరణ, కూడలి సంగమ క్షేత్రానికి వెళ్ళడం, బిజ్జలుని వద్ద మంత్రి పదవి చేపట్టడం, పలువురు భక్తులకు ఆశ్రయమివ్వడం, మిగిలిన భక్తులు వీరశైవమతాన్ని అవలంబించి శివభక్తికి పాత్రులైన విధం, జొన్నలరాశి

ముత్యాలుగా మారడం, వంకాయలు లింగకాయలుగా మారడం మొదలైన వింతలన్నీ ద్వితీయాశ్వాసంలో వున్నాయి. ఇంకా కొన్ని కథలు కూడా వున్నాయి. తృతీయాశ్వాసంలో ముగ్ధ సంగయకథ వుంది. చతుర్థాశ్వాసంలో సిరియాలుని కథవుంది. తర్వాతి ఆశ్వాసాలలో శైవమహత్యం, భక్తులు తరించిన విధం వర్ణింపబడ్డాయి. సోమనాథుడీ ఆశ్వాసాలన్నిటిలోనూ ప్రతిపాదించిన వీరశైవమహత్యం బలవంతరమైంది.

## కవితాగుణాలు

సోమనాథుడు తన రచనలో శబ్దాలంకారాల పట్ల అధికంగా ఆసక్తిని ప్రదర్శించినప్పటికీ, వీరశైవ మతాభినివేశాన్ని వ్యక్తీకరించడం పట్ల, భక్తి పారవశ్యాన్ని అభివర్ణించడం పట్ల సోమన ఆవేశ పూరితమైన రచన సాగించాడు. సోమన అష్టభాషా పండితుడు. మణి ప్రవాళ శైలిని తెలుగులో ప్రవేశ పెట్టినది సోమనాథుడే. దాదాపుగా సోమనాథుని గ్రంథాలన్నీ శైవ మత నిరూపణకై ఉద్దేశింపబడినవే. వాటిని పండిత లోకంచే ఆమోదింపజేయడానికి సోమన అధికంగా శ్రమించాడు. సోమన ఏ విషయం గురించి తెలియజేసినా వేదాలు, ఉపనిషత్తులు, ఆగమాలు, పురాణాలు దృష్టిలో వుంచుకుని చెప్పినట్లే కనిపిస్తుంది.

సోమనాథుని నవీన గుణాల్ని డా. చిలుకూరి నారాయణరావుగారు తన పండితారాధ్య చరిత్ర పీఠికలో క్రింది విధంగా వివరించియున్నారు.

"సోమనాథునికి పూర్వం శైవ కావ్యాలున్నప్పటికీ, వాటికి సోమనాథుని కావ్యాలకు పోలిక లేదు. కథా వస్తువులో క్రొత్తదనం సోమన ప్రత్యేకత. అనేకాలైన విడివిడి భక్త మహత్మ్య కథల్ని ఒకచోట చేర్చి, అవన్నీ ప్రత్యేక కథలు కానట్లు కావ్య స్వరూపాన్ని కల్పించడం, తనకు వున్న ప్రత్యేక విద్యలను గురించిన జ్ఞానాన్ని విస్తరించి చెప్పినా, పాండిత్య ప్రకటన కోసం ఇలా చేయుచున్నాడనే భావం చదువరులకు కలుగనివ్వక పోవడం, వేద, వేదాంగ, స్మృతి, పురాణేతిహాసాలు నుంచి వాక్యాలను ఉన్నది ఉన్నట్లుగా ఉదహరించినా అవి ఉద్ధృత వాక్యాలనే జ్ఞానం కల్పించక తన కవితాధారలో వాటిని లయం చేయడం, వేదశాఖలు, పురాణాలు, ఉపనిషత్తుల పేళ్లు, రాగాలు, అభినయ భేదాల పేళ్లు, పత్తిరి, పండ్లు, కాయలు, పుష్పముల పేళ్లు, మనుష్యుల పేళ్లు ఈ రీతిగా విసుగెత్తించకుండా ద్విపదల్ని సాగించడం, చెప్పిన విషయాన్నే మళ్ళీ చెపుతున్నా అది పునరుక్తిగా తోచకుండా చెప్పడం, తనకు పూర్వం కేవలం పాటలకు, పదాలకు మాత్రం ఉపకరించు ద్విపద

ఛందస్సును, మహాకావ్యోపయోగిగా తీర్చిదిద్దడం, ద్విపదల్లోని మాత్రాగణాల్ని సులువుగా వుపయోగించుకొని, ఆయా మనోవస్థలకు అనుకూలపడునట్లు వాటిని సవరించడం, అంతకు పూర్వం సంస్కృత భూయిష్ఠంగా వుండే ఆంధ్ర కావ్యరచనల్ని నిరసించి జాను తెనుగు పేరుతో సమ సంస్కృతోక్తులతో రచన సాగించడం, దేశినుడికారాన్ని సంపూర్ణంగా అవలంబించి తెనుగు తీయదనానికి లోనై 'జాతులు రీతులు నేతులుట్టంగ' అని రచించడం, కేవల దేశీయ పదాల్ని ఉపయోగిస్తూ వానివల్ల కవిత్వం పేలవం కాకుండా మధ్య మధ్య సందర్భాన్ననుసరించి దీర్ఘ సంస్కృత సమాసాల్ని గుప్పించడం, ప్రాచీన కావ్యలక్షణ మీద దృష్టిని విడువకుండా ఇటూ, అటూ పరుగులెత్తి మళ్ళీ స్థాయికి రావడం, అనుప్రాసం మొదలైన శబ్దాలంకారాల్ని బలవంతంగా తెచ్చిపెట్టకుండా ఉత్సాహం, ఆవేశం, భావప్రవాహం, సిద్ధాంతస్థాపనం, మొదలైన సందర్భాలలో ఇక్కడ ఈ అలంకారం కలదని తోచనీయకుండానే పాఠకుని తన కవితా ప్రవాహంలోకి లాగడం, ఉపమాద్యర్థాలంకారాల్ని సహజంగా వుండవలసిన చోట్ల ఉపయోగించి మనసుకు ఆనందాన్ని చేకూర్చడం, ఉపమానాల్ని కుప్పలు తిప్పలుగా గుప్పించి పాఠకునికి ఊపిరి తిరగకుండా చేయడం, సంపూర్ణా సంపూర్ణ క్రియాపదాల్ని విధివిరామాలు లేక గ్రుక్కతిరగకుండా ఒకదాని వెంట ఒకదానిని గుండ్ల బారులవలె ప్రయోగించడం, ఆమ్రేడితోక్తుల చేత భావానికందం తీసుకొని రావడం, కావ్యలక్షణానికి తాను వశుడుకాక, లక్షణాన్ని సంపూర్ణంగా తనవశంలో వుంచుకోవడం, ద్విపదలను మహావేగంగా నడిపించుట, వీరశైవేతరుల కపరిచితమైన శైవభక్తుల కథలు మొదలైన వాటిని వారికి పరిచితమైనట్లు చేయడం, వీరశైవేతర పాఠకునికి ఇతర సమయాల్లో వెగటుగాతోచే విషయాలైనా, తన కవితా నైపుణ్యం చేత హితవుగా వున్నట్లు తలపింపజేయడం, సందర్భాన్ననుసరించి భాష పోకడల్ని మార్చి వేయడం" - ఈ విధంగా పాల్కురికి సోమనాథుని కవితలోని నూత్న సంగతిని చిలుకూరి నారాయణరావుగారు వివరించి చెప్పారు.

# పురాణ లక్షణాలు

## పురాణాలు

వేద వాఙ్మయంవలెనే పురాణ వాఙ్మయం కూడా ప్రాచీన భారతీయ సంస్కృతికి పట్టుగొమ్మ అని చెప్పవచ్చు. భారతానికి పంచమ వేదమని పేరున్న విధంగానే పురాణ సముదాయానికి పంచమ వేదమని పేరుంది. దీనిని బట్టి వేదాల సారమంతా తర్వాతి కాలంలో పురాణ రూపంలో ప్రవచింపబడిందని చెప్పవచ్చు కొంతకాలం క్రితంవరకు పురాణాల్లో ప్రతిపాదితమైన విషయమంతా పుక్కిటి పురాణమని, దానికెట్టి చారిత్రక ప్రాధాన్యమీయబడలేదని ఒక అభిప్రాయం ప్రబలివుండేది. కాని ఇటీవలి పరిశోధనల వల్ల పురాణాల విలువ, ప్రాధాన్యం వెలుగులోకి రావడంతో ప్రాచీన భారతీయ చరిత్ర నిర్మాణానికి పురాణాలు అవశ్య సాధనాలని తెలుస్తుంది.

ప్రాచీన భారత దేశంలోని రాజకీయ, మత, సాంఘిక, తత్వ, కళాసంస్కృతి చరిత్రలను తెలుసుకోవడానికి పురాణాలకు మించిన ప్రశస్తమైన సాధనం ఇంకొకటి లేదని చెప్పవచ్చు. పురాణాల్లో వున్న వంశాను చరితాలు చారిత్రకులకెన్నో విధాలా తోడ్పడతాయని చెప్పవచ్చు. ప్రాచీన భారతదేశ చరిత్రకారుల పురాణోక్త విషయాల్ని పురావస్తు శాసన పరిశోధనల దృష్టితో పరిశీలించి అవి చాలావరకు సరైనవేనని అంగీకరించి వున్నారు. పూర్వరాజ వంశాల చరిత్ర సుమారు పన్నెండు పురాణాల్లో చెప్పబడివుంది. మౌర్యవంశం గురించి విష్ణుపురాణంలో, ఆదిమగుప్తరాజుల గూర్చి వాయుపురాణంలో చెప్పబడిన విషయం పరిశోధకులందరి ఆమోదం పొందినదని చెప్పవచ్చు. ఈ విధంగా పరిశీలిస్తే ప్రాచీన భారతదేశ యదార్థ చరిత్ర నిర్మాణానికి పురాణ వాఙ్మయం ఎంత అమూల్యమైన సాధనమో చెప్పవలసిన అవసరం లేదు.

సంస్కృతంలో 18 మహాపురాణాలు, 18 ఉప పురాణాలున్నాయని సంప్రదాయాన్ని బట్టి తెలుస్తోంది. వీటిలో మహాపురాణాలకంటే ఉప పురాణాలే అర్వాచీనాలైనవి. అవి వివిధ మతశాఖలతోటి సంబంధాన్ని, స్థానిక ప్రాధాన్యాన్ని కలిగినట్టివని చెప్పవచ్చు. మహాపురాణాలు 18 అని, శివ, విష్ణు, దేవీ సంబంధాన్ని బట్టి మూడు విభాగాలుగా విభజించవచ్చు. అన్ని పురాణాల్లోనూ పై ముగ్గురు దేవతలకు సంబంధించిన వృత్తాంతాలుండడం వల్ల ఈ విభజనం

కేవలం ప్రాధాన్యవ్యపదేశాన్ని బట్టి చేయబడింది. కాని కొన్ని పురాణాలు, శివునకో, విష్ణువుకో, అధిక ప్రాధాన్యమీయడం వల్ల అవి ఆ దేవతకే సంబంధించినవనే భావన కలుగుట సహజం. అది నిజంగా భావనే అని చెప్పవచ్చు, ఒక్కొక్క పురాణంలో ఒక్కొక్క దేవత ప్రధానంగా స్తుతింప బడినప్పటికీ పురాణం ఇతర దేవతలనుపేక్షించుట కాని, నిరసించుట కాని కనిపించదు. ప్రతి పురాణంలోను పురాణాలు 18 అనే విషయం చెప్పబడింది. దీనిని బట్టి అన్ని పురాణాలు ఒకే కాలాన, ఒకే ప్రదేశాన రచింపబడ్డాయని, అందువల్లే ప్రతి పురాణంలోను పురాణాలు 18 అని పేర్కొనడం జరిగిందనే తలంపుకు అవకాశం కలిగిందని భావించరాదని చెప్పవచ్చు. ఈ 18 సంఖ్య అవి వెలువడిన ప్రదేశాల వైవిధ్యాన్ని బట్టి కలిగి వుండవచ్చు, సాధారణంగా దేశంలోని ముఖ్య మత కేంద్రాలనుంచి వేర్వేరుగా వెలువడి వుండవచ్చు. ముఖ్యమైన యాత్రాస్థలాలకు ఆ రోజుల్లో అధిక సంఖ్యాకులైన ప్రజలు వస్తుండడంతో ఆ ప్రదేశాలే పురాణాల ప్రచారాల కనువైన స్థలాలుగా భావింపబడుతుండేవి. ఆయా పురాణాల్లో కన్పించు ఆయా యాత్రాస్థలాల వర్ణన విస్తృతిని బట్టి ఆయా స్థలాల్లో ఆయా పురాణాలవతరించాయని ఊహించవచ్చు. ఉదాహరణకు గయ మహత్యం విస్తృతంగా చెప్పబడిన పురాణం గయనుండి వెలువడి వుండవచ్చునని, కాశీ మహత్యం విస్తృతంగా చెప్పబడిన పురాణం కాశీనుండి వెలువడి వుండవచ్చునని భావించవచ్చు. ఇదేవిధంగా ఇతర పురాణాల వతరించిన స్థలాల్ని కూడా ఊహించవచ్చు.

"యస్మాత్ పురాహి అనతి ఇదం పురాణ"మ్మని వాయుపురాణం (అధ్యాయం 1-203 పేజీ)లో పురాణ శబ్దం నిర్వచింపబడి వుంది. అతి ప్రాచీన కాలం నుంచి జీవించి వచ్చుచుండడం వల్ల పురాణానికి ఆ పేరు కలిగిందని భావం. దీనినిబట్టి లిఖిత రూపాన్ని పొందడానికి పూర్వం అతి ప్రాచీనకాలం నుంచి పురాణ శబ్దం వాడుకలో వుండేదని చెప్పవచ్చు.

"ప్రథమం సర్వశాస్త్రాణం పురాణం బ్రహ్మణా స్మృతం, అనంతరంచ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిస్సృతాః" అనే వాయుపురాణం (అధ్యాయం 1-60వ పేజీ) లోని శ్లోకం బ్రహ్మచే ప్రప్రథమంగా పురాణం స్మరింపబడిందని, తర్వాత అతని ముఖం నుంచి వేదాలు వెలువడ్డాయని చెబుతుంది. దీనినిబట్టి మొట్టమొదట ఒకే పురాణ ముండిందని, అది వేదాలకంటే కూడా ప్రాచీన తరమైందని చెప్పవచ్చు. వేదగతాలైన ఇతిహాసాల్ని పరిశీలించి చూస్తే అవి అంతకుముందే ప్రచారంలో వుండి, వేదాలు రూపొంది అప్పుడు ఉదహరించబడ్డాయని ఊహించుట కవకాశమేర్పడింది. దీనినిబట్టి వేదాలకు

మునుపే పురాణాలు రచింపబడినదని చెప్పలేక పోయినప్పటికీ, వాటిలో కథ, ఇతిహాసాలు మాత్రం అతి పురాణ కాలంలోనే ప్రచారంలో వుండి, అప్పటినుంచి అవిచ్ఛిన్నంగా సాగివచ్చుచుండేవని చెప్పవచ్చు.

పురాణోత్పత్తిని గూర్చి విష్ణుపురాణంలో వేరొక విధంగా చెప్పబడి వుంది. దీనినిబట్టి పురాణోత్పత్తికి బీజాలు వేదాల్లోనే కన్పిస్తున్నాయని చెప్పవచ్చు. అందలి కథ, ఇతిహాసం, ప్రార్థన, పూజావిధానాలు పురాణ రచయితలకు సర్గప్రతిసర్గ భాగాల్ని కూర్చడంలో అనేక విధాల తోడ్పడి వుండవచ్చు. ఈ భాగాలకు ప్రపంచోత్పత్తికి చాలా సన్నిహితమైన సంబంధముందని చెప్పవచ్చు. ఋగ్వేదంలోని విశ్వోత్పత్తికి సంబంధించిన ఋక్కులననుసరించే అవి ప్రవచింపబడ్డాయని, అందుచేతనే మాక్డొనల్ ఋగ్వేదంలోని విశ్వోత్పత్తికి సంబంధించిన ఋక్కులు భారతీయ తత్వ శాస్త్రానికే కాక పురాణాలకు కూడా బీజాలుగా చెప్పి వున్నాడు.[1] వేదాల్లోని ఋక్కులే కాకుండా బ్రాహ్మణాల్లోని కథ, ఇతిహాసాలు కూడా పురాణాలకు విస్తారమైన వస్తువును సమకూర్చియున్నాయి. ఇవే పురాణాల్లోని వివిధాలైన, విస్తృతాలైన అంశాలకు బీజాలైనాయని వీబరు పండితుడు తెలియజేశాడు. ఈ విధంగా పురాణాలనే పేరుతో ప్రత్యేక వాఙ్మయ భాగం రూపొందిందని చెప్పవచ్చు.

విష్ణు పురాణంలో గల పురాణోత్పత్తికి సంబంధించిన శ్లోకాల్ని బట్టి చూస్తే వ్యాసుడు పురాణ సంహితను గూర్చి తన శిష్యుడైన రోమహర్షణుడు దానిని అగ్నివర్చుడు, మైత్రేయుడు, సాంశపాయనుడు, కాశ్యపుడు, సావర్ణి, అకృతవ్రణుడు తదితర శిష్యగణానికి ఉపదేశించాడని, రాజులు యజ్ఞాల్ని నిర్వర్తించే సమయంలో వారు దానిని సభాసదులకు వినిపిస్తుండే వారని, ఈ విధంగా వారే ప్రాచీన భారతీయ చరిత్ర నిర్మాతలని చెప్పదగిన వారనడంలో సందేహం లేదని చెప్పవచ్చు. ఈ విషయమే కొద్దిమార్పులతో అగ్ని పురాణంలో కూడా తెలుపబడి వుందని చెప్పవచ్చు. దీనిలో వ్యాసుడే పురాణ సంహితను తన శిష్యులు ఆరుగురికి ఉపదేశించినట్లుగా చెప్పబడివుంది. అలాగే బ్రహ్మాండ, వాయుపురాణాల్లో పేర్కొనబడిన రోమహర్షణుని శిష్యుల పేర్లు స్వల్ప బేధాలతో సమానంగానే వున్నాయి. వీరిలో కాశ్యప సావర్ణి, సాంశపాయనులు స్వతంత్రంగా పురాణ సంహితల్ని రచించి వున్నారని, రోమహర్షణునితో కలిసి పూర్వ సంహితయని పేర్కొనబడే మూల సంహితను కల్పించినారని తెలుస్తోంది. ఈ మూల సంహితను మాతృకగా చేసుకొని అందులోని విషయాలకు మరికొన్ని విషయాల్ని కలుపుకొని తర్వాత పురాణాలేర్పడి వుండవచ్చునని భావింప

వచ్చును. వీటిలో మొదట రోమహర్షణ సంహిత, తర్వాత క్రమంగా కాశ్యపసావర్ణి, సాంశపాయనుల సంహితలు వెలువడ్డాయని చెపుతారు. వీటిలో ఏదీ ఇప్పుడు లభించడంలేదు. కాని వాటిలో చతుష్పాదాలు మాత్రం లభ్యమని తెలియు చున్నది. ఈ చతుష్పాదాలు ఇప్పటికీ వాయు, బ్రహ్మాండ పురాణాల్లో కన్పిస్తున్నాయి. ఈ విషయాల్ని పరిశీలిస్తే ప్రాచీనకాలంలో కూడా భారతదేశంలో చారిత్రకులు, చరిత్ర వాఙ్మయం వున్నట్లుగా తెలుస్తున్నది. ఈ చారిత్రకులకు వంశవిత్తులు, వంశవిత్తములు అనే బిరుదులుండేవి. వీరిలో కొందరు కొన్ని వంశాల చరిత్రలలో ప్రత్యేక పరిశ్రమ గావించేవారు. సోమవంశ విత్తులంటే చంద్ర వంశ చరిత్రలో ఆరితేరినవారని చెప్పవచ్చు. యజ్ఞాలు జరిగే స్థలాలలోనే కాక ఇతర స్థలాలలోను పురాణాల్ని ఉపదేశిస్తూ ప్రచారం గావించే వారికి సూతులని పేరు. ఈ సూతులు పృథుమహారాజు యజ్ఞవాటిక నుంచి పుట్టిన సూతుని వంశానికి చెందినవారని చెపుతారు. వీరు ఋషులుగా మారి వివిధ కాలాల్లో, వివిధ స్థలాల్లో పురాణాల్ని ప్రచారం చేస్తుండేవారని చెపుతారు.

అధర్వ వేద కాలంనాటికి పురాణాలు సామాన్యజనులకు కాకపోయినా విద్వాంసులకు పరిచితాలై వుండేవి. ఛాందోగ్యోపనిషత్తులోని ఏడవ భాగంలో నారదుడు స్వయంగా పురాణేతి హాసాల్ని క్షుణ్ణంగా చదివినట్లు తెలపడంతో ఉపనిషత్తుల కాలంనాటికి పురాణాలు సుస్థిర రూపం దాల్చినట్లుగా చెప్పవచ్చు. మహాభారతంలోని చివరి పర్వంలో పురాణ వాఙ్మయమే కాక, 18 పురాణాల పేర్లు కూడా పేర్కొనబడ్డాయి. కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో రాజకుమారులు తప్పనిసరిగా పఠించవలసిన గ్రంథాల్లో పురాణాల్ని కూడా చేర్చియున్నాడు. అమరసింహుడు అమర నిఘంటువులో పురాణం పంచలక్షణమని చెప్పాడు. దీనినిబట్టి అమరసింహునికి పూర్వమే పురాణాలు ప్రచారంలో వుండేవని విమర్శకుల అభిప్రాయం. వేదవాఙ్మయాన్ని చదవడానికి, అర్థం చేసుకోవడానికి కష్టతరమైనందువల్ల ఇందుకు జీవితకాలం అంతా సరిపోకపోవడం వల్ల ఆత్మశాంతికై వేరే ఏవైనా మత గ్రంథాల్ని చదవాలని కుతూహలం చెందే పామరజనులకు పురాణేతిహాసాలు ప్రచారంలోకి వచ్చాయని చెపుతారు. వీటిని గ్రామాల్లో సామాన్యులకు వివరించి చెప్పడానికి తగిన ప్రయత్నాలు చేయబడి వుండేవి. అప్పుడప్పుడు విద్వాంసులు కూడా పురాణ శ్రవణానికై వచ్చేవారని హర్ష చరిత్రంలోని ఒక ఉదాహరణం వల్ల తెలుస్తోంది. అందులో బాణుడు తనగ్రామంలో చెప్పబడే వాయు పురాణాన్ని వినడానికి వెళ్ళినట్లుగా చెప్పబడివున్నది. పురాణాలలో అనేక విధాలైన పూజాప్రార్థనా విధానాలు, చరిత్ర, భూగోళ విషయాలు, యాత్రాస్థలాలు, తీర్థక్షేత్రాల వర్ణన, ఖగోళ, జ్యోతిష్య శాస్త్ర విషయాలు, వేదాంత విషయాలు, మోక్షప్రాప్తికి అనువైన

సాధనాలు, మొదలైన అంశాలెన్నో వివరింపబడ్డాయి. ఇవి సామాన్య మానవులకు విజ్ఞానాన్ని పెంపొందించి, వారికి అనేక విధాలుగా జ్ఞానసంపదను, మనో వికాసాన్ని, ఆధ్యాత్మికభావనలను పెంపొందించి, వారిని నిశ్చల మనస్సుతో భగవంతుని పట్ల భక్తి ప్రపత్తులతో మెలగునట్లుగా చేస్తాయని విమర్శకుల అభిప్రాయం.

## పురాణాల కాలం

పురాణాలు ప్రస్తుత రూపాన్ని ఎప్పుడు పొందాయో నిర్ణయించుట చాలా కష్టమైన పనిగా చెపుతారు. మహాభారతంలో 18 పురాణాల పేర్లు పేర్కొనబడివుండడం వల్ల అవి భారతానికి పూర్వమే రచింపబడి వుండినవనే అనుమానం కలుగుతుంది. కాని పురాణాల్లోని విషయాల్ని నిశితంగా పరిశీలిస్తే వాటిలో ఎక్కువశాతం భారతం తర్వాతనే రచింపబడినట్లు తెలుస్తుంది. కొన్ని భారతానికి ముందు కూడా రచింపబడి వుండవచ్చు. రాజవంశాల్ని వర్ణించు సందర్భంలో పురాణాలు అప్పటికున్న జ్ఞానానికి పెక్కు విషయాల్ని చేర్చాయనడంలో సందేహం లేదు. అందువల్లనే ఉపనిషత్తుల కాలం నుంచి గుప్తరాజుల కాలం వరకు పురాణ రచన కొనసాగుతూనే వుండేదని భావించవచ్చు.

కొన్ని పురాణాలు మహావీర, గౌతమ బుద్ధులకు పూర్వం, కొన్ని తర్వాత రచింపబడ్డాయని చెప్పడానికి ఆధారాలున్నాయి. ఈ విధంగా పురాణాలన్నీ ప్రస్తుత రూపంలో స్థిరబడడానికి కొన్ని శతాబ్దాల కాలం పట్టి వుంటుందని చెప్పవచ్చు. పురాణాల్లోని ముఖ్య విషయాలు అతి ప్రాచీన కాలంలోనే పొందినప్పటికీ అవి క్రమక్రమంగా విస్తరింపబడి వుంటాయి. దీనివల్ల కొన్ని పురాణాలు ఉపనిషత్తుల కాలంలో, మరికొన్ని ఇతిహాసకాలంలో, ఇంకొన్ని ఇతిహాసానంతర కాలంలో రచింపబడ్డాయని చెప్పడానికి అవకాశం వుంది. అందువల్లనే ప్రతి పురాణంలోని విషయాల్ని క్షుణ్ణంగా పరిశీలించి, వాటిని తగిన ఆధారాలతో పోల్చి చూసి, వాటి రచనా కాలం నిర్ణయించడం సమంజసమని చెప్పవచ్చు.

## పురాణ స్వరూపం

పురాణానికి పంచలక్షణమనేది వివరణే కాక పర్యాయపదం కూడా. సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరం, వంశానుచరితం అనేవి పంచలక్షణాలు.

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చేతి పురాణం పంచలక్షణమ్"

అన్ని పురాణాల్లోనూ ఈ అయిదు లక్షణాలు సంపూర్ణంగా కన్పించక పోయినప్పటికీ, వాటిలో సాధారణంగా ఈ విషయాలే వివరింపబడి వుంటాయి. చతుర్విధ పురుషార్థ సాధనానికి, ధర్మాచరణ ప్రవృత్తి కలగడానికి, వేదార్థ వివరణాత్మకమైన, పంచలక్షణ సమన్వితమైన పురాణం అవసరంగా చెపుతారు. ఇతిహాస పురాణాలచే వేదాన్ని పెంపొందింప చేయాలని బ్రహ్మాండ పురాణ ప్రక్రియా పాదంలో చెప్పబడి వుంది.

పురాణ శబ్దానికి, "పురాపినవం పురాణ"మనే నిర్వచనాన్ని కొందరు తెలియజేశారు. అంటే గడచిన పెక్కుకాలాల చరిత్రను తెలుపునదై, క్రొత్తగా వుండేది పురాణమని అర్థం. ఇది మొదట శతకోటి ప్రవిస్తరమై, ఏకరూపంలో వుండి, అంత పెద్ద గ్రంథాన్ని ప్రజలు గ్రహింపలేరని విష్ణువు వ్యాసరూపం ధరించి, నాలుగు లక్షల గ్రంథంగా సంగ్రహించి, 18గా విభాజన చేశాడని, శతకోటి ప్రవిస్తరమైన మూలపురాణం ఇప్పటికీ దేవలోకంలో వుందని బృహన్నారదీయం తెలుపుచున్నది. విప్రులకు శ్రుతిస్మృతులు రెండు కళ్ళుగా చెపుతారు. పురాణాన్ని మూడవ కన్నుగా చెపుతారు. ఈ మూడు కళ్ళతో చూడదగినవాడు మహేశ్వరుడని స్కాందరేవా ఖండంలో చెప్పబడి వుంది. పురాణం అంటే తెలియని వాడికి ఇంకే విషయం తెలియదని, పురాణంలో కనపడని ధర్మమే లేదని, వేదాల్లోని విషయమే స్మృతుల్లోను, ఆ రెండింటిలోనున్న విషయమే పురాణాల్లోను వుందని, పురాణాలు వేదపురుషుని ఆత్మ అని పెద్దలు చెపుతారు.

'జయ' అనే పేరు భారతానికే కాక పురాణాలకు కూడా వర్తిస్తుంది. 'జ' అనేది ఎనిమిదికి, 'య' అనేది ఒకటికి గుర్తులు. "అంకానాం వామతో గతిః" అనే సిద్ధాంతాన్ని, 18 సంఖ్యగల పురాణాల్ని సూచిస్తుంది. జయవాచ్యమైన భారతంచే కాని, పురాణాలచేకాని, ఉపజీవనం చేస్తూ ధర్మప్రచారం గావిస్తూ మహానుభావుడగ్ర పూజ్యుడై అలరారునని పురాణాలు చాటుతున్నాయి. వేద మంత్రోక్తాలైన దేవతల రూపాల్ని, చరిత్రల్ని వ్యాఖ్యానించి, ఆయా దేవతల పూజ, ప్రార్థన, ఉపాసనల్ని విధించి, జీవుల చిత్తశుద్ధి సాధనాన్ని, విశేషణాల్ని పురాణాలు ప్రవచిస్తున్నాయి. "యస్మిన్ జ్ఞాతే సర్వం విజ్ఞాతం భవతి" అనే నానుడి వేదాల పట్ల వర్తించినట్లే పురాణాలకు కూడా వర్తిస్తుంది.

పురాణాలు సందర్భానుసారంగా ఒక్కొక్క దేవతనే ప్రశంసిస్తున్నట్లు కనిపించినప్పటికీ, మొత్తంమీద దేవతలందరికీ సమానత్వాన్నిస్తాయని చెప్పవచ్చు. అవి అక్కడక్కడా ప్రత్యేక దేవతలనే కొలవాలని బోధించినప్పటికీ ఇతర దేవతల్ని ఆరాధించడాన్ని నిరసించవు. నీతి ధర్మాలకు పురాణాలు ఆల వాలం. ఇవి మానవులకు మిత్రులవలే కర్తవ్యాన్ని కథ, ఉపాఖ్యానాల ద్వారా బోధిస్తుంటాయి కనుకనే లాక్షణికులు వీటిని మిత్ర సమ్మితాలని వ్యవహరించారు. నీతి ధర్మాల్ని, సర్గ, ప్రతిసర్గలు మొదలైన వాటినేకాక పురాణాలు మానవుల విజ్ఞానాభివృద్ధికి అవసరమైన అన్ని విషయాల్ని బోధిస్తాయి. "భద్వయం మద్వయంచైవ బ్రత్రయంవ చతుష్టయం అనాపలింగ కూస్కాని పురాణాని ప్రచక్షవే"

అనే శ్లోకంలో 18 పురాణాలు పేర్కొనబడ్డాయి. అవి భద్వయం అంటే భాగవతం, భవిష్యపురాణం; మద్వయం అంటే మత్స్య, మార్కండేయ పురాణాలు; బ్రత్రయం అంటే బ్రహ్మ, బ్రహ్మవైవర్త, బ్రహ్మాండ పురాణాలు; వచతుష్టయం అంటే విష్ణు, వరాహ, వామన, వాయు పురాణాలు; 'అ' అంటే అగ్నిపురాణం, 'నా' అంటే నారదపురాణం. 'ప' అంటే పద్మపురాణం, 'లిం' అంటే లింగపురాణం, 'గ' అంటే గరుడుపురాణం, 'కూ' అంటే కూర్మ పురాణం, 'స్కా' అంటే స్కాంధ పురాణాలుగా చెప్పబడ్డాయి. ఇవన్నీ 18 మహాపురాణాలు. మహా పురాణాలన్నీ వ్యాసకర్తమైనవని చెప్పబడు తున్నాయి. వీటిలోనున్న భాష, భావగాంభీర్యాన్ని బట్టి అక్కడక్కడా కొంత ప్రౌఢంగా కన్పించినప్పటికీ సాధారణంగా అతి సరళంగా, సహజంగా వుంటుందని చెప్పవచ్చు.

పురాణం పంచలక్షణమని ప్రసిద్ధి పొందినది. పంచలక్షణాలంటే సర్గ (సృష్టిజ్ఞానం), ప్రతిసర్గ (పునః సృష్టి), వంశ (ఋషుల వంశ చరిత్ర), మన్వంతర (మనువుల కాల నిర్ణయం), వంశాను చరిత్ర (సూర్య, చంద్ర వంశస్థుల చరిత్రలు), మత్స్య, శివ పురాణాల నాధారంగా పరిశీలిస్తే మొదట ఒక్క పురాణం మాత్రమే వుండేదని, దాని నుంచి వివిధ పురాణాల ఆవిర్భావం జరిగిందని విమర్శకుల అభిప్రాయం.

పురాణాల వర్గీకరణ, వివిధ రకాలుగా వుంది. పురాణాల్ని రెండుగా విభజించారు. అవి మహా పురాణాలు, ఉపపురాణాలు. మత్స్య, మార్కండేయ,

భవిష్య, భాగవత, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, బ్రాహ్మ, వరాహ, వామన, వాయు, విష్ణు, అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కంధ పురాణాలు మహా పురాణాలుగా చెప్పబడుతున్నాయి.

పురాణాలు సాత్విక, రాజస, తామస పురాణాలుగా కూడా వర్గీకరింపబడ్డాయి. విష్ణువు ఆధిక్యతను తెలియజేసే పురాణాలు సాత్విక పురాణాలు, విష్ణు, నారద, భాగవత, గరుడ, పద్మ, వరాహ పురాణాల్ని సాత్విక పురాణాలుగా చెప్పవచ్చు. శివుని ఆధిక్యతను ప్రస్ఫుటంచేసే పురాణాలు తామస పురాణాలు. మత్స్య, కూర్మ, లింగ, శివ, స్కంధ, అగ్ని పురాణాల్ని తామస పురాణాలుగా పేర్కొనవచ్చు. బ్రహ్మ ఆధిక్యతను వివరించే పురాణాలు రాజస పురాణాలు. వీటినే రజో పురాణాలని కూడా అంటారు. బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, మార్కండేయ, భవిష్య, వామన, బ్రహ్మ పురాణాల్ని రాజస పురాణాలుగా తెలుపవచ్చు.

ఇంకా పురాణాలు విజ్ఞాన సర్వస్వాల వంటివి, తీర్థ, వ్రత మహాత్యాలను వర్ణించేవి, పూర్వోత్తర భాగాలందు ప్రక్షిప్తాలు చేరి పెరిగినవి, చారిత్రకాంశాల బాహుళ్యం గలవి, మతప్రాధాన్యం గలవి, విష్ణ్వవతార నామాల ననుసరించి పెట్టినవి అని వర్గీకరించారు.

"పురా భవమితి పురాణమ్" అని పురాణ శబ్దానికి సంస్కృత నిర్వచనం. అమరకోశకర్త "పురా పురాస్మిక్ భూతమితి పురాణమ్" అనే నిర్వచనాన్ని చెప్పాడు.

పురాణాలకు వైష్ణవీయ, బ్రాహ్మమత, శైవమత పురాణాలని మరో వర్గీకరణ కూడా కలదు. శ్రీమన్నారాయణుని స్తుతి ప్రాధాన్యత గలవి వైష్ణవీయ పురాణాలు. అవి వైష్ణవ, నారదీయ, భాగవతం, గారుడం, పద్మం, వరాహాలు. సాత్వికం, మోక్ష ప్రదమైన పురాణాలు బ్రాహ్మమత పురాణాలు. అవి బ్రహ్మాండం, బ్రహ్మవైవర్తం, మార్కండేయం, భవిష్యం, వామనం, బ్రహ్మం. సరస్వతీ చతుర్ముఖ కుశానుల్ని వర్ణించేవి శైవమత పురాణాలు. అవి మాత్స్యం, కౌర్మం, లైంగం, శైవం, స్కాంధం, ఆగ్నేయం.

ఆది, ఆదిత్య, ఔషనస, కల్కి, కాపిల, కాళిక, గణేశ, చండిక, దేవీ, దౌర్వాస, ధర్మ, నందీశ్వర, నాంద, నారదీయ, నారసింహ, పారాశర్య,

బృహద్ధర్మ, బృహన్నందీశ్వర, బృహన్నారదీయ, బ్రహ్మాండ, భవిష్యోత్తర, భార్గవ, మానవ, మారీచ, లైంగ, వామన, వారణ, వాశిష్ఠ, విష్ణు ధర్మ, విష్ణుధర్మోత్తర, శివ, శివధర్మ, సనత్కుమారీయ, సాంబ పురాణాల్ని ఉపపురాణాలుగా పేర్కొనవచ్చు. ఉపపురాణాలు కూడా పంచలక్షణోపేతాలే.[1]

పురాణ లక్షణాలన్నీ సంస్కృత పురాణాల్లో పూర్తిగా పాటింపబడలేదని కొందరు విమర్శకుల అభిప్రాయం. మహాపురాణాలకే ఈ అపవాదమున్నపుడు ఇక ఉపపురాణాల సంగతి చెప్పనవసరం లేదు.

ప్రాచీన పురాణాలలో సర్గ, ప్రతిసర్గలకు అధిక ప్రాధాన్యత లభించేది. క్రమంగా వాటికి ప్రాధాన్యత తగ్గి, వంశమన్వంతరాలకు, రాజ వంశ చరిత్రలకు, ప్రాధాన్యత పెరుగుతూ వచ్చింది. తర్వాత క్రమంగా మతప్రభోదక దృష్టి ప్రసరించిన పురాణ, ఉపపురాణాలలో దేవతల మహత్యాన్ని తెలియజేసే విధంగా కథలు, అవతారగాధలు చోటు చేసుకొన్నాయి. ఈ కారణంగా పురాణం 'పంచ లక్షణ సమన్వితమనే ప్రాశస్త్యిని కోల్పోయి మత ప్రవక్తలను భగవత్ స్వరూపులుగా భావించడంలోను, పరమతఖండన, స్వీయమత పోషణలను చాటి చెప్పే కథకావ్యాలుగా పరిణతి చెందాయని చెప్పవచ్చు.

# బసవపురాణ రచనా కాలంనాటి మత, రాజకీయ, సాంఘిక పరిస్థితులు

ఆంధ్ర వాఙ్మయంలో నన్నయ యుగం తర్వాత పేరుపొందింది శివకవి యుగం. శివకవుల యుగంలో అనేక నూతన కావ్య ప్రక్రియలు వెలిశాయి. తెలుగు వాఙ్మయానికి ఒక క్రొత్త మలుపుగా శివకవి యుగాన్ని చెప్పవచ్చు. వైదిక కర్మమార్గమే కాక, శైవం, వీరశైవం అనేవి కూడా వాఙ్మయంపై ప్రభావితమైనాయి. ఈ మతోద్రేకం వల్ల ప్రజల్లో భక్తిభావం, వర్ణవ్యవస్థలో మార్పు, సాహిత్య ప్రక్రియల్లో నూతనత్వం కలిగింది. కేవలం 'మార్గ' కవిత్వానికే ప్రాధాన్యం కలిగివున్న రోజుల్లో 'దేశి' కవిత కూడా ఈ మతోద్రేకపు రచనల్లో చోటు చేసుకుందని చెప్పవచ్చు.

శివకవులని పేరుగాంచిన శ్రీపతి పండితుడు, మల్లికార్జున పండితుడు, శివలెంక మంచన పండితులను ఈ వ్యవస్థకు ముఖ్యకారకులుగా చెపుతారు. వీరి కవితా విధానం మత ప్రాధాన్యంతో కూడుకుని ప్రజల్లో నూతన చైతన్యం కలిగించింది. ఈ మార్పు కారణం వల్ల తెలుగులో అనేక ప్రక్రియలు వెలువడ్డాయి. ద్విపద రచన, జాను తెనుగు, మణి ప్రవాళశైలి మొదలైనవి. ఈ ప్రక్రియలే కాక, ఛందస్సులో కూడా క్రొత్త వృత్తాలు, వివిధ రకాల్ని గమనించవచ్చు. త్రిభంగి, క్రౌంచపదం, మయూరం, మానిని వంటి వాటిని ఉదాహరణలుగా చెప్పవచ్చు.

## మతసంబంధ పరిస్థితులు

పాల్కురికి సోమనాథుడు కావ్యరచన చేయడానికి పూనుకొన్నప్పుడు శివకవులకు మత ప్రచారమే ధ్యేయమై కర్మమార్గం వైదిక మత సిద్ధాంతాలలో నిరసన భావం కలిగిందని చెప్పవచ్చు. వీరిది వీరశైవ మతం. దీనిలో జాతి, మత భేదాలు లేవు. అందరూ సమానులే. కేవలం శివభక్తులైతే చాలు. మంత్రతంత్రాలతో, చదువు సంధ్యలతో వీరికి పనిలేదు. సంఘంలో వుండే దురాచారాల్ని నిర్మూలించి సమానత్వాన్ని ప్రతిపాదించడానికి ఏర్పడిన మతం - ఈ వీరశైవ మతమని శివకవులు చాటారు. ఇట్టి భావాల్ని దృష్టిలో వుంచుకుని వీరు రచనలు సాగించారు. శివభక్తుల మహిమలు, భక్తి ప్రభావం ఎంతో గాఢంగా వీరి మనస్సులో ప్రతిపాదింపబడ్డాయి.

సోమనాథునికి ముందు కాలంలో సాహిత్య సృష్టికి మతాన్ని ఆధారంగా చేసుకొన్నవాడు మల్లికార్జున పండితుడు. ఇతనికి పూర్వుడైన నన్నెచోడుడు కూడా కుమార సంభవంలో శైవమత సిద్ధాంతాల విశేషాల్ని చెప్పివున్నాడు. కానీ అప్పటికి బసవేశ్వరుడు ఉద్భవించి వీరశైవ సిద్ధాంతాల్ని ప్రతిపాదించి వుండలేదు. ఈ కారణంగా తెలుగు దేశంలో గాని, కన్నడ దేశంలో గాని వీరశైవమనే ఒక మతం ప్రాదుర్భావం చెంది వుండలేదు. అందువల్ల నన్నెచోడుని కావ్యంలో బసవని మతం కలదని చెప్పడం సమంజసం కాదు. మల్లికార్జున పండితుడు బసవేశ్వరునికి సమకాలికుడని చెబుతారు. ప్రత్యక్షంగా బసవేశ్వరుడు కర్నాటక దేశంలో ఉద్యమిస్తున్న విషయాల్ని చూడక పోయినప్పటికీ, సమగ్రంగా విన్నవాడు, వాటి ప్రభావాలకి లోనైనవాడు, ఆ ప్రభావం వల్ల తెలుగు దేశంలో మతప్రచారం చేసి, గ్రంథాల్ని రచించి వీరశైవానికే తన జీవితాన్ని అంకితం చేశాడని చెపుతారు.

పాల్కురికి సోమన మార్గం విశిష్టమైంది. ఎందువల్లనంటే ఈ కవి రంగంలో ప్రవేశించే సమయానికి తెలుగుదేశంలో పండిత త్రయం, కన్నడ దేశంలో బసవేశ్వరుడు శైవమతాన్ని ప్రతిపాదించి, ప్రచారం చేసి లింగైక్యం చెంది వున్నారు. కొంతకాలం గడిచేటప్పటికీ శైవ సిద్ధాంతానికి ఒక స్వరూపమేర్పడిందని చెప్పవచ్చు. అధిక సంఖ్యాకులు స్త్రీ, పురుష, జాతి, కుల వివక్షత లేకుండా కర్నాటాంధ్ర దేశాల్లో ఈ మతాన్ని నిత్యజీవిత విధానంగా అవలంబిస్తుండే వారు. ఇటువంటి స్వరూప, స్వభావ లక్షణాల్ని కలిగిన మతాన్ని కేవలం పామరుల్లోనే కాక, అక్షరాస్యుల్లో సాంస్కృతిక సాహిత్య పరిణత కల్గినవారిలో కూడా ప్రచారం చేయాలనే అభిప్రాయం సోమనకు కలిగినట్లు తెలుస్తోంది.

సోమన సాహిత్య సృష్టి ఉన్నతమైంది. కన్నడ భాషలో, సంస్కృత భాషలో రచనలు చేయడమేగాక తెలుగులో మనకు లభించినంతవరకు గ్రంథాల్ని రచించి వీరశైవ మార్గాన్ని ప్రచారం చేయడానికి పూనుకొన్నాడు.

సోమన తొలికృతుల్లో నామమాత్రంగానే వున్న వీరశైవ సిద్ధాంతం బసవపురాణ, పండితారాధ్య చరిత్రల్లో పరాకాష్ఠకు చేరుకొన్నది. సోమన కవిత్వాన్ని ఆధారం చేసుకొని వీరశైవ మత వ్యాప్తికి కంకణ ధారియైన మేధాశాలి అని చెప్పవచ్చు.

వీరశైవేతరులకు అపరిచితులైన శైవ భక్తుల పేర్లు, కథలు మొదలైనవాటిని కూడా చెవుల్లో గింగురుమనేట్లుగా మోగించి, అవి పరిచితాలయ్యేటట్లు చేసే చాతుర్యం సోమనలో పుష్కలంగా వుంది.

"దాసయ్య, శంకరదాసయ్య, దాన
కేసయ్య, ధూర్జటి కేశిరాజయ్య,
దారయ్య, భోగయ్య, దసరయ్య, శివకు
మారయ్య, దోరయ్య, మలయ రాజయ్య,
యోహిళు, డుద్భటు, ఉత్తుంగచోడ,
డాహుతి మల్లి దేవయ్య, యెల్లయ్య,
మధుపయ్య, జగదేవమల్ల బ్రహ్మయ్యలు" అని సోమన పెక్కుమంది శివభక్తుల పేర్లను పేర్కొన్నాడు. (పండితారాధ్య చరిత్ర - 217వ పేజీ)

సోమనాధుని వైదుష్యం, లోకజ్ఞానం బసవపురాణం, పండితారాధ్య చరిత్రలలో అనేక విధాలుగా ప్రస్ఫుటితాలైనాయి. హఠయోగం, రసవాదం, నేత్రవైద్యం, సర్పవైద్యం, ద్యూత విద్య, శకునశాస్త్రం, వేశ్యావర్ణనం, కామశాస్త్రం, చోరవిద్య, మృగయ, గర్భ చిహ్నాలు, పిల్లల్ని పెంచే విధానం, పిల్లల్ని లాలించే విధానం, పిల్లల ఆటలు, శరీరావయవ కర్మలు, వస్త్ర భేదాలు మొదలైనవాటిని గురించి సోమన విస్తరించి చెప్పాడు.

పాల్కురికి సోమనాధుడు ప్రతిపాదించిన మతం పాక్షికమైనా అతని పాత్ర సృష్టి మాత్రం సర్వజన సమాదరణీయమని పలువురంగీకరించారు. సోమన చిత్రించిన పాత్రలు సామాజిక జీవనానికి సన్నిహితమైనాయి. సాధారణ చిత్త ప్రవృత్తులకు లోబడినవి. అతి సహజంగా ప్రవర్తించేవి. యదార్థమానవ ప్రపంచానికి చెంది సజీవాలైనవి. సోమన పాత్రలు నిర్మలమైన నిశ్చల భక్తికి చక్కటి ఉదాహరణలు. ఈ పాత్రలన్నీ అచ్చుపోసినట్లు ఒకే మాదిరిగా కాక, ప్రత్యేక వ్యక్తిత్వంతో, వైవిధ్యంతో చైతన్యం కలిగివుండే విధంగా సోమన చిత్రించాడు. పాత్రల ముగ్ధత్వాన్ని ప్రదర్శించడంలో సోమన ప్రజ్ఞావంతుడని చెప్పవచ్చు.

బసవపురాణం ఒక మహాకావ్యాని కుండాల్సిన విశేషణాలన్నిటినీ కలిగివున్నది. అలంకారాల్లాంటివేవీ లేకుండా సోమన సామాన్య భావంతో గుండెలు ద్రవించే విధంగా రచన చేశాడని చెప్పడానికి బసవపురాణ రచనే ప్రబలనిదర్శనమని చెప్పవచ్చు. "చులకన మరి తల్లిలేని సుతుడు" అనే

లోకోక్తిని సోమన శివునికి అనువర్తింపజేశాడు. నిజంగా శివునికి తల్లి వుండి వుంటే ఇంతటి దుర్దశ కలిగివుంటుందా అనిపించే విధంగా సోమన పాత్ర చిత్రణ గావించాడు. శివుడు అయోనిజుడు, ఆదిమధ్యాంత రహితుడని తెలిసినప్పటికీ అతనికి కూడా తల్లివుంటే బాగుంటుంది అని పాఠకులు తల్లడిల్లే విధంగా వర్ణించాడు. బెజ్జమహాదేవి శివునికి చేయు పరిచర్యల్ని పరిశీలిస్తే సోమన వస్తు పరిశీలనా శక్తి తెలుస్తుంది. తానుతెచ్చిన పాలను శివుడు ఆరగింపలేదని శివభక్తురాలైన గొడగూచి భయాందోళనలు వ్యక్తం చేస్తుంది. సోమన గొడగూచి ముగ్ధత్వానికి భావాల్ని పొందు పరచి మనోహరంగా వర్ణన చేశాడు. సామాన్య పాత్రల చిత్తవృత్తాల్ని, బాహ్యచేష్టల్ని భావించి భాషా రూపంలో ప్రత్య క్షీకరించడంలో సోమనను మించిన మరొక తెలుగు కవి లేడనడంలో అతిశయోక్తి లేదు.

సోమనాధుడు భక్తిలో తన్మయత్వం చెందిన కవితావేశ పరుడైనందువల్ల గొప్ప పండితుడై కవితామర్మమెరిగిన వాడవడం వల్ల ఏది వర్ణించినా సరసంగా, సవిస్తరంగా, సంపూర్ణంగా కన్నులకు కట్టినట్లుగా వర్ణించేవాడని చెప్పవచ్చు. సోమన గొల్లల వేషాదికాల్ని, పరికరాల్ని తెలపడంలో గొల్లల వ్యవహారంలోని పదజాలాన్నే గ్రహించివున్నాడు. దీనివల్ల వర్ణనకు ఒక సహజత్వం సిద్ధించడమే కాక, సోమన భాషా పద పరిశీలన వ్యక్తమవుతుంది. పండిత, పామర భాషలు రెండింటినీ సోమన వశపరచుకొన్నాడని చెప్పవచ్చు.

## రాజకీయ సంబంధ పరిస్థితులు

ఆంధ్రదేశ చరిత్రలో రాజరాజు మరణానికి, కాకతీయ సామ్రాజ్య స్థాపనకు మధ్యగల కాలాన్ని మాండలిక యుగంగా పరిగణించారు. ఈ కాలంలో మండలాధి పతుల్లో శైవవైష్ణవ మత వైషమ్యాలు పెరిగి మత రాజకీయ సంక్షోభ వాతావరణానికి దారి తీసిందని చెప్పవచ్చు. దాని రూపమే క్రీ.శ. 1181 - 1182 మధ్య కాలంలో జరిగిన పల్నాటి యుద్ధం, రాజాదరణతో సృష్టికి వచ్చిన తెలుగు సాహిత్యానికి ఈ మాండలిక యుగాన రాజాదరణ లేకపోవడం వలన భారతానువాద సంపూర్ణ ప్రయత్నంగాని, వైదిక మత సంబంధియైన కావ్య సృష్టిగాని జరగలేదు. ఈ కాలానికి చెందిన నన్నెచోడుడు, మల్లికార్జున పండితారాధ్యుడు, పాల్కురికి సోమనాధుడు మొదలైనవారు శైవమత ప్రధానాలైన గ్రంథాల్నే రచించి వున్నారు. వారికి వైదిక మతంలోగాని, వాటి వ్యాప్తి కొరకు ప్రారంభింపబడిన భారత రచనలో గాని ఆసక్తి లేదని చెప్పవచ్చు.

శైవ మతానుయాయుల్లో పాశుపతులు, కాపాలికులు, కాలాముఖులు, గోరక్షనాథులు, రాసేశ్వరులు మొదలైన తెగలు తర్వాత ఏర్పడ్డాయి. తెలుగు దేశంలో కాలాముఖ, పాశుపత శైవ సంప్రదాయాలు వ్యాపించిన కాలంలోనే ద్రవిడ దేశంలో శివభక్తులైన నయనారులు బయలుదేరి, భక్తి ప్రధానమైన శైవమతాన్ని వ్యాపింపజేశారు. ఈ అరవైమూడు మంది శైవభక్తుల గాథలు దేశంలో వ్యాపించి ప్రజాహృదయంలో అపూర్వోత్సాహాన్ని రేకెత్తించి, భక్తి ప్రధానమైన శైవం మీద జన సామాన్యానికి గట్టి విశ్వాసాల్ని, అభిమానాన్ని కలిగించి భక్తి ఉద్యమానికి గట్టి పునాదుల్ని వేశాయి. భక్తి మార్గాన సాగిన శైవం ఆవేశ పూరితమైన వీరశైవమైంది. ఈ వీరశైవాన్ని కర్ణాట దేశాన పునరుద్ధరణ చేసినవాడు బసవేశ్వరుడు. అతడు క్రీ.శ. 1162 ప్రాంతంలో చాళుక్య సామ్రాజ్యాన్నేలిన బిజ్జలుని మంత్రి దండనాయకుడు. నందీశ్వరుని అవతారమని వీరశైవులచే విశ్వసింపబడ్డాడు. బసవేశ్వరుని ఆధ్వర్యంలో వృద్ధిచెందిన వీరశైవమతం దేశమంతటా మార్మోగి పోయిందని చెప్పవచ్చు. వీరశైవ మత ఉధృతికి ఇతర మతాలు నిలబడలేకపోయాయి. బసవని జంగమ సంప్రదాయం జనసామాన్యాన్ని బాగా ఆకర్షించింది.

వర్ణాశ్రమ భేదరహితం, భక్తి ప్రధానం, ఆవేశపూరితం మొదలైనవి వీరశైవ మతంలోని లక్షణాలు. వీరశైవంకు రేవణారాధ్యుడు, మరుళారాధ్యుడు, పండితారాధ్యుడు, ఏకోరామారాధ్యుడు, విశ్వారాధ్యుడు అనే అయిదుగురి మహాప్రవక్తలు ప్రచారం సాగించారని చెపుతారు. వీరిలో పండితారాధ్యుడు వీరశైవంలోని ఒక అవాంతర శాఖయైన ఆరాధ్య సాంప్రదాయాన్ని స్థాపించాడు.

ఒకవైపు కర్ణాటదేశాన బసవని మతం విజృంభిస్తూ వుండగా మరొకవైపు తమిళ దేశంలో రామానుజ మతం ప్రజల్లో వ్యాపిస్తూ వుండేది. రామానుజాచార్యుడవతరించు దాకా వైష్ణవమతం కర్మ ప్రధానమైన వైదిక మతాన్ని గాని, వైరాగ్య ప్రధానమైన శైవమతాన్ని గాని మించి విశేషవ్యాప్తి చెందివుండలేదని చెప్పవచ్చు. రామానుజుడు భక్తిమార్గాన్ని విష్ణుపరంగా ప్రతిపాదించి విశిష్టాద్వైతాన్ని ప్రచారం చేశాడు. తెలుగుదేశం ద్రవిడ, కర్ణాట దేశాలకు నడిమధ్యదవడం వల్ల ద్రవిడ, కర్ణాటకాల్లో ప్రచారంలో వుండిన వైష్ణవశైవ మతాల ప్రభావం తప్పనిసరిగా వుండింది. వైష్ణవం కన్నా బసవని మతమే తెలుగుదేశంలో మొట్టమొదట ఎక్కువగా వ్యాప్తిచెందింది. ఇందుకు కారణంగా తెలుగుదేశంలో అంతకుమునుపే ప్రముఖులైన శైవమతాన్నయాయులు వెలసివుండడమేనని చెప్పవచ్చు.

క్రీ.శ. 13వ శతాబ్ది నాటికి మత వైషమ్యాల తీవ్రత అణిగింది శివభవికవి భేద నిర్మూలనం జరిగింది. అద్వైతంపై ఆదరం హెచ్చి సాంఘిక పరిస్థితి కూడా మారడంతో భారతాంధ్రీకరణాన్ని తిక్కనాది కవులు చేపట్టారు.

## సాంఘిక పరిస్థితులు

బసవపురాణంలోని అధికారిక వస్తువు వీరశైవమత ప్రవర్తకుడైన బసవేశ్వరుని జీవిత మహత్యం. బసవేశ్వరునికి పూర్వమే శైవులలో వీర మాహేశ్వర వ్రతముందని, బసవేశ్వరుడు వీరశైవ మత నిర్మాత కాదని, కొందరు శైవ మతస్థులు చెప్పినట్లుగా తెలుస్తుంది. అందువల్ల అతడు వీరశైవ మత పునః ప్రతిష్టాపకుడో, సంస్కర్తయో అయివుండాలి. మహనీయమైన బసవేశ్వరుని చరిత్ర విశేషాంశాలతో కూడుకున్న దవడం వల్ల సోమన ఈ బసవపురాణాన్ని చారిత్రక సత్య బద్ధంగా కాక, పౌరాణిక వాసనమయంగా వెలయించాడు. సాధారణంగా పురాణాల్లో చారిత్రకాంశాలు తక్కువ, అలౌకికాద్భుతాలు ఎక్కువ. కవి ఈ గ్రంథానికి పురాణమని నామకరణం చేశాడు. అంటే దాదాపు తనకు సమకాలికుడని చెప్పబడుతున్న, చారిత్రక పురుషుడిగా కీర్తించబడుతున్న బసవేశ్వరుని పురాణ పురుష కోటిలో పరిగణించి అతనికి గల సహజ ఘనతకు అతిశయోక్తులు జోడించి అతనిని అవతార పురుషునిగా నిలిపాడని చెప్పవచ్చు. జైనమత మంటే గిట్టని సోమన జైనుల సంప్రదాయాన్నే స్పర్ధచే అనుకరించి బసవని చరిత్రను పురాణంగా వ్రాసివుండవచ్చునని విమర్శకుల అభిప్రాయం.

బసవపురాణ గ్రంథానికి తెలుగుదేశాన రావలసిన ప్రశస్తిరాలేదు. బసవపురాణం ప్రత్యేక మతపరమైన గ్రంథమవడం వల్ల, బహుసంఖ్యాకుల మనసుల్ని నొప్పించి పరమత ధూషణం కలదవడం వల్ల, సహజ సంప్రదాయ విధేయమైన ఆంధ్రజాతి ఇతని భాషా స్వాతంత్ర్యాన్ని మెచ్చి వుండకపోవడం వల్లనే రాదగినంత ఖ్యాతిని పొందలేదని చెప్పవచ్చు. అంతేకాక సోమనాధుడు పుట్టుకచే కర్ణాటకుడని, తెలుగు అతనికి నేర్చిన భాష అని ప్రతిపాదించువారు కొందరు కలరు. అయితే ఇంతకంటే అనాలోచిత సిద్ధాంతం ఇంకొకటి లేదని చెప్పవచ్చు. ఎంత కష్టపడి చదివినా నేర్చినభాష మాతృభాషవలె వశంకాదు. సోమనాధుని రచనల్లో జానుతెనుగుగా పేర్కొనదగ్గ పదాలు, పదబంధాలు, వాక్యాలు మాత్రమేగాక తెలుగు దేశంలో కనిపించే సర్వవస్తు

నిర్దేశకాలైన నామాలు, విశేషణాలు, గుణాలు కన్పిస్తాయి. సోమన వాక్కుకు సహజమైన తెలుగుదనం వచ్చిందే కాని, నేర్చింది కాదని చెప్పవచ్చు. ఒకవేళ సోమన కర్ణాటకడే అయిన పక్షంలో ఈ గ్రంథాన్ని కన్నడ భాషలోనే వ్రాసి వుండవచ్చు. తెలుగు ఇతని మాతృభాష అయినందువల్లే ఇతడు తెలుగులో వ్రాశాడని చెప్పవచ్చు.

ఆదర్శ పురుషుడైన బసవని జీవిత చరిత్రను హరిహరుడు, పాల్కురికి సోమన, పిడుపర్తి సోమన, భీమకవి మొదలైన పండితులు ఆంధ్ర, కర్ణాట భాషల్లో పురాణ రూపంలో ఇదివరకే వెలయించి వున్నారు. బసవేశ్వరుడు సామాన్య మానవునిలాగా ముఖ్యమంత్రిత్వం దొరికిన తర్వాత వైభవంలో తులతూగకుండా, రాజకార్యాలతో పాటు మానవజాతి కళ్యాణాన్ని, వీరశైవ మతోద్ధరణాన్ని కూడా తన ముఖ్య కర్తవ్యంగా భావించి, అధికార బలాన్ని ఉపయోగించకుండా, కేవలం సేవా భక్తులతో, ఆత్మీయాకర్షణ శక్తితో వీరశైవ మతాన్ని సంస్కరించి విస్తరించాడని చెపుతారు.

బసవని వీరశైవతత్వాన్ని ప్రజలకు బోధించడానికై జాతి, మత భేదాలు లేక, సర్వ ప్రజలు బసవని శరణు వేడి వీరశైవమత దీక్ష స్వీకరించారు. దక్షిణదేశంలో వీరశైవం బసవేశ్వరుని అవతారంలో సమాజంలోను, సాహిత్యంలోను ప్రవేశించింది. ఈ విధంగా ప్రారంభించబడిన వీరశైవం బసవేశ్వరుని కాలంలో పరాకాష్ఠకు చేరి జనాదరణాన్ని పొందింది. మతోద్రేకపు చర్యలు దీనికి కొంత కారణమని చెప్పవచ్చు. వీరశైవం అతి త్వరలోనే సన్నగిల్లినప్పటికీ శైవతత్వం, శైవభక్తులు మాత్రం నిలిచిపోయారు. తర్వాతి కావ్యాలు వీరశైవ మత ప్రతిపాదితాలుగా కాక, శైవభక్తుల కథలతో అలరారాయని చెప్పవచ్చు.

# వీరశైవులలో ముగ్ధభక్తులు

## శైవం

భారత దేశంలో అనాదికాలం నుంచి శైవం ఏదో ఒక రూపంలో వుంది. ఋగ్వేదంలో రుద్రుడి ప్రసక్తి అనేక చోట్ల మనకు కనిపిస్తుంది.[1]

ఋగ్వేదంలో శివ శబ్దం వున్నప్పటికీ అది విశేషణ పదంగానే మనకు కనిపిస్తుంది. పైగా మంగళార్థంలో వాడ బడింది. 'శ్వేతాశ్వత రోపనిషత్తు'లో శివపర్యాయ శబ్దాలు అతడి పరబ్రహ్మస్వరూపాన్ని వర్ణించాయి. అందు వల్ల ఋగ్వేదం నాటికి ప్రకృతి దేవతా రూపంలో వున్న రుద్రుడు ఉపనిషత్తు కాలం నాటికి శివుడిగా ఆరాధ్య దైవమైనట్లు తెలుస్తుంది.

హరప్పా, మొహంజాదారో, త్రవ్వకాల్లో దొరికిన శివలింగాలు, పానపట్టాల్ని బట్టి కూడా శైవం అతిప్రాచీనమైందని తెలుస్తుంది. ఆ త్రవ్వకాల్లో దొరికిన అవశేషాల్లో శివుడు బహుముఖుడుగా వున్నాడు. యోగాననస్థుడై వున్నాడు. అంతేకాక త్రిశూలధారియై కూడా వున్నాడు.

భారత దేశంలో ప్రాచీనమతం శైవమనీ, అది అప్పటి హిందూ మతమేననీ ఆర్యులు దాన్ని గ్రహించారని విమర్శకుల అభిప్రాయం.

శివుడు, శక్తి వేరు కాదని 'కామకళా విలాసం' తెలుపుతోంది.

ద్రావిడ దేశంలో శైవమతం, శైవ సిద్ధాంతమనే పేరుతోవుంది. దీనిలో ఒక శాఖ కాశ్మీరంలో కొంత వ్యాపించింది. అదే కాశ్మీర శైవంగా ఇప్పటికీ నిలిచి వుంది.

క్రీ.శ. 5వ శతాబ్దం నాటికే శైవాగమాలు 28గా గుర్తించ బడ్డాయి. కంచిలోని శివాలయంలో ఆనాటి ఒక శాసనంలో ఆపేర్లు కన్పిస్తాయి. ఈ శైవాగమాల్ని పరమ ప్రమాణంగా అంగీకరించే సంప్రదాయాలు మూడు. అవి శైవసిద్ధాంత సంప్రదాయం (తమిళనాడు), వీరశైవ సంప్రదాయం (కర్ణాటక, మహారాష్ట్రలు), ప్రత్యభిజ్ఞా సంప్రదాయం (కాశ్మీరం). ఇవేగాక సామాన్యశైవం, మిశ్రమ శైవం. శుద్ధశైవం వంటి భేదాలు కూడా కొన్ని శివాగమాల్లో వున్నాయి. అన్ని శివాగమాల్లో ప్రకరణ విభాగం సమానమే. నాలుగు పాదాలే వున్నాయి. చర్య, క్రియ, యోగ, జ్ఞాన పాదాలు. వీటిలో జ్ఞానపాదం ముఖ్యం.

ఈ ఆగమాలు వేదోపనిషత్తుల కాలానికి తర్వాత, పురాణం కాలానికి ముందు వుండేవని కొందరు విమర్శకుల అభిప్రాయం.

శివుడు నిమిత్త కారణంగా, శక్తి సహకృత కారణంగా, మాయ ఉపాదాన కారణంగా, సృష్టి ఉద్భవించింది. శైవంలో శివుడు సృష్టికి కేవలం నిమిత్తకారణమే. ఇక్కడ మాయ పదార్థం. అది అవసరాన్ని బట్టి రూపాన్ని మార్చుకుంటుందే గాని నశించదు. ఈ ధర్మాన్ని బట్టి శైవసిద్ధాంతాన్ని సత్కార్యవాద సిద్ధాంతం అన్నారు. సర్వకార్యాచరణలో శివుడు శక్తితో కలిసే వుంటాడు. ఈ శక్తి శివుడి ఇచ్ఛా జ్ఞాన శక్తులకు ఒక ప్రతీక. వాటికి వియోగం లేదు. శైవసిద్ధాంతం ప్రకారం ఉన్నది నశించదు, లేనిది రాదు అనే ధర్మం సత్యం. ఈ సిద్ధాంతంలో శివుడు, జీవుడు సమానులు. అంటే నిత్యాలైన భిన్నతత్త్వాలు.

ఈ సిద్ధాంతంలో జీవుడికి మోక్షావస్థ ఆకస్మికంగా రాదు. జీవితమంతా పాటుపడినా సిద్ధించక పోవచ్చు. ఇది జీవితంలో ఒక పద్ధతిని అనుసరించి నడుస్తుంది. ఇందులో జీవుడు శివునితో విడదీయరాని తత్త్వం కలిగి వుంటాడు. ఇది శైవతత్వస్థూల పరిచయం.

## వీరశైవం

ప్రాచీన నాగరికతకు చిహ్నాలైన హరప్పా, మొహం జూదారో శిథిలాల్లో వెలువడ్డ శాసనాల్లో శివారాధన గురించి, శైవమతాన్ని గురించి వుండడం చేత ఇప్పుడు విశ్వవ్యాప్తి నొందిన అన్ని మతాల కంటే, శైవ మతం చాలా ప్రాచీనమైందని చెప్పవచ్చు. ఈ శైవమతం కొద్ది మార్పులతో దేశమంతటా వ్యాపించి 11వ శతాబ్దం చివరి వరకు వృద్ధి చెందిందని చెప్పవచ్చు. 12వ శతాబ్దంలో జైనమతానికి, వైష్ణవ మతానికి ప్రాధాన్యమెక్కువై శైవమతానికి బలం సన్నగిల్లిందని విమర్శకుల అభిప్రాయం. ఈ స్థితిలో 12వ శతాబ్దపు మధ్య ప్రాంతంలో కర్ణాటక దేశంలో గొప్ప మతాచార్యుడైన బసవేశ్వరుడుద్భవించి శైవమత శైథిల్యాన్ని అరికట్టాడు. ఆ మతంలో నూతన చైతన్యాన్ని, శక్తిని ప్రవేశపట్టి పునరుద్ధరించాడు. ఈ విధంగా పునరుద్ధరణ జరిగిన తరువాత శైవమతాన్ని వీరశైవమని, లింగాయుత మతమని పేర్కొన్నట్లు చెపుతారు.

సంప్రదాయ బద్ధంగా శైవం నుంచి సంక్రమించిన విశ్వాసాలు వీరశైవంలో కన్పిస్తాయి. వీరశైవమతంలో శివలింగం అత్యంత ప్రాధాన్యతను సంతరించుకొన్నది. ఈ శైవమతంలో ఆరాధనా స్థానంగా శివలింగ స్వరూపాన్ని గమనించవచ్చు. వీరశైవంలో మరొక ప్రత్యేకత వుంది. వీరు శివలింగం బదులు ఇష్టలింగాన్ని శివుని స్థానంలో పూజిస్తారు. ఈ మతాన్ని

అనుసరించేవారు 60 లక్షల మంది వున్నారని విమర్శకులు చెపుతారు. భారత దేశమంతా వీరు వ్యాపించివున్నా, కర్నాటకలో వీరి వ్యాప్తి బహుళమని చెప్పవచ్చు.

వీరశైవులలో ముగ్ధభక్తులను గురించి సోమన తన బసవపురాణంలో చక్కగా వర్ణించాడు. బసవపురాణంలో ఎందరో భక్తులు మనకు కనిపించి నప్పటికీ పండిత, పామరులనే గాక ఇతర మతస్థుల్ని కూడా ఆకర్షించు కొనేటట్లుగా వున్న పాత్రలు ముగ్ధభక్తుల పాత్రలు. వీరికి భగవంతుని తత్వం, భక్తి గొప్పతనం గాని తెలియవు. శివుని తమలాంటి సహజవ్యక్తి గానే వీరు భావిస్తారు. శివునితో ఇతరులతో మాట్లాడినట్లే మాట్లాడుతారు. ఈ ముగ్ధభక్తులుగా గొడుగూచి, బెజ్జమహాదేవి, సిరియాలుడు, నిమ్మవ్వ, బాణుడు, పిట్టవ్వ, గుణపాలుడు, ఇరుత్తండి, పిళ్ళనైవారు, నైజకవ్వ, ఉద్భటుడు, కక్కయ్య, కన్నప్ప, గుడ్డవ్వల కథల్ని చెప్పవచ్చు.

సోమనాథుడు బెజ్జమహాదేవి పాత్ర ద్వారా శివునికి ఒక భక్తురాలు చేసే పరిచర్యల్ని పాఠకులకు పరిచయం చేశాడు. గొడగూచి పాత్ర ద్వారా అమాయకురాలైన శివభక్తురాలి ముగ్ధత్వాన్ని ప్రదర్శించాడు. కన్నప్ప కథ ద్వారా ఆటవికుడైన కిరాత బాలుడు ఆచార రహితమైన మూఢభక్తిచే జ్ఞానులకు కూడా సాధ్యపడని ముక్తి పొందిన తీరును వివరించాడు. సోమనాధుని బసవపురాణం, పండితారాధ్య చరిత్రలు వీరశైవులకు మత గ్రంథాలు. ఇవి కన్నడంలోకి, సంస్కృతంలోకి అనువదింపబడ్డాయి. ఈ గ్రంథాల్లో బసవేశ్వర, పండితా రాధ్యుల చరిత్ర లే కాకుండా తమిళ, కన్నడ, తెలుగు దేశాలకు చెందిన అనేక మంది శివభక్తుల కథలు వర్ణించబడ్డాయి. వీరిలో తమిళదేశానికి చెందిన 63 మంది భక్తుల కథలు ప్రసిద్ధాలు. వీరినే "అరువది ముప్వురు నాయనార్లు" అని పిలుస్తారు. తమిళంలో ఈ భక్తుల్ని గురించి తెలిపే గ్రంథానికి "పెరియపురాణం" అని పేరు.

పెరియపురాణం లోంచి ఎక్కువ కథల్ని గ్రహించిన వాడు పాల్కురికి సోమనాథుడు. 63 మంది కథలలో 24 మంది కథలకు బసవ పురాణంలో వర్ణించాడు. అయితే కొన్ని కథలకు పేర్లు మార్చాడు. చిరుతొండనంబిని సిరియాళునిగా, సుందర మూర్తిని ఒడయనంబిగా, తిరునీల కంఠనాయనారును కుమ్మరి గుండయ్యగా, తిరుజ్ఞాన సంబంధమూర్తిని పిళ్ళనైనారుగా, నేమినందిని నమినందిగా, శాక్యతొండడిని సాంఖ్యతొండడిగా పేర్లు మార్పు చేశాడు. ఈ విధంగా తెలుగు దేశంలో తమిళ దేశంలోని నాయనారుల కథలు వ్యాప్తిలోకి

రావడానికి సోమనే కారకుడని చెప్పవచ్చు. సోమనాథుడు అనువదించిన అన్ని కథలలోకి పెద్దది కన్నప్ప కథ. ఇది 276 ద్విపదలతో కూడి వుంది. బసవపురాణంలో విడిచి పెట్టిన భక్తుల కథలు కొన్నింటిని పండితారాధ్య చరిత్రలో గ్రహించాడు. వాటిలో కళియంబ నాయనారు కథ, వాగీశ నాయ నారు కథ (మాణిక్య వాచకుని కథ), సుందరమూర్తి నాయనారు కథ (ఒడియ నంభికథ) ముఖ్యమైనవి. పండితారాధ్య చరిత్రలో తమిళ శివభక్తుల కథలతో పాటు తెలుగు శివభక్తుల కథల్ని కూడాచేర్చాడు. వీటిలో వెల్లగొండయ్య మహదేవయ్య, గురుభక్తయ్య, దసరయ్య, చేటల వేయయ్యల కథలు ముఖ్యమైనవని చెప్పవచ్చు.

పాల్కురికి సోమనాథుడు సంస్కృతంలో శివస్తోత్ర రచనలు చేసిన ఉత్తర భారత శివభక్తుల ప్రసక్తి తన పండితారాధ్య చరిత్రలో విశేషాంశంగా పేర్కొన్నాడు. అంతే కాకుండా తన పండితారాధ్య చరిత్రలో మరి కొందరు సంస్కృత కవులు చేసిన శివస్తోత్రాలను కూడా చెప్పాడు.

ఈ విధంగా పాల్కురికి సోమనాథుడు తన బసవపురాణంలో దక్షిణ భారతంలోని శివ భక్తుల్ని గురించి, పండితారాధ్య చరిత్రలో ఉత్తర భారత శివభక్తుల్ని గురించి చెప్పి వీరశైవం అఖిల భారత వ్యాప్తమైవుందని నిరూపించాడు. కాని వీరశైవం ఎక్కువగా దక్షిణ భారతంలోనే ఈనాటికీ ప్రచారంలో వున్నది.

పాల్కురికి సోమనాథుడు రచించిన బసవపురాణం అసాధారణ విశేషాంశాలతో కూడినదై, అలౌకికాద్భుతాల్ని ఎక్కువగా కలిగివుంది. సామాన్యంగా పురాణాల్లో చారిత్రకాంశాలు తక్కువ, అతాకికాద్భుతాలు ఎక్కువగా వుంటాయి. సోమన తన బసవ పురాణానికి ఈ లక్షణాల్ని ఆపాదించాడని చెప్పవచ్చు. సోమన ఇందులో ప్రస్తుతాప్రస్తుతాలైన కొందరు శివ భక్తుల కథల్ని సందర్భానుసారంగా చొప్పించి, అతియోక్తులతో మేళవించి, వాటిని భక్తి ప్రధానాలుగా చిత్రించి చదువరుల మనోఫలకాలపై ప్రతిష్ఠింప జేశాడని చెప్పవచ్చు. ఇందలి ముగ్ధభక్తుల కథలు వీరశైవ మత ప్రభావానికి ప్రబల నిదర్శనాలుగా, సజీవంగా నిలిచి వున్నాయని చెప్పవచ్చు. బెజ్జమహాదేవి, కన్నప్ప, గొడగూచి, చిరుతొండనంబి, కిన్నెర బ్రహ్మయ్య, కక్కయ్య, వీరశంకరుడు, మొదలైన ముగ్ధభక్తుల కథలు వీరశైవుల భక్తికి, అప్పటి సమకాలీన సమాజ పరిస్థితులకు, ఆకాలపు ప్రజల వేష భాషా వ్యవహారాలకు దర్పణంగా నిలుస్తాయని చెప్పవచ్చు.

## కన్నప్ప

పాల్కురికి సోమనాధుడు తన బసవపురాణ గ్రంధంలో కన్నప్ప కథను రమణీయంగా చిత్రించినట్లు పండిత, విమర్శకులు తెలియజేస్తున్నారు. కన్నప్పను ప్రారంభంలో భగవంతుడంటే గిట్టని ఒక కిరాత యువకుని గాను, తర్వాత భగవంతుని పట్ల మూఢ భక్తిని పెంచుకున్న భక్తుడిగాను, చివరలో భగవంతునిలో ఐక్యం పొంది అందరిచే కొనియాడబడిన మహా భక్తుడి గాను సోమన వైవిధ్య భరితంగా చిత్రించాడు.

కన్నప్ప నివసించే అడివి ప్రాంతంలో వుండే కిరాత కుల్ని దయా స్వభావులుగా, సత్యసంధులుగా సోమన అభివర్ణించాడు. వారు పైకి మొరటుగా కనిపించి నప్పటికీ, వారిలో గ్రామీణ నాగరికత మూర్తీ భవించినట్లుండేదని సోమన అభిప్రాయపడ్డాడు. ఉడుమూరు అనే గ్రామంలో వుండే ఒక కుర్రవాడి మనఃస్థితిని సోమన చదువరుల కింపుగా వర్ణించాడు. ఆ కిరాత బాలుడు వేటకై వెళ్ళి అరణ్య మధ్యంలో వేటాడి అలసిపోయి ఆదమరచి నిద్రించడాన్ని సోమన రమ్యంగా వర్ణించాడని చెప్పవచ్చు. తర్వాత ఆబాలుడికొక స్వప్నంరాగా ఆకలలో పరమేశ్వరుడు సమస్త రుద్రకళలతో విలసిల్లే ఓ పండు ముదుసలి రూపం ధరించి ఆ కుర్రవాన్ని నిద్రలేపి, అతడి నుదుటిన విభూతి పెట్టి తన వద్దనున్న పవిత్ర జలాన్ని అతని శిరస్సుపై చల్లి దీవించడాన్ని సోమన అద్భుతంగా చిత్రించాడు.

కన్నప్ప శివలింగార్చన చేసే సమయంలో అదే శివలింగాన్ని మరొక బ్రాహ్మణుడు కూడా నియమ నిష్ఠలతో పూజించే ఘట్టాలు, వారిద్దరి పరస్పర విరుద్ధ పూజావిధానాలు, ఒకరి పూజా విధానం పట్ల మరొకరు ఆగ్రహం ప్రదర్శించడాన్ని, ప్రతిచర్యకై ఇరువురూ ఎదురుచూడడం, బ్రాహ్మణుడు కిరాతుని పట్ల పెంచుకున్న ద్వేషభావాలు, మొదలైన అంశాల్ని సోమన తన బసవపురాణంలో అపూర్వమైన రీతిలో విరచించాడు. పరమేశ్వరుడు తన భక్తుడైన కన్నప్పను పరీక్షించదలచి తన కుడి కంటి నుంచి నీరు ధారాపాతంగా రాల్చడం, దీనికి ఉపశమనంగా కన్నప్ప చేసిన సేవల్ని కరుణ రసభరితంగా సోమన వర్ణించాడు. చివరకు కన్నప్ప తన కుడి కంటిని కానుకగా శివునికి సమర్పించదలచి, ఆకంటిని పెకలించి శివుని కంటికి అమర్చిన విధానంలో సోమన చూపిన నైపుణ్యత శ్లాఘనీయమని చెప్పవచ్చు. దేవదేవుడైన శివునికే కంటిని త్యాగం చేసిన మహాభక్తునిగా కన్నప్ప ఖ్యాతినొందడాన్ని సోమన విలక్షణమైన రీతిలో ప్రదర్శించాడు.

సోమన కన్నప్ప పాత్ర ద్వారా మూఢ భక్తిని, అమాయకపు నిర్మల హృదయంతో భగవతార్చన చేయడాన్ని, భక్తికి జాతి, మత, వివక్షలేదని తెలియ జేయడాన్ని, భక్తికి 'ఎంగిలి' లేదు, నిష్కాముడై అచంచల భక్తి విశ్వాసాలతో, ఏకచిత్త హృదయుడై, భగవంతుని యందే మనస్సులగ్నం చేసి, ఆ దేవదేవుని కొలిస్తే చాలని చెప్పడాన్ని సోమన తన బసవ పురాణ గ్రంథంలోని ఉడుమూరి కన్నప్ప కథ ద్వారా పాఠకులకు వైవిధ్యభరితంగా, వారి మనసులను ఆకట్టుకొనేలా చిత్రించాడని చెప్పవచ్చు.

## గొడగూచి

సోమన బసవపురాణాన్ని వీరశైవ మత ప్రధానాత్మకంగా, వీరశైవుల వీరస్వరూపాన్ని, వారి నిర్మల మూఢభక్తిని ప్రతిష్టించే విధంగా రచించి నట్లుగా చెప్పవచ్చు. గొడగూచి అనే ఒక బాల భక్తురాలి కథలో సోమన శివుని పట్ల ఆబాలికకున్న నిర్మల, నిష్కల్మష భక్తిని నిరూపించాడు.

శివదేవుడనే ఒక శివభక్తుని భక్తి పారవశ్యాన్ని సోమన రమణీయంగా వర్ణించాడు. ఆశివభక్తుడు పొరుగూరికి వెళ్తూ, గొడగూచి అనే బాల శివభక్తురాలిచే ఆ దేవదేవునికి నైవేద్యాదులు సమర్పించమని చెప్పడాన్ని సోమన అద్భుతంగా చిత్రించాడని చెప్పవచ్చు. శివదేవుని మాట ప్రకారం, గొడగూచి శివుని సేవలో నిమగ్నమైన విధానాన్ని, శివుని పట్ల ఆ బాలిక ప్రదర్శించిన విశేష భక్త ప్రపత్తుల్ని సోమన తన బసవపురాణంలో అత్యద్భుతంగా విశ్లేషించాడు. గొడగూచి శివుని నైవేద్య నిమిత్తం వుంచిన పాలను శివుడెంత సేపటికీ ఆరగించక పోయేసరికి కలత చెందిన విధానాన్ని సోమన పాఠకుల హృదయాల్ని రంజింపజేసే విధంగా వర్ణించాడని చెప్పవచ్చు.[2]

సోమన గొడగూచి అనే బాల భక్తురాలి కథను ముగ్ధత్వం నిండిన భక్తితో, రసవంతంగా విశ్లేషించాడని చెప్పవచ్చు.

గొడగూచి సమర్పించిన పాలను శివుడెంత సేపటికీ ఆరగించక ఆ బాలికను పరీక్షించే సమయంలో ఆ బాలిక పాలలో పంచదార తక్కువైన దేమోనని, పాలకు బదులు పాయసం స్వీకరింపుమని ప్రార్థించడం లోనూ, అటుకులు, పండ్లను ఆరగింపమని కోరడంలోనూ ఆ బాలిక పసిమి ఛాయలతో చూపిన ముగ్ధత్వాన్ని సోమన ఈ కథలో కళ్ళకు కట్టినట్లుగా చిత్రించాడని చెప్పవచ్చు. అయినా ఆ పరమేశ్వరుడు పాలను సేవించక పోవడంతో గొడగూచి తీవ్రంగా కలత చెంది తన తలను శివలింగానికి తాటించి కొట్టుకొన్న విధానాన్ని సోమన భక్త్యావేశంతో చిత్రీకరించాడు. ఆ బాలిక

భక్తికి శివుడు ప్రసన్నుడై లింగం నుంచి బయటకు వచ్చి పాలను సేవించిన విధానాన్ని, సోమన అత్యద్భుతంగా వర్ణించాడు. అయితే, ఊరి నుంచి తిరిగి వచ్చిన శివదేవుడు గొడగూచి గుడి నుంచి పాత్రలో ఒక చుక్క కూడా పాలు మిగలకపోవడాన్ని చూచి ఆశ్చర్యంతో ఆ బాలికను ప్రశ్నించడాన్ని, అందుకా బాలిక శివుడే ప్రతి రోజూ పాలను సేవిస్తున్నాడని అమాయకంగా చెప్పిన విధానాన్ని సోమన వర్ణించిన తీరు ప్రశంస నీయమని చెప్పవచ్చు. ఈ మాటలు విన్న శివదేవుడు ఆ బాలికను తీవ్రంగా కొట్టడంతో, గొడగూచి ఆ బాధ భరించలేక శివలింగాన్ని కౌగలించుకొని, శివుని ప్రార్థించగా శివుడామెను లింగ గర్భంలోకి కొనిపోయిన విధానాన్ని సోమన సామాన్య పాఠకునికి కూడా అర్థమయ్యేరీతిలో చెప్పాడు. ఈ విధంగా సోమన గొడగూచి అనే ఒక బాల శివభక్తురాలి కథలో ముగ్ధభక్తి గురించి చక్కగా వర్ణించాడు.

## సిరియాళుడు

పాల్కురికి సోమనాథుడు సిరియాళుని కథలో ఒక భక్తుని ధృఢ వ్రతాన్ని, శివుడు మాయా తపసి వేషం ధరించి పరీక్షించిన విధానాన్ని, చిరుతొండ నంబి అనే మహాభక్తుని కుమారుని చంపి, ఆబాలుని మాంసాన్ని ఆరగించడం, చివరకు భక్తుని ధృఢచిత్తానికి ప్రసన్నుడై ఆపసివాడిని సజీవుని చేయడం మొదలైన అంశాలను ప్రతిభావంతంగా చిత్రించాడని చెప్పవచ్చు. అయితే ఆపసివానిని ఖండించి, అవయవ విచ్ఛేదం చేసి వంట చేయడమనే ఘోర కృత్యాన్ని సోమన వర్ణించాడు. అయితే ఇటువంటి సంఘటనల్ని వర్ణించడం వీరశైవతత్త్వాన్ని ఆకళింపు చేసుకొన్న కవి తప్ప ఇంకొకరి సాధ్యం కాదని చెప్పవచ్చు. ఈ కథను వినగానే భయంతో కంపించి పోయే బలహీన మనస్కులకు చదివి ఆనందించడం సాధ్యం కాదని చెప్పవచ్చు. అయితే సోమన ఇందుకు ఉపశమనంగా కథ చివరలో, తల్లి పిల్లవానిని చేతులు చాచి, 'నా వడుగా రారా! నా కన్నయ్యా రారా! నా సిరియాళ రారా!' అని పిలిచేటపుడు కరుణరస వర్ణన చేసి కొంత నింద తొలగించు కున్నాడు. ఆ తల్లి పిల్లవానిని చేతులు చాచి నిలిచిన పిలుపు నందుకొని ఆ బాలుడు శివాను గ్రహంచే సజీవుడై వచ్చిన ఘట్టం పాఠకులకు ఆనందాన్ని కలుగజేసి సోమన కరుణరస వర్ణన కొక నిండుదనాన్ని చేకూర్చిందని భావింప వచ్చు. సోమన ఈ సిరియాళుని కథలో ఎన్నో దేశీయ పదాల్ని వుపయోగించాడు. అయితే వీటి వల్ల కవిత పేలవం కాకుండా మధ్యలో అక్కడక్కడా దీర్ఘ సంస్కృత సమాసాల్ని గుప్పించి ప్రాచీన కావ్యలక్షణం మీద దృష్టిని విడవకుండా చేశాడు. వీరశైవేతరుల కపర్ధి చితమైన సిరియాళుని

కథను వారికి పరిచిత మైనట్లు గానే సోమన చిత్రించాడు. జంగమ స్వరూపుడై వచ్చిన పరమేశ్వర వర్ణన సోమన చక్కగా నిర్వహించాడని చెప్పవచ్చు. సిరియాళుడు ప్రతి రోజూ నలుగురు జంగమముల నర్చించుచూ తన దైనందిన కార్యక్రమాల్ని నిష్ఠతో నిర్వహించే విధానాన్ని సోమన విశేష ప్రతిభతో వివరించాడని చెప్పవచ్చు. చివరలో తల్లి పిల్లవానిని తన మాతృప్రేమనంతా పోతపోసి, 'నావడుగారారా!' అనిపిలిచిన సందర్భంలో సోమన మాతృప్రేమకొక పరాకాష్ఠగా ఆ సంఘటనను విశ్లేషించాడు. ఈ విధంగా సోమన సిరియాళుని ధృఢ వ్రతాన్ని, పరమేశ్వరుడు మాయాతపసి వేషంలో పరీక్షించిన విధానాన్ని శ్రోతల కింపైన రీతిలో వర్ణించాడని చెప్పవచ్చు.

## కక్కయ్య

శివభక్తులు చేసిన అత్యాచారాలు ఎంత ఘోరకృత్యాల్లో నిరూపించడానికి కక్కయ్య అనే శివభక్తుని కథను ఒక ఉదాహరణగా పేర్కొనవచ్చు.

కళ్యాణ కటక నగరంలో పురాణ పఠనం చేస్తుండిన బ్రాహ్మణుని కక్కయ్య బసవేశ్వరుని ప్రశంసం నాశించి చిత్రవధ చేసి వధించిన ఘట్టాన్ని సోమన తన బసవపురాణంలో అద్భుతరీతిలో వర్ణించాడని చెప్పవచ్చు. ఆబ్రాహ్మణుడు విష్ణువు నృసింహావతారమెత్తి హిరణ్యకశపుని సంహరించిన విధానం, వామనావతారంలో ఒక పాదాన్ని ఆకాశానికెత్తిన విధానం మొదలైన గాధల్ని వర్ణించిన తీరు సోమన కళ్ళకు కట్టినట్లుగా చిత్రించాడు. కక్కయ్య బ్రాహ్మణుని చిత్రవధ చేసినందువల్ల వీరశైవానికే త్రిలోక నింద వచ్చిందని విమర్శకుల అభిప్రాయం. ఆ బ్రాహ్మణుడు తన పురాణ పఠనా సందర్భంలో ఎక్కడా శివనిందకు పాల్పడనప్పటికీ, కేవలం గ్రంథంలో వున్న పంక్తులకు వ్యాఖ్యానం చేసినందు వల్ల కక్కయ్య అతనిని చంపిన వైనం ఒక రాక్షస కృత్యాన్ని గుర్తుకు తెస్తుందని చెప్పవచ్చు. ఈ రాక్షస కృత్యం గురించి, కూడలి సంగమ దేవుడు, "చిత్త జాంతకు భక్తి చెడనాడుఖలుల మృత్యువు గతి త్రుంపు మీ బసవన్నా!" అని బసవేశ్వరునికి ఉపదేశం చేసాడు.

ఈ విధంగా సోమన కక్కయ్య ప్రదర్శించిన వీరభక్తిని, బ్రాహ్మణుడి పురాణ పఠనం వల్ల కక్కయ్య ప్రదర్శించిన ఆగ్రహాన్ని వర్ణించిన విధానం వల్ల కక్కయ్య వీరభక్తిని ప్రదర్శించునట్లుగా వర్ణించాడు.

## కిన్నెర బ్రహ్మయ్య

కిన్నెర బ్రహ్మయ్య ఏకాంత శివభక్తుడు, నాద విద్యాపండితుడు. అతడు తన కిన్నెరపై నిరంతరం శివుని గురించి గానం చేస్తూ శివధ్యానంలో నిమగ్నుడై వుండే వాడు.

కిన్నెర బ్రహ్మయ్య ఒక రోజు శివాలయ ప్రాంగణంలో కూర్చుని కిన్నెర శ్రుతిలో ఈశ్వర స్తుతి చీయడాన్ని సోమన భక్తి వంతంగా వర్ణించాడు. ఒక విలుడు తన ప్రియురాలి కోరిక తీర్చడానికై ఒక గొర్రెను తోలుకొని వెళుతుంటే, అది తప్పించుకొని పోయి శివాలయంలోకి వెళ్ళడాన్ని వర్ణించిన సందర్భంలో సోమన ఆ మూగ జీవి భయంతో కూడిన చూపుల్ని అపూర్వంగా విశ్లేషించాడని చెప్పవచ్చు. బ్రహ్మయ్య ఆ విటుడికి నచ్చజెప్పి ఆ గొర్రెను సంహరించ వద్దని నచ్చ చెప్పడంతో ఆ విటుడు దానిని సమంజసమని భావించి వెళ్ళాడు. అయితే ఆ విటుని ప్రియురాలు తనకు ఆ గొర్రె కావాలని పట్టుబట్టడంతో అతడు నిస్పృహాయుడై బ్రహ్మయ్య వద్దకు వచ్చి తన గొర్రెను ఇమ్మని అడుగగా, బ్రహ్మయ్య అందుకు తిరస్కరించడంతో ఘర్షణకు దిగిన సందర్భంలో సోమన వారి వాదోప వాదాల్ని చక్కగా విశ్లేషించాడని చెప్పవచ్చు. ఈ ఘర్షణ చిలికి చిలికి గాలి వానగా మారడంతో బ్రహ్మయ్య ఆవిటుని సంహరించాడు.

ఈ విధంగా సోమన కిన్నెర బ్రహ్మయ్య పాత్ర ద్వారా పరమేశ్వరుడి భక్తిలో మునిగిన వీరశైవ భక్తుడు తన మూఢ భక్తిచే అడ్డుతగిలిన వారిని సంహరించడానికి కూడా వెనుకాడడని నిరూపించాడు. ఈ కథలో కిన్నెర బ్రహ్మయ్య వీరభక్తి విశ్వరూపం దాల్చిందని చెప్పవచ్చు.

## బెజ్జమహాదేవి

బెజ్జ మహాదేవి గొప్ప శివభక్తురాలు. ఆ భక్తురాలు శివునకు తల్లి లేదని భావించి ఆ విషయమే తలచి ఎల్లవేళలా బాధపడేవిధానాన్ని సోమన తల్లి ప్రేమకు ప్రతీకగా వర్ణించాడు. తల్లి లేకుండా శివుడెలా జన్మించాడోనని తల్లి లేకపోవడం వల్ల శివుడి కెన్ని కష్టాలు కలుగుతాయోనని బెజ్జమహాదేవి శివుడి గురించి పరి తపించిన విధానాన్ని సోమన మాతృవాత్సల్యాభరితమైన రీతిలో వర్ణించాడని చెప్పవచ్చు. ఈ విధంగా అహోరాత్రులు శివునియందే

ప్రాణాల్ని నిలిపి శివుని సంరక్షణ చేసిన విధానాన్ని సోమన కమనీయంగా విశ్లేషించాడు. శివుడికి దృష్టి తగులునేమోయని కంటికి కాటుక పూయడాన్ని, శివుడికి చనుబాలునిచ్చిన విధానాన్ని, శివుడు వాటి స్వీకరించక పోవడంతో బెజ్జమహాదేవి తన ప్రాణాల్ని విడవడానికి సిద్ధపడడం, శివుడు ప్రసన్నుడై ఆమెకు నిత్యత్వమిచ్చిన రీతిని సోమన చదువరులకింపైన రీతిలో విశదీకరించాడని చెప్పవచ్చు.

ఈ విధంగా పాల్కురికి సోమనాథుడు తమ ముగ్ధభక్తిచే పరమేశ్వర ప్రసన్నం గావించు కొని తమ జీవితాల్ని చరితార్థం చేసుకొన్న వీరభక్తుల వృత్తాంతాల్ని కళ్ళకు కట్టినట్లుగా వర్ణించి ఎందరో పాఠకుల మనః ఫలకాలపై చెరగని ముద్ర వేశాడు. స్వమత రక్షణార్థమై వీరత్వాన్ని, శూరత్వాన్ని ప్రదర్శించి నందువల్ల ఈ శైవభక్తులంతా వీర శైవులగా వినుతికెక్కారు. ఈ వీర శైవ భక్తుల కథలు నాటి సమాజ స్థితిగతులకు దర్పణంగా నిలిచాయి. సోమనాథుడు ఒకవ పురాణంలో ప్రతిష్టించిన ఈ వీరశైవభక్తులు కథలు పండిత పామరులను రంజింపజేసి చిరస్థాయిగా భాసిల్లాయని చెప్పవచ్చు.

# తెలుగు వాఙ్మయంలో బసవ పురాణ స్థానం

పాల్కురికి సోమనాథుడు రచించిన బసవపురాణం గ్రంథం ముఖ్యంగా శైవులకు పురాణం, పారాయణ గ్రంథం, ప్రయోజన కారి అని చెప్పవచ్చు. అయితే శైవేతరులకు ఈ గ్రంథం ఒక సారస్వత గ్రంథంగా కూడా ఉపయుక్తం కాదు. ఈ గ్రంథం ఎక్కువగా మత ప్రాధాన్యమైనందు వల్లే ఇది అంతగా ఉపయుక్త గ్రంథం కాదని చెప్పవచ్చు. ఈ గ్రంథం కేవలం శైవులకు మాత్రమే ప్రీతి పాత్రం. ఉచితానుచిత వివేకం లేకుండా ఇతర మతాన్ని, మతస్థుల్ని ధూషించే ఏ గ్రంథానికైనా ఉత్తమ స్థానం లభించిందని విమర్శకుల అభిప్రాయం. ఏ భాషలోనైనా ఒక కావ్యం ప్రజలందరి ఆదరణీయ పాత్రమైనపుడు మాత్రమే పఠనీయమవుతుంది. లేకుంటే పరిమిత ప్రచారాన్ని మాత్రమే పొందగలుగుతుంది. అయితే ఈ గ్రంథంలోని కొన్ని ఉపాఖ్యానాలు సారస్వత ప్రియులకు ఆనందాన్ని కల్గించిన నిదర్శనాలు కూడా లేకపోలేదు.

ఈ కావ్యాలని 'బసవపురాణం' అని సోమన నామకరణం చేసినప్పటికీ ఇది పురాణాల్లో ఎక్కడా కూడా పేర్కొనబడ్డ గ్రంథం కాదు, అంతేకాక పురాణ లక్షణాల్ని నిలుపుకున్న గ్రంథం కాదని విమర్శకుల భావన.

సోమన బసవపురాణంలోని కొన్ని ఉపాఖ్యానాల్ని సునిశితంగా పరిశీలిస్తే ఇందులో మత ప్రాధాన్యత అధికంగా కన్పిస్తుంది. అయినప్పటికీ ఈ ఉపాఖ్యానాలు అందరికీ పరమానందం కల్గించాయని విమర్శకుల అభిప్రాయం. వీటిలో ముఖ్యంగా గొడగూచి కథ, సిరియాళుని కథ, బెజ్జమహాదేవి కథ, కన్నప్ప. కథల్ని పేర్కొన వచ్చు. గొడగూచి కథలో అమాయకురాలైన బాలికకు శివుడు సులభంగా ప్రసన్నుడై తనలో ఐక్యం చేసుకొన్నాడు. బెజ్జ మహాదేవి కథలో భక్తురాలు శివుని తన బిడ్డగా భావించి ఒక తల్లి పసికందు కొసగే మాతృ వాత్సల్యం, భగవంతుడు ఆ వాత్సల్యానికి స్పందించి ప్రదర్శించిన భక్తి వాత్సల్యం ప్రదర్శితమైనాయి. కన్నప్ప కథలో ఆటవికుడైన కిరాతబాలుడు తన మూఢ భక్తిచే ముక్తి చెందిన విధానం చిత్రించబడింది. సిరియాళుని కథలో చిరుతొండ నంబి పేరుగల ఒక భక్తుని దృఢదీక్ష, శివుడు ఆభక్తుని పరీక్షింపదలచి మాయాతపసి వేషం ధరించి, ఆ భక్తుని కుమారుని చంపించి ఆ మాంసాన్ని భుజించడం, చివరకు పరీక్షలో నెగ్గిన భక్తుని అచంచల భక్తి ప్రపత్తులకు చలించి పిల్లవానిని సజీవుని చేసి ఇవ్వడం మొదలైన అంశాల్ని భయానక రమ్యంగా సోమన చిత్రించాడని చెప్పవచ్చు. చిన్న పిల్లవాడని ఖండించి నలగగొట్టి వంట చేయడమనే దారుణ కృత్యాన్ని వీరశైవావేశంగల

సోమన వంటి కవి తప్ప మరొకరు వ్రాయలేరు. ఈ బసవపురాణంలో స్థూలంగా బసవని జీవిత చరిత్ర, దానికనుగుణంగా కొందరు భక్తుల గాథలు మాత్రమే కన్పిస్తాయిగాని బసవేశ్వరుడు ప్రతి పాదించిన వీరశైవ సిద్ధాంత స్వరూపం అంత స్పష్టంగా కన్పించదు. అందువల్లనే ఈ గ్రంథం వీరశైవమత సంప్రదాయాల్లో అధిక ఆసక్తి కనపరచే వారికి అంతగా ఉపయుక్తం కాదు.

సాధారణంగా ఒక జాతికి, ఒక మతానికి సంబంధించిన సంప్రదాయాల్ని బలపరచడానికి చరిత్ర కందని పురావృత్తాల్ని ఆధ్యాత్మిక దృష్టితో వ్యాఖ్యానించే లక్ష్యంతో నిర్మితమైన సారస్వత గ్రంథాలు పురాణాలు. కావ్యశాస్త్రాల మాదిరిగా కాక జనసామాన్యాన్ని దృష్టిలో వుంచుకొని విరచితమైన వాటిని పురాణాలుగా పేర్కొనవచ్చు. అందు వల్లనే మతవ్యాప్తికి ఇవి అత్యంత దోహద కారమైనవి. శైవ, వైష్ణవ మతాలు అన్నీ ఈ పురాణాల ద్వారానే విశేషఖ్యాతి నార్జించాయి.

తెలుగు కవి తొలిసారిగా నిర్మించిన స్వతంత్ర పురాణమే ఈ బసవపురాణం. అపారశైవ మతాభినివేశనానికి, అపూర్వ కావ్య రసావేశానికి ప్రతీకగా ఈ బసవపురాణాన్ని చెపుతారు. బసవపురాణాన్ని ప్రథమాంధ్ర వీరశైవ పురాణంగా ప్రవచిస్తారు. బసవపురాణంలోని ముఖ్యాం అంశం వీరశైవ మతమే. శివునిపట్ల ప్రకటితమైన భక్తి ప్రపత్తులు ఈ పురాణంలో అనేకాలు. బసవపురాణం ఏ పురాణానికీ అనువాదం కాదు, మహాపురాణ సంప్రదాయ నిబద్ధమై, పంచలక్షణ సమన్వితమై నిర్మితమైనదే ఈ బసవపురాణం.

పురాణ లక్షణాలన్నీ సంస్కృత పురాణాల్లో పాటింపబడలేదని విమర్శకుల భావన. మహాపురాణాలకే ఈ అపవాదమున్నపుడు వాటి ఉపపురాణాల్లో చెప్పనవసరం లేదు. పురాణాల్లో ప్రాచీనమైన వాటిలో సర్గ ప్రతిసర్గలకు అధిక ప్రాధాన్యముండేది. క్రమక్రమంగా వంశ - మన్వంతరాలకు, రాజవంశ చరిత్రలకు ప్రాధాన్యత వచ్చింది. ఆపై మత ప్రభోదక దృష్టితో నిర్మింపబడ్డ పురాణోప పురాణాల్లో దేవతా మహిమల్ని చాటి చెప్పేవిధంగా కథలు, అవతార గాధలు చోటు చేసుకొన్నాయి. ఈ విధంగా పురాణం పంచలక్షణ విశిష్టమనే ప్రసిద్ధిని కోల్పోయి మత ప్రవక్తల్ని భగవత్ స్వరూపులుగా భావించడంలోను, పరమత ఖండన, స్వీయ మత పోషణల్ని తెలియజేసే కథా కావ్యాలుగా పరిణతి చెందాయి.

దక్షిణ దేశ భాషా వాఙ్మయంలో ఈ పురాణాలు మత ప్రభోదాలై వినుతికెక్కాయి. కన్నడ భాషలో ప్రముఖ జైనకవులు తీర్థంకరుల చరిత్రలు

పురాణాలుగా వెలయించబడ్డాయి. కన్నడంలో ఆదికవిగా పేరు గాంచిన పంపకవి ఆది పురాణాన్ని చంపువుగా అనువదించాడు. పొన్నకవి శాంతి పురాణమనే చంపువును రచించాడు. రన్నడి అజిత పురాణమనే చంపువు, నాగచంద్రకవి మల్లినాథ పురాణం, నయసేనుడి ధర్మనాథ పురాణం, జన్నకవి అనంత నాథ పురాణం కన్నడంలో ప్రసిద్ధ జైనపురాణాలు. శేక్కిళార్ రచించిన పెరియపురాణం కన్నడంలో శివభక్తుల చరిత్రల్ని గూర్చి, 63 మంది నయనార్లను గురించి తెలుపుతోంది.

ఆంధ్ర వాఙ్మయంలో బసవపురాణం ప్రసిద్ధి నొందిన కావ్యం. జానుతెనుగుల రసవత్కావ్యమే ఈ బసవపురాణం. ఇది లింగధారులకు పవిత్ర పురాణం.

శైవ వాఙ్మయం ఆంధ్ర సారస్వత చరిత్రలో తన ప్రత్యేకతల్ని నిలుపు కొంది. కావ్యరచనలో శివకవులు నూత్న ప్రక్రియల ననుసరించి దేశి కవితకు, జాను తెలుగుకు, నుడికారానికి, కొత్త అర్థాల్ని కల్పించారు.

సోమనాథునికి నానాదేశ ఆచారాలు, నానామత సిద్ధాంతాలు, వివిధ దేశాల ప్రజల వేషభాషలు, మొదలైన విషయాల పట్ల సదవగాహన వున్నట్లు చెప్పవచ్చు. ఆదేవిధంగా పరమత ఖండనకు సోమనాథుడొక విశిష్ట పద్ధతి ననుసరించాడు. మొదట ఒక వాదాన్ని తీసుకొని దాని స్వరూపాన్ని ముందుగా తెలిపి, తర్వాత వేదవాక్యాల్ని ఉదహరించి ఆ వాక్యాలకు, ఆ వాదానికి గల వైరుధ్యాన్ని తెలియజేస్తాడు. తద్వారా తాననుసరించిన పద్ధతిలోని విశిష్టతను తెలియపరచడం సోమన విశిష్టత.

పాల్కురికి సోమనాథుని రచనల్లో రెండవ కృతి అయిన ఈ బసవపురాణం వీరశైవ సిద్ధాంతాలకొక ప్రతీక. ద్విపద వాఙ్మయంలో పేరొందిన కృతి. ఈ పురాణంలో సోమన భక్తుల కథల ద్వారా శివుడి మహిమల్ని వెల్లడించాడు. సోమనాథుని తొలి కృతల్లో నామమాత్రంగా వున్న వీరశైవసిద్ధాంతం బసవపురాణంలో పరాకాష్ఠ పొంది ఆ మతాన్ననుసరించేవారికి ఆదర్శ ప్రాయమైందని చెప్పవచ్చు. సోమన కేవలం కవిత్వం మూలంగా వీరశైవ మతవ్యాప్తికి కంకణం కట్టుకొన్న మేధాశాలి అని చెప్పవచ్చు.

సోమనాథుడు ప్రారంభించిన దేశి కవిత తెలుగులో ఒక సంప్రదాయంగా, ఒక సాహిత్య విశేషంగా నిలిచిపోయింది. సోమన తర్వాత చాలా కాలం వరకు తెలుగు కవుల్లో కొంతమంది ఈ దేశి కవితా సంప్రదాయాన్ని గ్రహించి అనుసరించిన వారు కన్పిస్తారు. సోమనకున్నట్లుగానే ఈ కవులకు కూడా

శైవమతాభినివేశం వుంది. అంటే, మత సాహిత్య సంప్రదాయాలు రెండింటిలోను ఈ కవులు సోమనాధునికి అనుయాయులేనని చెప్పడం సమంజసం. సోమన ప్రతి పాదించిన శైవమతంలోని కథలు బహుళ ప్రచారం పొంది తర్వాత వెలువడిన అనేక శైవకావ్యాల్లో ప్రసక్తాను సారంగా తెలుప బడడం విశేషమని చెప్పవచ్చు. ద్విపద సాహిత్యంలో పాల్కురికి సోమనాధుడు రచన చేసి ముందు ముందు కవులకు మార్గ దర్శకుడైనాడని చెప్పవచ్చు.

సోమనాధుని రచనా విధానాలు, భావాలు శ్రీనాధుడు, పోతన మొదలైన తెలుగు కవులకు అనుసరణీయాలైనాయి. సోమన బసవపురాణాన్ని తెలుగులోనే పిడుపర్తి సోమన, మహాదేవారాధ్యుడు మొదలైన వారు పద్యీకరించారు. భీమకవి, సింగరాజు, షడక్షరకవి మొదలైన కన్నడ కవులు సోమన బసవపురాణాన్ని కన్నడీకరించి సోమన పట్ల తమకుండే భక్తి భావాన్ని ప్రదర్శించారు. ఈ విధంగా అనేక మంది కవులచే ఆరాధింపబడిన బసవపురాణ ప్రాశస్త్యం ప్రత్యేకమని చెప్పవచ్చు. బసవపురాణంలో భక్త కథాను వర్ణనచే సోమ నాధుని కవిత చరితార్థ మైందని చెప్పవచ్చు. తెలుగు వారి స్వతంత్ర, సాహిత్య ప్రక్రియలకు శివకవి యుగం అరుణోదయం. ఈ యుగంలో ద్విపద, ఉదాహరణం, రగడ, శతకం, గద్యలు మొదలైన దేశిసాహిత్య ప్రక్రియలు వ్యాప్తిలోకి వచ్చాయి. ఈ ప్రక్రియలకు సోమనాధుడే మూల పురుషుడు. సోమన ద్విపదకు పావనత్వం ఆపాదించాడు. పండితులు కూడా మురిసిపోయేటట్లుగా ద్విపదను రచించాడు.

ద్విపద సాహిత్యం తర్వాత సోమన ఎక్కువగా అభిమానించిన దేశఛందస్సు రగడ. ఇది మాత్రా ఛందస్సు. సోమన రగడయే తర్వాతి తెలుగు కావ్యాల్లోని రగడలకు మూలమని చెప్పవచ్చు. సోమన తన కావ్యాలకు వస్తువును సంస్కృత పురాణాల నుండి గ్రహించక దేశీయ చరిత్రల నుండి గ్రహించాడు.

సోమనాధుడు వాడిన జాతీయాలు, సామెతలు, పలుకు బడుల తీరులు తిక్కన రచనల్లో కన్పిస్తాయి. "బెండ్లు తేలిడి గాక పేరేటనైన గుండ్లు తేలునె" అని సోమనాధుడు ప్రయోగించినట్లే, 'గుండ్లు దేలి బెండ్లు మునింగి నట్లయ్యే' అని తిక్కన ప్రయోగించాడు. "ఇలమంగలమున బ్రేలులు సిట్లు గొన్న పొలుపున ధరణిఁజుక్కలు ద్రెళ్ళిపడియె" అనే సోమనాధుని ద్విపద పంక్తుల ననుసరించి నాచన సోమన "మంగలములోని ప్రేలాలఁ మాడ్కిఁ జుక్కలిక్కడఁబడ" అని ఉత్తర హరివంశంలో రచించాడు. 'పాల్కురికి సోమనార్యుడు సుకవియటె' అనే సోమనాధుని ద్విపదల్ని అనుసరించి

'పలికెడిది భాగవతమట' అని పోతన రచించి వుండ వచ్చు. పోతన రచించిన 'మందార మకరంద మాధుర్యమునఁ దేలు.....' అనే పద్యం సోమనాధుని ద్విపద రచనకు అనుసరణీయమేనని చెప్పవచ్చు.

సోమనాధుని ద్విపద కవిత్వాన్ని గూర్చి పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు చెప్పిన ఈ క్రింది వాక్యాలు ఆదరణీయాలు.

"బసవపురాణ, పండితారాధ్య చరిత్రములు రెండును నెక్కడ చూచిన నక్కడ నవరసములు పొంగి పొరలి పోవునంతటి రసోదంచితములుగ ద్విపదలలోఁ గూర్పబడినవి. హిమవద్భూధర గుహాగ్రముల నుండి యనర్గళముగా దుమికి వచ్చెను. గంగా ప్రవాహముంబోలె నీ మహామహుని కవిత్వము పాఠకుల మనంబుల నానందపూరమున నోలలాడించు చుండును. భక్తశిరోమణియగు పోతన్న భక్తి పారవశ్యపు కవిత్వమునకును, కవిసార్వభౌముడగు శ్రీనాథ మహాకవి నుడికారముల గడుసుతనంపు చిన్నెలకును, కర్ణాటరాజ్యరమానాధుడు నాంధ్రభోజుడు నాంధ్ర కవియునగు శ్రీకృష్ణ దేవరాయ మహారాజుల యాముక్తమాల్యద మున్నగు కృతులలోని యద్భుత వర్ణనా పటిష్టములగు సందర్భములకును, దీనికి దానికనియేల ఇంతదనుక మనయాంధ్ర సారస్వతమునఁగల హృదయములగు, రసవద్వర్ణనోదంచి తములగు కావ్యపు మెఱుఁగుల కన్నింటికిని ఈ రెండు ద్విపదకావ్యములే మార్గదర్శకములై రాజిల్లినవియనుటలో నేమియును సందియము లేదు".

# ముగ్ధ భక్తుల వల్ల బసవపురాణానికి లభించిన ఖ్యాతి

సోమనాధుడు వీరశైవ మత ప్రభోదానికై భక్త్యావేశ ప్రధానమైన బసవ పురాణాన్ని గానయోగ్యమైన ద్విపదలో చెప్పాడు. బసవ పురాణం జైనపురాణ నిర్మాణ పద్ధతికి చెందిన ప్రధమాంధ్ర స్వతంత్ర దేశిపురాణమని జి.వి. సుబ్రమణ్యం గారు అభిప్రాయపడ్డారు. బసవపురాణం పంచలక్షణ లక్షితం కాకపోయినప్పటికీ శివాంశ సంభూతుడైన బసవని మహత్యాల్ని వర్ణించడం వల్ల శైవపురాణంగా పేర్కొనబడింది. బసవపురాణం తర్వాత తెలుగులో స్వతంత్ర దేశి పురాణ రచన సాగినట్లుగా కనిపించదు.

పాల్కురికి సోమనాధుడు ప్రతిపాదించిన మతం పాక్షికమైనప్పటికీ అతని పాత్రసృష్టి మాత్రం సర్వజన సమాదరణీయమని పలువురు అంగీకరిస్తారు. సోమన చిత్రించిన పాత్రలు సామాజిక జీవనానికి సన్నిహితమైనవి. సాధారణ మానవ చిత్త ప్రవృత్తులకు లోబడినవని చెప్పవచ్చు. ఈ పాత్రలు యదార్ధ మానవ ప్రపంచానికి చెంది సజీవాలయ్యాయి. సోమన సృష్టించిన పాత్రలు ముగ్ధత్వానికి, నిర్మల నిశ్చల భక్తికి చక్కటి తార్కాణాలు. పాత్రల ముగ్ధత్వాన్ని వ్యక్తీకరించడంలో సోమన చక్కని నైపుణ్యాన్ని ప్రదర్శించాడని చెప్పవచ్చు. ఈ క్రింది ఉదాహరణ సోమన తన పాత్రలలో ప్రదర్శించిన ముగ్ధత్వానికి ఒక మచ్చుతునక.

బెజ్జ మహాదేవి 'కళకంఠ శ్రీపాద కమలాంతరంగ' పరమేశ్వరుడు ప్రల్లదుడై పలుపాట్లు పడడానికి కారణం తల్లి లేకుండడమేనని వితర్కించు కొన్నది.

"తల్లి కల్గిన నేల తపసి కానిచ్చు ఁదల్లి గల్గిన నేల తలజడల్నట్టుఁ
దల్లియున్న విషంబుఁ ద్రావనేలిచ్చుఁ దల్లియుండినఁదోళ్లు దాల్చనేలిచ్చుఁ?
తల్లిపాములనేల ధరియింప నిచ్చుఁ? దల్లిబూడిదయేలతాఁబూయనిచ్చుఁ?
దల్లి పుచ్చునె భువిఁ దనయునిఁ దిరియ? దల్లిపుచ్చునె
సుతువల్ల కాటికిని

(బసవపురాణం - ఆశ్వాసం 3 - పేజీ 152)

అలంకారాలేవీ లేకుండా సోమ నాధుడు సామాన్య భావంతో గుండెలు ద్రవించే విధంగా రచన చేశాడని చెప్పడానికి పై పద్యమే ఒక నిదర్శనం. 'చులకన మరి తల్లిలేని సుతుడు' అనే లోకోక్తి సోమన శివునికి అనువర్తింపజేశాడు. నిజంగా శివునికి తల్లి వుంటే ఇంతటి దుర్దశ కలిగి వుంటుందా అనిపించే విధంగా, సోమన బెజ్జమహాదేవి పాత్ర ద్వారా తల్లి ప్రేమ, వాత్సల్యాన్ని సమాజానికి చాటిచెప్పాడని చెప్పవచ్చు. తాను తెచ్చిన పాలను శివుడారగింపలేదని శివభక్తురాలైన గొడగూచి భయాందోళనల్ని వ్యక్తం చేస్తుంది. సోమనాధుడు గొడగూచి ముగ్ధత్వానికి భావాల్ని పొందు పరచి మనోహరంగా క్రింది విధంగా వర్ణించాడు.

"పాలేల యారగింపవో లింగమూర్తి
కాచుట సాలదో కమ్మవల్వమినో
ప్రాఁచియో విఱిగెనో పడుచనేననియొ?
ప్రొద్దెక్కనో యుండేఁబొగయువల్చెడినొ?
బుద్ధిపుట్టదొనెయ్యి వోయకుండితినొ?
కడువేఁడియోనీరు గలసిన వనియొ
యెడవాద్యములు లేక యేనెతెచ్చితినొ?
చాలవోయివియాలపాలు గావనియొ?
నిక్కంపుటాకలి నీకు లేదేని గ్రుక్కెఁడైననుగొని చిక్కించు నాకుఁ
పాపయీశ్వరునకు ఁబలుమాఱు మ్రొక్కుఁగోపించు
భంగించుఁగుప్పించు నఱచుఁ
గటకట వాపోవు గరములు విఱచుఁ దటతట నేలతోఁ దాకించుగాళ్లు
ధారుణిఁబడి బయల్దన్నుచు నేడ్చుఁ గోరదిక్కును జూచు మారారిఁజూచు
బుజ్జగించును వెడ్లు బుడ్డును బెట్టునిర్జివిక్రియఁబడు నివ్వెఱఁగందు"

భావోద్రేకాన్ని కలిగించే ఇలాంటి మాటలే పాఠకుల్ని తన్మయుల్ని చేస్తాయి. సోమన తాను వర్ణించాల్సిన విషయాల్ని సవిస్తరంగా, సంపూర్ణంగా తనివితీరా వర్ణిస్తాడని చెప్పవచ్చు. గొడుగూచి పాత్ర ద్వారా సోమనాధుడు శివభక్తురాలి యొక్క ముగ్ధత్వ స్వరూపాన్ని, పసిపిల్లల నిష్కల్మష భక్తి భావాన్ని రమ్యంగా చిత్రించాడని చెప్పవచ్చు.

సామాన్య పాత్రల చిత్త వృత్తుల్ని, బాహ్యచేష్టలను భాషారూపంలో ప్రత్యక్షీకరించడంలో సోమనాధుని మించిన మరొక తెలుగు కవి లేడని చెప్పడం అతి శయోక్తి కాదు. బసవని భక్తి మహిమను గూర్చి చెప్పేటపుడు సోమనాధుడు చేసిన వర్ణన సందర్భోచితంగా వున్నదని చెప్పవచ్చు.

బసవని భక్తిమహిమను సోమన భక్తిరసపోషకంగా, ఔచిత్యవంతంగా, కథా సందర్భానికి తగినట్లుగా మేళవింపబడి వుంది. శివుడు విషాన్ని కంఠంలో నిలుపగా, బసవన తాను విషమారగించి, ఇతర శైవ భక్తుల నారగింపజేసి జీర్ణింపజేశాడు. ఈ విషయాన్ని సోమన మనోహరంగా వర్ణించాడని చెప్పవచ్చు.

సోమనాధుడు భక్తిలో తన్మయత్వం చెందిన కవితావేశపరుడవడం వల్ల, గొప్ప పండితుడు, కవితామర్మమెరిగిన వాడవడం వల్ల ఏ విషయాన్ని వర్ణించినా సరసంగా, సవిస్తరంగా, సంపూర్ణంగా కన్నులకు కట్టినట్లుగా కృత్రిమాలనిపించకుండునట్లు వర్ణించాడు.

చిత్తరువుల్లో లిఖించినట్లుగా పాత్రల్ని రూపవర్ణన చేసి వాటిని చదువరుల హృదయ ఫలకాల్లో ప్రతిష్ఠించు నేర్పుసోమన ప్రత్యేకత అని చెప్పవచ్చు. సోమనాధుడు వస్తువర్ణనలో బాహ్యాకార రేఖలను స్వభావ సిద్ధంగా చిత్రిస్తాడు. బసవపురాణంలోని శివుని గొల్ల వేష వర్ణనం ఇందుకు చక్కటి ఉదాహరణ అని చెప్పవచ్చు.

సోమనాధుడు ఉక్తివైచిత్రాన్ని బహుముఖంగా చూపించాడు. పార్వతుల కవలో నుండి పార్వతి విడివడి క్రిందికి దిగివచ్చి పిళ్ళనైనారుకు పాలుగుడిపి వెళ్ళినదనే స్వల్పమైన విషయాన్ని సోమనాధుడు 8 ద్విపదల్లో ఉక్తివైచిత్ర ఉట్టి పడేటట్లుగా క్రింది విధంగా చెప్పాడు.

"దివి వల్లవోయెదు దేవదేవేశు, కనవనుండి మయ్యు
మాకాంత యేతెంచె,
నురు జటాజాట భాస్వరుకడనుండి, చిరమణిమకుట
భాస్వర యేఁగు దెంచె?
దగఁజంద్ర రేఖావంతంసుని నిల్పి, సుగుణావతంస
దత్సుదతి యేతెంచె
ముక్కంటి వాని సమ్ముఖమున నుండి, యిక్కంటితో నొక్క
యింతి యేతెంచెఁ

గరమొప్పనీల కంధరుకడ నుండి సరసరఁగంబు కంధర యేఁగుదెంచె
ఘన చందానాంకు వక్షఃస్థలిఁబాసి, స్త్రవ చందనాం కవక్ష స్థలివచ్చె.
నురగేంద్ర హారుని యూరులనుండి, వరరత్నహారసుందరి
యేఁగు దెంచె
నామహోక్షగమను నఱమేననుండి, కామిని వరహంసగమనయేతెంచె
ముల్లోకముల తేని ముందఱనుండి, ముల్లోకముల కెల్లఁదల్లి యేతెంచె"

(బసవపురాణం - 6వ ఆశ్వాసం - 411వ పేజీ)

సోమన పై ద్విపదల్లో శివపార్వతుల బాహిరంగిక వైవిధ్యాన్ని సూచించే పద్యాన్ని చమత్కారంగా ప్రయోగిస్తూ చివరి పదాల్లో శివుని త్రిలోకపతిగాను, పార్వతిని కేవలం కుమార స్వామికే తల్లి కాదు త్రిలోక జనని అని చిత్రించాడు.

బసవపురాణాన్ని సోమన భక్తజన కథా మంజరిగా ఒనరించినా అందులోని ఇతిహాస సంఘటన వల్ల కథా కథనానికి ప్రాబంధికత ఏర్పడింది. బసవపురాణంలోని నూతనత్వాన్ని ప్రాబంధ్యాన్ని భక్తులు కీర్తించి వున్నట్లుగా సోమనాధుడు క్రింది పద్యంలో తెలిపాడు.

'ఖ్యాతిగా సద్భక్త గణ లాలనముగ నూతనంబుగ
జగన్నుతముగా మున్ను
'బసవపురాణ' మొసఁగ రచించితివి బసవపురాణ ప్రబంధంబు నందు
ప్రథిత పురాతన భక్త గుణాను కథనంబు రితిహాస ఘటన గూర్చితివి'

(పండితారాధ్య చరిత్ర - దీక్షా ప్రకరణం - 3వ పేజీ)

పాల్కురికి సోమనాధుడు తన కావ్యాలకు వస్తువును సంస్కృత పురాణాల నుండి గ్రహింపకుండా, దేశీయ చరిత్రల నుండి గ్రహించాడు. బసవపురాణం దేశీయ ఇతి వృత్తంతో కూడిన స్వతంత్ర గ్రంథం. బసవన శివభక్తుడు మాత్రమే కాదు, ప్రమధుని అవతారమని, శివునితో సమానమైన శక్తి కలవాడని తెలియజేశాడు. బసవపురాణంలోని శివభక్తులు వివిధ జాతుల వారు. ప్రజలతో కలిసి మెలిసి వుంటూ వారి మహిమల్ని ప్రదర్శించిన వారు. బెజ్జమహాదేవి, గొడగూచి, సంగయ్య, దుగ్గవ్వ, ఉడుమూరి కన్నప్ప, సకలేశమాది రాజయ్య, మడివాలు మాచయ్య, కుమ్మర గుండయ్య, కక్కయ్య మొదలైన సామాన్యుల జీవిత గాధల్ని కావ్యవస్తువులుగా స్వీకరించి సోమన బసవపురాణాన్ని మనోజ్ఞకళాఖండంగా తీర్చిదిద్దాడని చెప్పవచ్చు.

బసవపురాణం తెలుగు సాహిత్యంలో శుద్ధదేశి పద్ధతిలో తొలిసారి వెలువడిన స్వతంత్ర వీరశైవ పురాణం. ఇది ఏడు ఆశ్వాసాల ద్విపద కావ్యం. ఇందులోని ప్రధాన ఇతివృత్తమైన బసవని చరిత్రతో పాటు సుమారు 75 మంది భక్తుల కథలు వివరింపబడ్డాయి. ఈ భక్తులు ద్రవిడాంధ్ర కర్ణాటక మహారాష్ట్ర దేశాలకు సంబంధించిన వారు. బసవ పురాణంలోని భక్తుల కథలను విషయాన్ని బట్టి మహిమాన్వితుల కథలు, ముగ్ధభక్తుల కథలు, వీరశైవమత సిద్ధాంత ప్రతిపాదకాలైన కథలుగా విభజించవచ్చు. ఈ భక్తులలో ముగ్ధభక్తులు, మిండజంగములు, మొండివారు, మహాయోగులు, సిద్ధపురుషులు మొదలైన వారెందరో వున్నారు.

"నిరంకుశాః కవయః" అనేసూక్తి సోమనాథుని పట్ల సార్థకత నొందిన దని చెప్పవచ్చు. సోమన బహుభాషా కోవిదుడు, సంపూర్ణ స్వాతంత్ర్యం కలవాడు. తన కవితా ప్రవాహానికి అవరోధమనిపిస్తే భాషా సంప్రదాయాల్ని గానీ, వ్యాకరణ నిబంధనల్ని గాని నిరాఘాటంగా ఉల్లంఘిస్తాడని చెప్పవచ్చు. దుష్టసంధులు, మిశ్రసమాసాలు, లింగవ్యత్యాసాలు, మొదలైన వాటిని సోమన యథేచ్ఛగా ప్రయోగించి తన విశిష్టతను చాటాడు.

సోమనాథుడు 'నవరసరసికత భువిని పేర్కొన్న శివకవి చిత్తంబులలర' అని బసవ పురాణాన్ని రచించినట్లుగా తెల్పినాడు. సోమన నవరసాల్ని వీరశైవభక్తి పరంగా వర్ణించాడు. ఈ బసవపురాణం లోని భక్తి వీరస్ఫూర్తి అధికంగా గల గ్రంథం. వీరశైవ మతోద్ధారకుడైన బసవని జీవితం మతతత్వ నిరూపణార్థ ప్రధానమై నడిచినప్పటికీ భక్త్యావేశం గలిగే ఘట్టాల్లో మాత్రం పాఠకునికి రసాస్వాదనానుభూతి కలుగుతోంది.

సోమనాథుడేదైనా ఒక విషయాన్ని నొక్కి చెప్పాల్సి వచ్చినపుడు సోమనాథుడెన్నో ఉపమానాల్ని వాడాడని చెప్పవచ్చు. తేడర దాసయ్య కథలో సర్వమున శర్వుడు కలడనే విషయాన్ని ప్రతి పాదించడానికి సోమనాథుడు వుపయోగించిన ఉపమాన పరంపరను క్రింది పద్యంలో చూడవచ్చు.

"నూవుల లోపలి నూనియయట్ల భావింపఁగాష్ఠంబు పావకునట్లు
పూని పాషాణంబులో నినుమట్ల తానేత్రములలోని తద్రూపమట్ల
యలవడఁబాల లోపల నేయి యట్ల జలకుంభములలోని
చంద్రుని యట్ల
వెలుఁగు నద్దంబు లోపలి నీడయట్ల తలఁపఁ
బూసల లోని దారంబునట్ల

ఘట పటాదులలోని గగనంబు నట్ల పటికంపు శిలలోని భావంబునట్ల
వెలయబీజములోని వృక్షంబునట్ల నలరుశబ్దంబులోపలి యర్థమట్లు
పర్వతంబులలోని ప్రతిశబ్దమట్ల సర్వంబునందును శర్వుండు నట్ల"
(బసవపురాణం - 6వ ఆశ్వాసం - 432-433 పేజీలు)

పాల్కురికి సోమనాధుని రచనావిధానం శైవభక్తుల కథలలో సోమన చూపిన ముగ్ధత్వం, భావాలు తిక్కన, నాచన సోమన, బమ్మెర పోతన, శ్రీనాధుల వంటి మహాకవులకు అనుసరణీయాలైనాయని చెప్పవచ్చు. బసవపురాణంలోని సిరియాళ చరిత్రం శ్రీనాధుని హర విలాసంలోని చిరుతొండ నంబి కథకు ప్రతి రూపం. ధూర్జటి కాళహస్తీశ్వర శతకంలోని తిన్నని కథ బసవపురాణంలోని కన్నప్ప కథకు అనుసరణమే. ఈవిధంగా పాల్కురికి సోమనాధుని ముగ్ధభక్తులు శివుని పట్ల తమకున్న అచంచల భక్తి ప్రపత్తుల్ని మూఢంగా, ముగ్ధత్వంగా ప్రదర్శించడమే గాక, ఆ భగవంతుని మహిమల్ని సర్వజనులకు తెలిసేటట్లు చేసి, బసవపురాణానికి తమ వల్ల ఎనలేని ఖ్యాతిని చేసి, తెచ్చారనడంలో సందేహం లేదని చెప్పవచ్చు.

# అనుబంధం

## గొడగూచి కథ

శివదేవుఁడన నొక్క శివ భక్తి యుతుఁడు
నువిదయుఁ దానుఁ బొర్గూరికేఁగుచును
రూపించి కడగొట్టు పాపఁ దారింటి
కాపిడి "యటయిట కదలకు మమ్మ!
పడుచులతో నాడఁబఱవకు మమ్మ!
నొడివిన మా వ్రతం బెడవకు మమ్మ!
గుడికేఁగి నిత్యంబుఁ గుంచెఁడు పాలు
ఒడరున కారగింపఁగ బెట్టుమమ్మ
నమ్మిపోయెదము సుమ్మమ్మ! మాఱాకు
మమ్మ! మాయమ్మ! మాయక్క! మా తల్లి!
కొమ్మ, నీకొక మంచి బొమ్మయు లెస్స
బొమ్మ పొత్తికలును బోయి తెచ్చెదము"
అని యప్పగించుచు నరిగిన, వారి
తనయగాళ్ళు మొగంబుఁదాఁగడిగికొని
మంచి గంగుల పాలు మరగంగఁ గాఁచి
కుంచెఁడు గోరతోఁ గొలిచి చేపట్టి
కోరయు బొత్తిన కొంగునఁ గొప్పి
భోరునఁజని శివాగారంబు ఁజొచ్చి
కోరముందఱ ఁబెట్టి ధారుణి మ్రొక్కి
యారగింపవే దేవ, యని విన్నవించి
పిఱుసని యొక్కింత మఱువున నిలిచి
మఱి వచ్చి చూచుడు గఱిగంటి గామి
బాల దల్లడ మంది భయమునఁ బొంది

"పాలేల యారగింపవు లింగమూర్తి!
కాఁచుట చాలదో కమ్మ వల్వామినో?
ప్రాఁచియో విఱిగినో పడుచనేనియొ?
ప్రొద్దెక్కెనో యొండెఁ బొగయు వచ్చెడినో?
బుద్ధి పుట్టదొ నెయ్యి వోయకుండి తినొ?
కడువేఁడియో? నీరు గలసినవనియొ?
ఎడవాధ్యములు లేక యేనెతెచ్చిననొ?
చాలా వోయివి యాలపాలు గావనియొ?
పాలపైఁ జిత్తమేఁ బఱపితిననియొ?
కొరబెండగనో? కుంచెఁడు లేవొ?
ఆరగింపఁగఁ బెట్ట నేరకుండితినొ?
మీఁదు వోయినవనో మీఁగడలేదొ?
యేఁదెచ్చు నెడనెవ్వరేఁ జూచిరనియొ?
యూరకేమిటికిఁ బాలొల్లవు ద్రావఁ?
గారణం బేమేనిఁ గలదేనిఁ జెపుమ
నిక్కంపుటాఁకలి నీకు లేదేని
గ్రుక్కెఁడైనను గొని చిక్కించు నాకుఁ
గడుపున కియ్యెడ గుడగుడలేల
కుడి కెండు దెత్తునా గుజ్జ నోగిరము
మూలపన్నారుల యాలో విలోనఁ
బోలెలున్నవి వంపువోయి తెచ్చెదను
ఉట్టిపై బానలోనున్నది నెయ్యి
యిట్టున్నఁ దెచ్చెద నిష్టమే చెపుమ.
కుండెఁడున్నది వోయి కొనివత్తుఁ బుల్ల
కండంబు వలెనేని గ్రక్కునఁజెపుమ

అచ్చన యెల్లి మాయయయగారి నగరఁ
జెచ్చెరఁ బిల్వ వచ్చెద నారగింపు
మా శివసోదరి మతమున ఁగలదు
పాసెంబు దెచ్చెదఁ బాలుమున్ ద్రావు
షోడశపండువు సూడఁ బోదండు
పోఁడిగా నీపాల పురహర, కొనుము
వీర భద్రుని జాత్ర వేళ విన్నంఢి
యేదొప్పఁబని చేద నీపాలు ద్రావు
యెడమ డుగేమిటి కీపాలలోని
గడుకులు దచ్చెద నట్లైనఁ జెపుమ
యిత్తఱి శిశువుండనెట్టులంటేని
పొత్తునవైనను నెత్తి త్రావుదము
పిన్న పన్నారులు సిన్ని బొమ్మలును
నిన్ని గూడడుకులు నెన్నేనిఁ బండ్లు
నాకెల్లి మావారు నలిఁదెత్తురపుడు
నీకు నిచ్చుదఁ గాని నీయాన త్రావు
పాలును జల్లారెఁ బలకవులతో
నేలయాలింగ, నన్నేఁచెద' ? వనుచుఁ
బాపయీశ్వరునకుఁ బలుమాఱు మ్రొక్కుఁ
గోపించు భంగించుఁ గుప్పించు నఱచుఁ
గటకట వాపోవుఁ గరములు విఱుచుఁ
దటతట నేలతోఁ దాటించు ఁగాళ్లు
ధారుణిఁబడి బయల్దన్నుచు నేడ్చుఁ
గోరిదిక్కును జూచు మారారిఁ జూచు
బుజ్జగించును వెడ్లు బడ్లును బెట్టు

నిర్జీవిక్రియఁబడు నివ్వేఱఁ గందు
నెప్పటి యడ్డేడ్చు నెలుఁగెత్తి పిలుచుఁ
దొప్పనఁ బడుఁ గోరదొలఁగంగ నూకు
వెఱచి ముందఱఁ బెట్టు మఱి పలుమాఱు
నెఱఁగుఁ బాదంబుల కెట్లు ద్రావమని
నిట్టైనఁగాని పాలేఁ ద్రావననవు
ముట్టవు మూర్కొన వట్టియున్నవియు
నీవారగింపమి మావారు విన్నఁ
జావనడ్తురు నన్ను సంశయంబేల
తనకు నెప్పుడుఁ జావు తప్పదు మగడి
చని నిచ్చుటనే చత్తు సరివోదు ననుచుఁ
దనతల శివునితోఁ దాఁకించు కొనఁగఁ
జనునంతలోనన చక్కనఁబట్టి
యారుద్రుఁడతి దయా హసితాస్యుఁడగుచుఁ
గోరతోఁ బాలెత్తుకొని యారగింప
"నన్నింతయేఁ చెడిపిన్నగాఁ జేసి
మిన్నక పోదు మాయన్నకుఁ జెప్పి
మఱికదాయున్నది మాటలింకేల
కఱకంఠ! యింతయు మ ఱవకు" మనుచుఁ
గుడుక దెమ్మని పుచ్చుకొనుచు నబ్బాల
వడిగొని యింటికి వచ్చి నిత్యమ్ము
నిట్లకొంపోయి తానిచ్చుచు నుండ
నట్లశివుండుఁ బాలారగింపంగ
నూరికిఁబోయిన వారె దుర్గాఁగఁ
దారేఁగుఁదెంచు నత్తఱి ఁదొంటియట్ల

మృడుఁడు పాలా రగించుఁడు బాలరిత్త
కుడుకఁజేతను బట్టికొని యేఁగు దేరఁ
బొడగని 'యిటు యెందుఁ బోయెదు రిత్త
కుడుక యెచ్చటి నుండి కొని వచ్చె' దనిన
'మీరు సెప్పిన యట్ల మృడునకు ఁబాలు
కోరతోఁగుంచెడుఁ కొలిచి గొంపోవ
నారగింపఁగఁమొక్కి యనయంబు నిట్లు
కోరయిమ్మని పుచ్చి కొనవత్తు' ననిన
"నేనాఁట్రాఁద్రావుఁ బాలీశుండు పడుచ
కానీన త్రావితో కాదేనితోడ
నాడెడు పడుచుల కచటఁ బోసితివా?
యేడఁజల్లితివొ, మైయెఱుఁగవుగాక
తన్నుమహా భక్తపతి యుద్దెంసిచి
'పన్నుగా నారగింపవేదేవ' యనుచు
నతిభక్తిఁ బ్రార్థింప నారగించుటయు
క్షితి దుర్లభంబన్న నితరుల తరమె!
యెట్టు నమ్మొడిదంచుఁబట్టి తిట్టుచును
'నట్లైన ఁజూతమం' చామఱునాఁడు
బాలచేతనె తండ్రి పట్టించుకొనుచు
లీలతో గుడి కేఁగి పాలతోఁగోర
ముందఱి క్రమమున ముందఱఁ బెట్టి
నంది కొనండయ్యె నాలింగమూర్తి
బాలముగ్ధత్వంబుఁ బ్రవిమలభక్తి
యీలోకమున వెలయింపంగఁదలఁచి
యాశివదేవుఁడు నంతఁగోపించి
"యోసి, నేఁడేల పాలొల్లండు ద్రావ?

ముక్కంటి ముట్టనే మూర్ఖున్నె చెపుమ
పెక్కులు క్రలితి వక్కజంబు గను
శివునకు నని యుద్దెసించిన పాలు
దివిలి నిత్యంబును ద్రావిన ద్రోహి!
పొట్ట వ్రచ్చెద నెందుఁ బోయెద" వనుచు
గట్టగ్రమునఁ గూడ ముట్టుడు మున
బాల వాపోవుచు బలువిడినేఁగి
హాలింగ! హాలింగ! హాలింగ! యనుచు
జేతి కోరకు మున్ను చేయి సాచునను
నాతని కొదుఁగుడు నంతలోపలను
హరుఁడోడ కోడుకు మనుచు నక్షణమ
వరద యామతిఁ దన వక్షంబు ఁదెఱవ
జగదభినుత కరడిగ భోగనాథు
నగణిత దివ్యలింగాంగంబు చొరఁగఁ
నమ్మాత్రలోనహహా పోయెననుచుఁ
గ్రమ్మన తండ్రి కూఁకటి వట్టుటయును
వెలుపలఁగూఁకటి వెంట్రుకల్ సిక్కె
వెలయలింగంబు లోపల ఁజిక్కెబాల
యిలనేఁడు నాఁటినెలల కొక్కమాఱు
నలరి కూఁకటి వెండ్రుకలు గత్తిరింప
బాలనిశ్చల ముగ్ధభావా సంపదకు
నీలోకమున దృష్టమిది యని పొగడ
గొడగూచియని చెప్ప ఁబడి మహామహిమ
నడరెఁ దానా ముగ్ధ ఁయదియును గాకఁ

(బసవపురాణం తృతీయాశ్వాసం 62,63 పుటలు)

# భక్తికి మరి కొన్ని నిర్వచనాలు

'భంజో' ధాతువు నుండి 'భక్తి' శబ్దం ఉత్పన్నమైంది. 'భంజో' ధాతువుకు విడగొట్టుట, భగ్నము చేయుట అనే అర్థాలున్నాయి. భంజ్ ధాతువు ఏడవ గణంలోనిది. ఈ 'భంజో' ధాతువుకు 'క్తిన్' ప్రత్యయం చేరితే 'భంజో'లోని పూర్ణబిందువు లోపించి (భంజ్ → భజ్ → భజ్) 'భజ్' అనే రూపం మిగులుతుంది. 'భజో' ధాతువుకు 'క్తిన్' ప్రత్యయంచేరి 'భక్తి' అవుతుంది.

'భజో' ధాతువు + 'క్తిన్' ప్రత్యయం

→ భజ్ + త్ + ఇ + → భజ్ + తి

వర్గాక్షర ప్రభావంచే 'తి'కి ముందున్న భజ్ లోని 'జ్' కారం 'గ్' కారమై, ఆ 'గ్' కారం మరల 'క్' కారంగా మారుతుంది. అపుడు 'భక్ + తి' అనే రూపం ఏర్పడుతుంది. భక్ + తి --> భక్తి అవుతుంది.

'భజో' ధాతువు నుండి పుట్టుట వలన భక్తి అంటే సేవ అనే అర్థం కలుగుతుంది.

శ్లో|| సర్వోపాధి వినిర్ముక్తం తత్పరత్వేన నిర్మలమ్
హృషీకేణ హృషీకేశ సేవనం భక్తి రుచ్యతే||

తా|| సర్వేంద్రియాలకు అధిష్ఠానమైన భగవంతుని, నిర్మలములైన ఇంద్రియాల చేత తత్పర బుద్ధితో ఫలాభి సంధిరహితంగా సేవించుటే భక్తి.

శ్లో|| భక్తి రస్యభజనం, ఏతదిహా ముత్రోపాధినైరాశ్యే
నాముష్మిన్ మనః కల్పనమ్

తా|| భక్తి అనగా భగవత్సేవ అని భావం. ఆసేవ అంటే ఇహలోక పరలోక సుఖాదుల నపేక్షింపక భగవంతునిలో మనస్సులీనం చేయడంగా వుండవలెను.

శ్లో|| మనోగతిరవిచ్ఛిన్నా హరౌప్రేమ పరిప్లుతా
అభిసంధి వినిర్ముక్తా భక్తిర్విష్ణువ శంకరీ

తా|| మనస్సు ప్రేమార్థమై తైల ధారా రూపంబున నిష్కామంతో భగవంతుని వంకకు నిరంతరం ప్రవహించడం భక్తి అవుతుంది.

శ్లో॥ ఇష్టే స్వారసికే రాగః పరమావిష్టతాభవేత్,
తన్మయీ యాభవేత్ భక్తిః సా(త్రరాగాత్మికాస్మృతా

తా॥ ప్రతి వ్యక్తికి వాని యిష్ట వస్తువు నందు మొట్టమొదట ఒక విధమైన అనురంజనం జన్మిస్తుంది. అది క్రమ క్రమంగా గాఢమై రాగరూపం దాల్చుతుంది. అపుడు మనసు తన్మయత్వం చెందుతుంది. అట్టి మనోవృత్తే భక్తి.

శ్లో॥ ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారావాహిక తాంగతా
సర్వేశే మనసోవృత్తిః భక్తిరిత్యా భీధీయతే

తా॥ ఆధ్యాత్మిక సిద్ధికి కొన్ని నియమాలున్నాయి. ఆ నియమాల్ని భగవద్ధర్మాలంటారు. తద్ధార్మానుష్ఠాన బలంబున హృదయం కరిగి రస రూపం పొంది ఎడతెఱపిలేని తైలధార వలె భగవంతుని వంకకు ప్రవహిస్తుంది. ఈ మనోవృత్తేభక్తి.

పాల్కురికి సోమనాధుడు తాను రచించిన 'అనుభవసారం' అనే గ్రంథంలో వీరశైవ విహితాలైన భక్త, మహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యములనే షట్ స్థలాల విజ్ఞాన స్వరూపాల్ని వర్ణించాడు. ప్రతి పద్యం చివర 'చెన్నమల్లు' అనే మకుటం పొదగబడింది.

## భక్త స్థలం

సీ॥ శ్రీ గురులింగ సంచిత కృపోన్నత జేసి
కంటి జంగమ పాదకముల సేవ
జంగమలింగ ప్రసన్నత్వమున జేసి
కంటి బ్రసాద సుఖంబు నొంద
దత్ప్రసాద ప్రబోధ స్థైర్యమున జేసి
కంటి సర్వాంగ ప్రకాశ భక్తి
భక్తి సౌభాగ్యాను భవపూర్తి మై జేసి
కంటి జీవన్ముక్తి కడమలేక

ఆ|| ఇంకనేమి కొఱంత యేల నాకాశింప
బాడియాడి దైన్యపడి భజించి
మెచ్చిపొగడి రేనిమీద నొందెడి ఫలం
బెన్న నున్నదెట్లు చెన్నమల్లు!

## మాహేశ్వర స్థలం

సీ|| కరమర్థి నీకు శృంగారంబుగా బూజ
సేయుదు గాని యాశింపఫలము
వేడుక తోడుత విభవార్థముగ నుతుల్
సేయుదు గాని యాశింప మెప్పు
తగిలి నీకు సుఖార్థముగ బదార్థార్పణ
సేయుదు గాని యాశింపరుచుల
లాలితంబుగ నీకు లీలార్థముగ భక్తి
సేయుదుగానియాశింపముక్తి

గీ|| నీవు పూజా ఫలార్థివే నిష్ఫలార్థి
నీవు కీర్తి ప్రియుండవే నిష్క్రియుండ
సకల సుఖ భోగి నీవె ప్రసాదముక్తి
సన్నిహితుడను నీవెంట జెన్నమల్లు!

## ప్రసాది స్థలం

సీ|| కాయంబు నింద్రి యోత్కర వలను నర్పించి
సంధిల్లు కాయ ప్రసాది యేని
ప్రాణంబు సత్క్రియాపదమును నర్పించి
సాధించు పాణప్రసాది యేని
శబ్దంబు దచ్చబ్ద సౌఖ్యంబు నర్పించి
శబ్దించు వచన ప్రసాదియేని
గమనంబుగ మన సంగతియును నర్పించి
చననేర్చు గమన ప్రసాదియేని

గీ||	తలపులను జేష్టలను నర్పితంబుసేసి
సంచరించు వ్యాపార ప్రసాదియేని
అట్టి సర్వ సంపూర్ణ మహా ప్రసాద
సన్నిహితులను జేర్పుమీ చెన్నమల్లు!

## ప్రాణలింగి స్థలం

సీ||	కాయంబునందు నిన్ బాయకుండిన లీల
ప్రాణంబు నందున బాయడేని
వెలయ జాగ్రదవస్థ దలచిన యమ్మాడ్కి
నలరు స్వప్నావస్థ దలచెనేని
వెలుపలి దృష్టుల వీక్షించు విధమున
భావంబు నందున బదిలుడేని
బాహ్యార్పణంబున బరవశుడైనట్టి
మానసార్పిత సావధానియేని

ఆ||	నతని జెప్పునొప్పు ననిశంబు నతనిసాం
గత్యమొప్పు నతని గన్న నొప్పు
నట్లుగాన నీ మహాభక్తి యుక్తుల
జేర్చిప్రోవు నన్ను జెన్నమల్లు!

## శరణ స్థలం

సీ||	చేసిన నుపచారి సేయమి సోమరి
ఫలము గోరక చేయ భక్తవరుడు
పొగడిన బ్రౌఢుండు పొగడమి మూఢుండు
నిరవెర్గి పొగడగ వీశ్వరుండు
వలెనన్న సంసారి వలదన్న నిర్మోహి
వలద నర్పిత మన్న వరప్రసాది
తలచిన సువిధాని తలపమిన ధ్యైతి
తన్ను మర్వదలప దత్త్వవిదుడు.

ఆ॥ అట్లుగాన దజ్ఞాలకు మహాభక్తుల
సరసలింగ కవుల సత్ప్రసాద
రతుల బరమ తత్త్వయుతుల మహాత్ములఁ
జేర్పవయ్య నన్ను జెన్నమల్లు!

## ఐక్య స్థలం

సీ॥ ధర 'నవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ'
యను కర్మయోగంబు నపహసించి
యేదియులేక 'జ్ఞానా దేవమోక్ష'మన్
జ్ఞానయోగంబు హాస్యంబు చేసి
వదలక "యాత్మనామిద మగ్ర జే"త్తను
ధ్యాన యోగంబును నాశ్రయించి
తగ "సచపూజ్యోయ ధాహ్యాహ" మ్మను భక్తి
యోగంబు ముక్కికి జేగ గాఁగ

గీ॥ తివిరి పొదలు పరమ శివయోగసుఖసుధా
శరధి మఱచి తన్ను జగము మఱచి
లింగగతి జరించు లింగలింగైక్యుల
జేర్పవయ్య నన్ను జెన్నమల్లు!

క॥ చెనమల్లేశ్వరు పేరిట
సునిశితముగ బాలకురికి సోమేశుడుదా
ఘన భక్తి వెలయ జెప్పెను
చెనమలు సీసంబు లనగ జలగ ధరిత్రిన్

క॥ ఈ సీసము లేవేళను
భాసురముగ ఒతన సేయుభక్తుల కిలలో
నొసిగ భుక్తియును ముక్తియు
నా సర్వేశ్వరుడొసంగు ననవరతంబున్

## శివలింగం

అవ్యక్తం, నిర్గుణం, నిరాకారం, నిరహంకారం, నిరవద్యం, అయినది శివలింగం. అవ్యక్తం లింగాకృతిని విశ్వవ్యాప్తం చేసింది. ఆకాశలింగం, వాయు లింగం, తేజోలింగం, ఆపోలింగం, పృధ్వీ లింగం అవ్యక్తానికి వ్యక్తస్వరూపాలు. అవ్యక్త లింగ స్వరూపాలలో పార్థివ లింగం సగుణ నిర్గుణ స్వరూపాల్ని కలిగి పూజాపాత్రమైంది. పార్థివ లింగాన్ని స్త్రీ పుంసయోగ చిహ్నంగా కొందరు పండితులు నిర్ణయించినప్పటికీ, మహత్తునకు బీజచిహ్నంగా పున్నలింగమునకు ఈ లక్షణం అప్రధానంగా చెప్పబడుతున్నది. లింగం షడక్షరీ మంత్ర రూపమని శైవాగమాలు విశదం చేస్తున్నాయి. ఈ లింగం ఆకాశాది పంచభూతాల్లో గోచర మవుతూ వుంది.

శివలింగాన్ని వర్ణ వివక్షత లేకుండా, అన్ని వర్గాల వారు పూజిస్తున్నారు. బ్రాహ్మణులు దేవతార్చనల్లోను, అన్ని వర్ణాల వారు దేవాలయాల్లోనూ నివాసాల్లోను శివలింగాన్ని భక్తి ప్రపత్తులతోను, ధృడ చిత్తంతోనూ కొలుస్తున్నారు. లింగధారులు శివలింగాన్ని స్వీయాంగాల్లో ధరిస్తూ శైవులుగా, వీర శైవులుగా ఖ్యాతి కెక్కారు. లింగధారణం గూఢార్థాన్ని, బాహ్యార్థాన్ని కలిగి వీరశైవానికి అపూర్వమైన వ్యక్తి త్వాన్ని కలుగ జేస్తుందని చెప్పవచ్చు.

# వీరశైవ సాహిత్యం పై వెలువడ్డ పరిశోధనలు

వీరశైవమత సాహిత్యాన్ని గురించిన పరిశోధన 18వ శతాబ్దం పూర్వార్ధంలోనే సి.పి. బ్రౌను దొర ప్రారంభించారు. బసవపురాణం, పండితారాధ్య చరిత్ర, ప్రభులింగలీల, చెన్న బసవపురాణం మొదలైన గ్రంధాల తాళపత్ర ప్రతుల్ని బ్రౌను దొర సేకరించారు. గ్రంధాల సేకరణతో పాటు వీరశైవ మత సంప్రదాయాల్ని కూడా అధ్యయనం చేసి ' The Creed, Customs and literature of Jangams' అనే వ్యాసాన్ని ప్రచురించారు.

1920లో పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి ఆంధ్ర పత్రిక రౌద్రి సంవత్సరాది సంచికలో ద్విపద కవిత్వాన్ని గురించి ఒక వ్యాసం వ్రాశారు. 1922లో బండారు తమ్మయ్య ఆంధ్రపత్రిక దుందుభి సంవత్సరాది సంచికలో పాల్కురికి సోమనాధుని గురించి అతని కృతుల గురించి విపులమైన వ్యాసం వ్రాశారు.

1923లో శ్రీ నిడదవోలు వేంకటరావు సోమన కాలంపై ఒక వ్యాసం వ్రాశారు. 1924లో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి శివకవుల గురించి ఒక వ్యాసం 1925లో శ్రీ నిడదవోలు వేంకటరావు 'నన్నెచూడ - పాల్కురికి పోలికలు', 'పాల్కురికి సోమనాధుని గురు ప్రశంస - వృషాధిప శతకం' అనే వ్యాసాలు, 1926లో శ్రీ నిడద వోలు 'పండితత్రయం' వ్యాసాలు వెలుగు చూశాయి.

1926లో ఆంధ్ర గ్రంధమాల వారు శ్రీ ప్రభాకరశాస్త్రి పరిష్కరించిన బసవపురాణాన్ని ప్రకటించారు. దీనికి ప్రభాకర శాస్త్రి 88 పేజీల పీఠిక రచించారు.

1939 లో ఆంధ్ర గ్రంథమాల వారు శ్రీ చిలుకూరి నారాయణ రావు గారి విపుల పీఠికతో పండితారాధ్య చరిత్రను ప్రచురించారు. ఈ విధంగా వీరశైవ సాహిత్య పరిశోధన తెలుగులో క్రమ క్రమంగా బలపడసాగింది.

విశ్వవిద్యాలయాల్లో పిహెచ్.డి. పట్టం కోసం పరిశోధనలారంభమయ్యాయి. ఇలాంటి పరిశోధకుల్లో మొదటి వారు డాక్టర్ చిలుకూరి నారాయణ రావుగారు. వీరి శిష్యులే జీరెడ్డి చెన్నారెడ్డి గారు. గురువు పండితా రాధ్యచరిత్రకు పీఠిక వ్రాస్తే, శిష్యుడు తెలుగు సాహిత్యంపై వీరశైవ సాహిత్య ప్రభావాన్ని గుర్తించారు.

తర్వాత ఎం. ఆదిలక్ష్మి గారు 1954 - 57 మధ్యకాలంలో మద్రాసు విశ్వవిద్యాలయంలో "Saivism in Telugu Literature and its contribution to South Indian Culture" అనే అంశం పై ఆంగ్లంలో సిద్ధాంత గ్రంథం రచించారు. తర్వాతి గ్రంథాలుగా జీరెడ్డి చెన్నారెడ్డి గారు రచించిన, "తెలుగు సాహిత్యంపై వీరశైవమత ప్రభావం", తిమ్మావఝ్ఝుల కోదండ రామయ్య గారి "ఆంధ్ర సాహిత్యంలో దేశి కవితోద్యమం - పాల్కురికి సోమనాథుని పాత్ర", పండితారాధ్యుల వీరేశలింగం గారి "పాల్కురికి సోమన - అతని కృతులు", వి. నరసింహారెడ్డిగారి "పాల్కురికి సోమనాథుని కృతులు - పరిశీలన"లను చెప్పవచ్చు.

వేదకాలం నుంచి వుండే శైవమే అవాంతర శాఖలుగా విస్తరించి చివరికి వీరశైవంగా స్థిరపడిందని చెన్నారెడ్డి గారు అభిప్రాయ పడ్డారు. ఈ పరిణామం మొదట కన్నడ దేశంలో బసవేశ్వరుని ప్రభావం వల్ల జరిగిందని కూడా నిరూపించారు. ఈ బసవేశ్వరుని జీవిత విశేషాల్ని తెలియ జేస్తూ వీరశైవమత సిద్ధాంతాలైన అష్టావరణాల్ని, పంచాచారాన్ని, షట్ స్థలాల్ని వివరించారు.

**అష్టావరణాలు** : గురువు, లింగం, జంగం, (గురు) పాదోదకం, (గురు) ప్రసాదం, భస్మం (విభూతి), రుద్రాక్ష, మంత్రం.

**పంచాచారాలు** : సదాచారం, శివాచారం, లింగాచారం, గణాచారం భృత్యాచారం.

**షట్ స్థలాలు** : భక్త, మహేశ్వర, ప్రసాద, ప్రాణలింగ, శరణ, ఐక్య స్థలాలు.

ఆచార్య జీరెడ్డి చెన్నారెడ్డి గారు "తెలుగు సాహిత్యంపై వీరశైవ మత ప్రభావం" అనే తమ సిద్ధాంత గ్రంథంలో శైవ మత పరిణామ చరిత్రను తెలియజేశారు. వేదాలలో, ఆగమాలలో, ఉపనిషత్తులలో, పురాణేతిహాసాల్లో శైవం ఎలా నిరూపింపబడిందో వివరించారు. శైవంలోని అవాంతర శైవ శాఖలన్నీ కాలక్రమంలో వీరశైవంగా ఎలా పరిణమించాయో నిరూపించారు. వేదాలలోని రుద్రుడు, ఉపనిష్కతాలంలో శివునిలో ఐక్యం చెందాడని, వేదాలలో రుద్ర శాబ్దానికి, ఉపనిషత్తులలో శివశబ్దానికి ప్రాధాన్యం వుందని రెడ్డిగారు నిరూపించారు. ఆగమాలలో శివాగమాలు వేరు, రుద్రాగమాలు వేరు అని స్పష్టం చేయడం ఈ సిద్ధాంత గ్రంథంలోని విశేషం.

శివాగమాలు పది, రుద్రా గమాలు పెద్దెనిమిది వున్నాయి. శివాగమాలు శివప్రోక్తాలు, రుద్రాగమాలు మనుష్యప్రోక్తాలు. ఈ శివాగమాలు నాలుగు రకాల శైవమత భేదాల్ని గురించి చెపుతున్నాయి. అది సామాన్య శైవం, మిశ్రశైవం, శుద్ధ శైవం, వీర శైవం. దేశకాల భేదాల్ని బట్టి ఈ నాలుగు విధాల శైవ భేదాలు ఎనిమిది అవాంతర శాఖలుగా రూపొందాయి. వీటిలో నాలుగు ఉత్తర భారత దేశంలోను, మిగతా నాలుగు దక్షిణ భారత దేశంలోను వ్యాప్తిలోకి వచ్చాయి. అవి కాశ్మీర శైవం, పాశుపతం, కాపాలికం, రసేశ్వరం (ఉత్తర భారతం); గోరక్ష నాథ సంప్రదాయం (మహారాష్ట్ర), కాలాముఖం (కన్నడ దేశం), శైవ సిద్ధాంతం (తమిళదేశం), వీరశైవం (కన్నడ దేశం, తెలుగు దేశం) (దక్షిణ భారతం).

వేద కాలం నుంచి వున్న శైవమే ఇలా అవాంతర శాఖలుగా విస్తరించి, చివరకు వీరశైవంగా స్థిరపడిందని చెన్నారెడ్డి గారు సోదాహరణంగా నిరూపించారు. ఈ పరిణామం తొలుత కన్నడ దేశంలో బసవేశ్వరుని ప్రభావం వల్ల జరిగిందని కూడా ఆయన తెలిపారు. ఈ బసవేశ్వరుని జీవిత విశేషాల్ని తెలియ జేస్తూ వీర శైవ మత సిద్ధాంతాలైన అష్టావరణాలను, పంచాచారాలను, షట్ స్థలాల్ని వివరించారు. వీరశైవ మతం లోని ఈ సిద్ధాంతాల్ని వివరించడమే గాకుండా, చెన్నారెడ్డి గారు వీరశైవ ధర్మ ముఖ్యలక్షణాన్ని తెలియజేశారు. అవి :

1. దైవం ఒక్కడే. అతడు సాకారుడు, నిరాకారుడు. అతన్ని ఇష్ట ప్రాణలింగ రూపాల్లో అర్చించాలి.
2. విశ్వంలో శివ, శక్తి అనే రెండు మూల వస్తువులున్నాయి. సృష్టి, స్థితి, లయలకు ఇవే కారణాలు.
3. వర్ణ, ఆశ్రమ, స్పృశ్య, అస్పృశ్య భేదాలు పాటించకూడదు.
4. స్త్రీ పురుషులు ఇద్దరూ మోక్షానికి సమానంగా అర్హులే.
5. అష్టావరణాలను, పంచాచారాలను, షట్ స్థలాలను తెలిసి ఆచరించాలి.
6. స్థావరాల కంటే (విగ్రహాది కాల కంటే), చరాలు (జంగాలు) అధికమని నమ్మాలి.

7. వేదాగమాలను గౌరవించినా, కర్మకాండను త్యజించాలి.

8. శివునికి, శివ శరణులకు (భక్తులకు) అభేదమని తెలుసుకోవాలి.

9. శరీరమే దేవాలయం అనే భావాన్ని గౌరవించాలి.

కర్ణాటాంధ్ర దేశాల్లో బసవేశ్వరుడు, మల్లికార్జున పండితారాధ్యుడు వ్యాపింపజేసిన వీరశైవమతానికి ఒక విశిష్ట స్థాయిని కల్పించిన మహాకవిగా పాల్కురికి సోమనాథుని పేర్కొనవచ్చు.

The term 'Vira Saivism' might have been derived in the following manner though it has been actually defined in the supporting literature differently. To establish one's Own bhakti to Lord Sıva in unequivocal terms, the bhakta willingly sacrifices any precious thing of his - it may be even one of his limbs. That is what is meant by the term vira. The Viratra or the valour lies in the Quality of one's own readiness to sacrifice to any extent for the sake or proving his devoutness to siva. The Basava Purana and Panditaradhya Charitra of Palkurıkı Somana abound in stories of such bhaktas who could sacrifice everything for appearing Siva.

*(Prof. J. Chenna Reddy's Research Work "The influence of Veera Saivism on Telugu Literature")*

**FOOT NOTES :**

## 1. పాల్కురికి సోమనాథుని జీవిత నేపథ్యం

(1) "ప్రమథానీక కథార్ణవేందు హరిదేవాచార్యనం ధైర్యనం
సముదంచ ద్వృషభస్తవామర మహీజారామనం సోమనం
విమలజ్ఞాన సుదీపికా స్ఫురితిచేతః సద్మనం సద్మనం
క్రమదిందం బలగొండు పేళ్వెనెసె దానీ కావ్యమం సేన్యము"
(పూర్వకవిస్తుతి ప్రకరణ పద్యం - ఉద్భటకావ్యం)

(2) పండితారాధ్య కృపా సముద్గతుఁడు
మండిత సద్భక్తి మార్గప్రచారి
విలసిత పరమ సంవిత్సు ఖాంభోది
నలి గరస్థలి సోమనాథయ్యగారు
(పింగళి లక్ష్మీకాంతంగారి 'ఆంధ్రసాహిత్య చరిత్ర' - 123వ పేజీ)

(3) అంత రాజ్యార్థమై అనిసేసి అతని
సంతానమెల్ల నిస్సంతానమయ్యె
బసవని సత్యశాపమున గాజేసి
బసజని కటకంబు పాడయ్యెనంత
(పింగళి లక్ష్మీకాంతంగారి 'ఆంధ్రసాహిత్య చరిత్ర' - 124వ పేజీ)

(4) అను కంపాతి శయంబునఁ
దన దక్షిణ నేత్రమును సుధారోచియకా
నను వింతలేక చూచి వ
దనమున దరహాస రసమురళు కొత్తంగన్
(తిక్కన 'భారతావతారిక'లోని పద్యం)

(5) త్రిపురాంతకంలోని శాసనాలు

(6) పండితారాధ్య చరిత్ర పీఠిక

(7) (కాకతీయ సంచిక - 208వ పేజీ)

(8) సీ|| ఒకనాడు శివభక్తు లోరుగంటను స్వయంభూదేవు
మంటపమున వసించి
బసవపురాణంబు పాటించి వినువేళ హరునిఁగొల్వ
ప్రతాపుఁడచటికేఁగి
యా సంభ్రమం బేమియనుడు భక్తులు బసవని పురాణం
బర్థి వినెదరనిన,
వినియా పురాణంబు విధమెట్లకోయన్న ధూర్త విప్రుఁడొకం
భర్తఁజేరి

ఆ|| వె|| పాలకురికి సోమ పతితుఁడీనడుమను పెనచె మధ్య
వళ్లుపెట్టి ద్వీపద
యప్రమాణమిది యానాద్యంబు పదమన్న నరిగెరాజు;
భక్తులది యెఱింగి

## 2. సోమన సాహిత్య నేపథ్యం

(1) "బసవపురాణంబు, పండితారాధ్యుల చరితంబు,
ననుభవసారమును, జ
తుర్వేద సారసూక్తులు, సోమనాథ భాష్యంబును, రుద్రభాష్యంబు
బసవ
రగడ, గంగోత్పత్తి రగడ, శ్రీ బసవాధ్యరగడయు,
సద్గురు రగడ, చెన్న
మల్లు సీసములు, నమస్కారగద్య, వృషాధిపశతకంబు, నక్షరాంక
గద్యపద్యముల్, పంచప్రకారగద్య, అష్టకము, పంచకము
నుదాహరణయుగము
నాదియగుకృతుల్ భక్తతహితార్థ బుద్ధిఁజెప్పెనవి భక్తసభలలోఁ
జెల్లుచుందు

(2) వేణుగోపాల శతక కర్త ద్విపదను 'ద్విపద కావ్యంబు
ముదిలంజదిడ్డికంత' అని ఈ సడించియున్నాడు.

(3) "జాతులు మాత్రాను సంధాను గణవి
నీతులు గాన 'యని యతగణౖ' ర
నియును 'బ్రాసోమ' యనియు యతిర్వాయ
నియు జెప్ప ఛందోవిని హితోక్తి గాన
ప్రాసయైనను యతిపై వడియైన
దేసిగా నిలిపి యాది ప్రాస నియతి
తప్పకుండం ద్విపదలు రచియింతు"

(4) "శ్రీ మందిరాకారు జిత దైత్యధీరు
గీర్తించు మోబుణ్యా వర్త నుండనుచు
యతిమాఱు ప్రాసమిట్లచ్చోట నిడకొ"

(5) "మునుబసవపురాణమున నెన్నఁబడిన
పెనుపారు జనులకు పెంపుడు కొడుక
బసవని పుత్రుండ, బసవ గోత్రుండ" (పండితారాధ్య చరిత్ర)

(6) "బసవడు ప్రీతిగైకొనియె భక్తిమెయిన్ రచియించె సోముఁడున్
బసవపురాణమంచు మును ప్రస్తుతి చేయుదురట్లుగాననీ
యసమదయాధురీణతకు నంకిలిపాటు ఘటిల్ల కుండనన్
బనగొని బ్రోవుమయ బసవా! బసవా! బసవా! వృషాధిపా!
(వృషాధిప శతకం)

## 3. వీరశైవతత్వం

(1) జ్ఞానస్వరూపుడై సర్వాతుడున్నఁదా
జ్ఞేయ స్వరూపయై నెఱసియుండుఁ
బురుష స్వరూపుడై పరమేశుఁడున్నదాఁ
బ్రకృతి స్వరూపమై పరగుచుండు
సూక్ష్మస్వరూపమై శుద్ధాత్ముఁడున్నఁదా
స్థూలస్వరూపమై తొఁచియుండు
నర్థ స్వరూపుడై యమలాత్ముఁడున్నఁదా
శబ్ద స్వరూపమై జరుగుచుండు
హరుఁడు రుద్రరూపమై యున్నఁదా సుమా

మూర్తిదాల్చి లోకములకు హితము
సేయుచుండు ఁగాన శివభక్తి భేదంబు
లెఱుఁగనీకు జడున కెంతలావు

(కుమార సంభవం - నన్నెచోడుడు)

(2) కం|| వారిరువురు సర్వధిశ
క్త్యారాధనచేసి రతిశయ స్థింభక్తిన్
కోరిక వదలక తమ కడు
పార సతీదేవి కూతురై జన్మింపన్

(కుమార సంభవం - నన్నెచోడుడు)

## 4. భక్తి - నిర్వచనం, కవులు నిర్వచించిన భక్తితత్వం

(1) పూజ్యేష్వనురాగో భక్తిరిత్యుపదేశః

(శబ్దకల్పద్రుమం)

(2) అథాతో భక్తి జిజ్ఞాసా సాపరానురక్తి రీశ్వరే

(శాండిల్య భక్తి సూత్రం)

(3) గీతాభాష్యం - రామానుజులు (18 - 66)

(4) తైత్తీరీయారణ్యకం. ఈ అరణ్యకంలో ఆరుణి ప్రజాపతిని ఆత్మ కళ్యాణం కోసం ఉత్కృష్టమైన ఉపాయాన్ని కోరుతాడు. అందుకు ప్రజాపతి సత్యం, తపం, దమల, శమం, దానం, ధర్మం, ప్రజోత్పత్తి, అగ్నిపూజ, అగ్నిహోత్ర, యజ్ఞ, మానస, ఉపాసన, న్యాసాల్ని బోధించి అందులో న్యాసం శ్రేష్ఠమని ఉపదేశిస్తాడు.

(5) వయం ధ్యాతేత్వే ఇద్ వింద్ర విప్రా అపిష్మసి

(ఋగ్వేదం 8 - 66 - 13)

(6) “ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే”

(7) యాప్రీతిరస్తి విషయేష్వ వివేకభాజాం
సైవాచ్యుతే భవతి భక్తి పదాభిధేయం
భక్తిస్తుకామ ఇవ తత్కమనీయరూపే
తస్మాన్మునేర జనికాముక వాక్యభంగీ

(నారదుని భక్తి సూత్రాలు - 18వ పేజీ)

(8) భక్తి రస్యభజనం, ఏతదిహా ముత్రోపాధి నైరాశ్యేనాముష్మిక

(9) "యా ప్రీతి రవివేకానాం విషయేష్వన పాయినీ
త్వాం అనుస్మరత సాయేహృదయాన్మాపనర్పతు"

(విష్ణుపురాణం 1-206)

(10) "మహాత్మ్య జ్ఞాన పూర్వస్తు సుదృఢః సర్వతోఽధికః,
స్నేహోభక్తి రితి ప్రోక్తస్తయా ముక్తిర్న చాన్యథా
జ్ఞానపూర్వః పరస్నేహో నిత్యాభక్తి రితీర్యతే
(మధ్వాచార్యులు - మహాభారత తాత్పర్య నిర్ణయం - నారదుని
భక్తి సూత్రాలు - 22వ పేజీ)

(11) "అనన్యమమతా విష్ణౌమమతా ప్రేమ సంగతా,
భక్తి రిత్యుచ్యతే, భీష్మ ప్రహ్లాదోద్భవ నారదైః"
(నారద పాంచరాత్రము - నారదుని భక్తి సూత్రాలు - 17వ పేజీ)

(12) "రాజసీ తామసీ శుద్ధ సాత్త్వికీ, మిశ్రితాచసా,
ఈర్ష్యాతి ద్వేషజాఽర్యా స్యాద్భయజ ద్వేషజాపరా
హర్షజా శుద్ధ సత్త్వోత్థా కామశోకాది జేతరా,
సత్త్వ జత్వేడు సర్వాసాం గుణాంతర కృతాభిదా"

(భక్తి రసాయనం - 41 - 42 శ్లోకాలు)

(13) "యధా వైరానుబంధేన మత్యస్తన్మయతామయాత్
నతథాభక్తి యోగేన ఇతిమే నిశ్చితామతిః

(14) శ్లో॥ నరత్వం దేవత్వం నగవన మృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాది జననం,
సదాత్వత్పాదాబ్జ స్మరణ పరమానందలహరీ
విహారాసక్తం చేద్హృదయ మిహకింతేన వపుషా
(శివానందలహరి - 10వ శ్లోకం)

## 6. వీరవైష్ణవులలో ముగ్ధభక్తులు

(1) "కారిమారసూతుని చక్కని మాటలకు చొక్కి
చూరగా వేదాలగుట్టు చూచినవాడు
తీరని వేడుకతో తిరుమంగయాళువారి
అరడి ముచ్చిమిగూడి కాసపడ్డవాడు
పెరిమాళు వారిబిడ్డ పిసికి పైవేసిన
విరులదండల మెడ వేసినవాడు" అని
అన్నమయ్య నమ్మాళ్వారును, తిరుమంగై ఆళ్వారును, పెరియాళ్వారును, గోదాదేవిని ప్రస్తావించాడు.
(అన్నమయ్య 15వ సంకీర్తన వాఙ్మయం)

## 8. పురాణ లక్షణాలు

(1) "అన్యాన్యుపపురాణాని, మునిభిః కధితాన్యపి
(ఉపపురాణ నిర్వచనం - కూర్మపురాణం)

## 10. వీరశైవులలో ముగ్ధభక్తులు

(1) "ప్రబభ్రవే వృషభాయ శ్వితీచే మహోమహీం సుష్టుతి మీరయామి"
(ఋగ్వేదం 11 - 33 - 8)

(2) "పాలేల యారగింపవో లింగమూర్తి, కాచుట చాలదో
కమ్మవల్వమినో? ప్రాఁచియో విఱిగినో పడుచనేననియో?
ప్రొద్దెక్కెనో యొండెఁబొగయు వచ్చెడినొ? బుద్ధి
వుట్టదో నెయ్యివోయకుండితినో? కడువేఁడియో?
నీరుగలసిన వనియొ? ఎడవాద్యములు లేక యేనె
తెచ్చితినొ? చాలవోయివి యాల పాలుగావనియొ?
పాలపై ఁజిత్తమేఁ బఱపితిననియొ?"
(బసవపురాణం - గొడగూచి కథ)

# ఉపయుక్త గ్రంథసూచి


| గ్రంథం పేరు | గ్రంథకర్త పేరు |
|---|---|
| ఆంధ్ర సాహిత్య చరిత్ర | శ్రీ పింగళి లక్ష్మీకాంతం |
| ఆచార్య జీరెడ్డి చెన్నారెడ్డి గారి సహస్ర చంద్రోదయ దర్శనోత్సవ అభినందన సంచిక | |
| తెలుగులో ద్విపద సాహిత్యం | డాక్టర్ గూడూరు నాగయ్య |
| తెలుగులో దేశకవిత, పాల్కురికి సోమన పాత్ర | శ్రీ టి. కోదండరామయ్య |
| తెలుగు సాహిత్యం - శైవమత ప్రభావం | డాక్టర్ వి. రత్నమోహిని |
| తెలుగు సాహిత్య సమీక్ష (మొదటి భాగం) | డాక్టర్ జి. నాగయ్య |
| నారదుని భక్తిసూత్రములు | శ్రీ తిరుమలాచార్యులు |
| శ్రీ పండితా రాధ్యచరిత్ర | శ్రీ పాల్కురికి సోమనాథుడు |
| పురాణములు | శ్రీ చిపుకుల అప్పయ్య శాస్త్రి |
| పాల్కురికి సోమనాథ కవి | శ్రీ బండారు తమ్మయ్య |
| పాల్కురికి సోమనాథుడెప్పటి వాడు? | శ్రీ నేలటూరి వెంకటరమణయ్య |
| పాల్కురికి సోమనాథుని లఘుకృతులు | శ్రీ బండారు తమ్మయ్య |
| ప్రాచీనాంధ్ర సాహిత్యం - మధుర భక్తి | శ్రీ డి. వెంకటేశ్వరరావు. |
| బసవ పురాణం | శ్రీ పాల్కురికి సోమనాథుడు |
| బసవ పురాణం | శ్రీ పిడపర్తి సోమనాథుడు |
| మార్కండేయ పురాణం (పద్య) | శ్రీ మండ కామేశ్వర కవి |
| మార్కండేయ పురాణం (వచన) | శ్రీ దీక్షితులు |
| వచన బసవ పురాణం | శ్రీ నిడదవోలు వేంకటరావు |

| గ్రంథం పేరు | గ్రంథకర్త పేరు |
|---|---|
| Essentials of Veera Saivism | Sri H.P Malladevaraya<br>Bharatiya Vidya |
| Linguistics Pecularities of the Works of Somana | Sri R. Venkata Subbaiah |
| The Influence of Veera Saivism on Telugu Literature | Prof. J. Chenna Reddy |
| Telugu Kavula Birudamulu - Oka Pariseelana | Sri K.M. Srihari |
| The treatment of the story of Srisaila in Telugu | Sri T. Damodaram |
| Telugulo Srisaila Kshetra Sahitya Sameeksha | Sri K. Sreenivasappa |



## BIO-DATA

| | | |
|---|---|---|
| పేరు | : | **గొల్లపూడి వెంకట దుర్గాప్రసాద్** |
| జననం | : | ధర్మవరం, అనంతపురం జిల్లా |
| తల్లిదండ్రులు | : | శ్రీ జి పి తిరుపతి రావు, శ్రీమతి జి.సి. లక్ష్మి |
| ప్రాథమిక విద్యాభ్యాసం | : | ప్రభుత్వ జూనియర్ కళాశాల, ధర్మవరం |
| ఉన్నత విద్యా భ్యాసం | : | సర్వోదయా కళాశాల, నెల్లూరు (డిగ్రీ) |
| | | ఎస్.వి.యు. పి.జి. సెంటర్, కర్నూలు (ఎం.ఎ తెలుగు) |
| | | ఎస్.వి యూనివర్శిటీ, తిరుపతి (పిహెచ్.డి.) |
| చిరునామా | : | డా. జి.వి దుర్గాప్రసాద్<br>డోర్ నెం. 138H2, టి కె. స్ట్రీట్<br>తిరుపతి |

కీర్తి ఆఫ్‌సెట్, తిరుపతి